ముఖచిత్రం : కె. యల్. కుమారస్వామి

కవర్ డిజైన్ : ఆనంద్




సంపుటి : 8 జనవరి 1986 సంచిక : 12

## ఈ నెల సమగ్ర నవల

వాళ్ళు నలుగురు!
కాలేజీ రోజుల్నుంచీ వున్న ప్రాణస్నేహం ఆ నలుగుర్నీ ఆ తర్వాత కూడా సన్నిహితంగా బంధించి వుంచింది.
ఒకరికి చిత్రలేఖనంలో అభినివేశం!
మరొకరికి సంగీతంపై అభిరుచి!
ఇంకొకరికి పుస్తకపఠనాభిలాష!
ఆ ముగ్గురి ఇష్టాలపై రెట్టింపు ఇష్టాన్ని పెంచుకుంది నాల్గవ నేస్తం!
ఆ ప్రభావంతో...''స్నేహం, ప్రేమ నా జీవితాశయం'' అని చెప్పుకున్న...




కి ఆ తర్వాత ఎదురయిన అనుభవాలేమిటి?
చివరికి ఆమె-''చిన్నప్పటినుంచీ మీరే-పాటలుపాడీ, బొమ్మలువేసీ, దొరికిన పుస్తకమల్లా నాచేత చదివించీ-నాకీ పిచ్చి ఎక్కించారు. ఇపుడు మీరు హాయిగా సంసారాలు చేసుకుంటుంటే నేనింకా ఈ పిచ్చిలోనేపడి కొట్టుకుంటున్నాను'' అని ఎందుకు అనవలసి వచ్చింది?
ఆమె అలా తన స్నేహితురాళ్ళపై మోపిన ఆ అభియోగంలోని వాస్తవం ఏమిటి?

## ఓల్గా

మన పురుషాధిక్య సమాజంలో వివాహానంతరం స్త్రీ జీవితంచెందే పరిణామాల్ని, భిన్నస్వభావాలుగల భర్తల కనుగుణంగా భార్యలు అవలంబిస్తున్న రాజీమార్గాల్ని ఆలోచనలు రేకెత్తించే విధంగా చిత్రించిన రచన 'సహజ' ఈనెల చతుర సమగ్ర నవల!

## ఢాం....ఢాం....!

పిస్టల్‌ని కనుగొని 650 ఏళ్లు దాటి పోయింది. 1300వ సంవత్సరం దరిదాపుల్లోనే ఇటలీలో ఆత్మరక్షణపై వెలువడిన ఓ లిఖిత ప్రతికలో పిస్టల్, బుల్లెట్ల గురించి సవివరంగా పేర్కొన్నారు.

మొదట్లో పిస్టళ్లు, తుపాకులను పాత భవంతులను పడగొట్టేందుకు మటుకే వుపయోగించేవారట! క్రమంగా తుపాకులతో అడవి జంతువులను వేటాడటం, ఆ తర్వాత తోటివారిని కాల్చి చంపేందుకు సైతం ఆ ఆయుధాల్ని వాడటం అలవాటయింది.

పిస్టళ్లను మొదట వుపయోగించడం ప్రారంభించింది యూరోపియన్లు. అంతకు ముందు భారతీయులుగాని, చైనాదేశస్థులు గాని వాటిని వుపయోగించినట్లు చారిత్రక ఆధారాలేమీ లేవు. చైనాలో తుపాకుల వాడకం మొదలైంది 1520లోనే!

'మొట్టమొదటి పిస్టల్‌ని తయారు చేసింది బెర్ట్ హోల్డ్ సివార్ట్స్! అతను ఏ జాతీయుడనే విషయంపై భిన్నాభిప్రాయాలున్నాయి. అతన్ని కొందరు 'డేనిష్' అంటే, మరికొందరు గ్రీకు వాడనీ, ఇంకొందరు నీగ్రో అనీ వాదిస్తారు. 'వేల్స్'కి చెందినవాడనీ, వెస్టిండీస్‌దీవుల్లోని 'డొమినికన్'కి చెందిన క్రైస్తవ మత గురువు అనీ కూడా నమ్ముతారు. ఇలా అతని జాతీయత ఇప్పటికీ వివాదాస్పదంగానే వుంది.

అదేవిధంగా పిస్టళ్లను ఎప్పుడు కనుగొన్నదీ ఖచ్చితంగా తెలలేదు. చరిత్రకారులు పిస్టళ్ల పుట్టుక 1250, 1313, 1320, 1354, 1359, 1380 – ఇలా



## చతుర ప్రపంచం

వేర్వేరు కాలాల్లో జరిగినట్లు ఇచ్చారు.

1331లో తొలిసారిగా యుద్ధరంగంలో తుపాకులను వాడారు. అలా మొదటగా జర్మన్లు ఇటలీపై జరిపిన యుద్ధంలో తుపాకులనుపయోగించి 'స్వీ డె ల్'

నగరాన్ని జయించారు.

ప్రస్తుతం అత్యధిక పిస్టళ్లుగల దేశాలలో అమెరికాదే ప్రథమ స్థానం. అమెరికాలో లైసెన్సు పొందిన పిస్టళ్లు గల వారు 6 కోట్లమంది వున్నారు. అదే విధంగా తుపాకిగుళ్ళకు బలయ్యేవారిలో ఎక్కువ మంది అమెరికన్లే! ఓ సంవత్సరంలో ఇంగ్లండ్‌లో 7గురు,స్విట్జర్లాండ్‌లో 34 మంది, పశ్చిమజర్మనీలో 4కిమంది పిస్టల్ కాల్పుల్లో చనిపోతే, అమెరికాలో ఏడాదికి సగటున 10,728 మంది పిస్టళ్ల వాతబడి చస్తున్నారు. అబ్రహామ్‌లింకన్, గాంధీజీ, మార్టిన్‌లూథర్ కింగ్, ఇందిరా గాంధీ, మొదలగు ప్రపంచ ప్రముఖులు పిస్టల్ వల్లనే దారుణంగా హతులయారు.

క్రితం సంవత్సరంలో అమెరికాలో కేవలం ప్రమాదవశాత్తూ పిస్టళ్లు పేలటం వలననే 3వేల మంది చనిపోయారు. వారిలో 750 మంది 14 ఏళ్ళ లోపు పిల్లలే! అమెరికాలో తల్లిదండ్రులు తమ యుక్తవయసు ఆడపిల్లల్ని ఆత్మ రక్షణకై పిస్టళ్లు దగ్గిరుంచుకోమని ప్రోత్సహిస్తారు.

దారుణమేమిటంటే, మానభంగానికి పాల్పడినవారికి బదులు అమ్మాయిలే ఎక్కువగా ఆ పిస్టళ్ల వల్ల హతులవుతున్నారు!

## చిలకల కలికి

ఇటలీకి చెందిన 'అల్బా'కి చిన్నప్పటి నుంచీ పక్షులంటే ఇష్టం! ప్రత్యేకంగా చిలకల్ని మరీ ఇష్టపడేది! ఆమె తల్లిదండ్రులు ఇద్దరూ సినీతారలే! అల్బావాళ్ళు నటించిన సినిమాలు చూస్తూ ఏవేవో వూహించుకునేది. తన తల్లిదండ్రులకి రెక్కలుంటే చిలకల్లానే ఎగిరేవారు కదా అని కలలుగనేది. మనుషుల్లానే చిలకల్ని రంగురంగుల దుస్తులతో అలంకరించినట్టు వూహించుకుని సంబరపడేది.

అల్బాకి అమెరికాలోని న్యూయార్క్ నివాసి మార్విన్‌తో వివాహమై అత్తవారింటికి వచ్చేసింది. ఆమెకు పుట్టిన కొడుక్కి ఇప్పుడు బడికి వెళ్ళే వయసొచ్చింది. ఆవిధంగా అల్బాకి కావలసినంత తీరిక దొరికింది. భర్త మార్విన్ నుంచి తగిన ప్రోత్సాహం లభించడంతో అల్బా 'దుస్తులతో అలంకరించదగు చిలకల' కోసం అన్వేషణ సాగించింది. చివరికి ఆరు చిలకలను ఎంచుకుని కొనుక్కుంది. చిలకలు తనకు బాగా మచ్చికయాక



వాటికి బట్టలు కుట్టించి తొడగటం మొదలు పెట్టింది అల్బా! వాటికి రోజూ రకరకాల బట్టలు మారుస్తుండటమే ఆమెకు మంచి కాలక్షేపమైంది. తన చిలకలన్నింటిలోకీ 'గెలాక్సీ'ని బాగా ఇష్టపడుతుంది అల్బా. ప్రేమ పెల్లుబికినపుడల్లా దాని ముక్కును పట్టి వూపి ముద్దు చేస్తుంది కూడా!

కాని, ఆ ప్రేమే ఆమెకు ఇబ్బంది కరంగా పరిణమించింది. గారాబు చిలక గెలాక్సీకి అల్బాతో మార్విన్ ముచ్చట్లాడటం నచ్చదు. అతను అల్బా దగ్గరి కొస్తుంటే బెదిరించడానికని ముక్కుతో పొడవబోతుంది. మార్విన్‌కి ప్రతి విషయాన్నీ తేలికగా తీసుకునే ధోరణి వుండటంవల్ల గెలాక్సీపై కోపం తెచ్చుకోకుండా, "భార్యలకి భయపడే భర్తలు అనేకమందివున్న ఈ లోకంలో, నాకు ఆమె పెంపుడు చిలకకి భయపడే గతి పట్టింది" అంటాడు నవ్వుతూ.

"గ్రీకులు, రోమన్లు కాలక్షేపంకోసం చిలకల్ని పెంచేవారు. కాని, నేను పెంచేది వినోదంకోసం. అవి విదూషకుల్లా నన్ను నవ్విస్తుంటాయి'' అనే అల్బా ప్రస్తుతం చిలకలపై ఆసక్తి పెచ్చు పెరిగి 200 చిలకల్ని కొనేసింది!

# నూరేళ్ళ బాలుడు

పినోకియో వందేళ్ళ బాలుడంటే ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. ఎందుకంటే- అతను ప్రాణమున్న మనిషికాదు. సరిగ్గా వందేళ్ళ క్రితం ఇటలీకిచెందిన రచయిత 'కార్లో లోరెన్‌జైన్' సృష్టించిన ఒక విచిత్ర బాలుడి పాత్ర పేరు 'పినోకియో'. అప్పులతో, దుర్భర దారిద్ర్యంతో అవస్థపడ్డ కార్లోకి తన కష్టాల్నించి గట్టెక్కే మార్గంగా రచనా వ్యాసంగం ఒక్కటే కనబడింది. అందుమీదట ఇటలీలో రెండు పేపర్లకి బాలలుచదివే కథలు రాయనారంభించాడు. ఆ విధంగా కార్లో పిల్లలకోసం చేసిన ఓ ధారావాహిక రచనలో నాయకుడిగా 'పినోకియో' ఆకస్మిక జననం సంభవించింది.

ఆ సీరియల్‌లోని పినోకియో ఓ వడ్రంగి రూపొందించిన కొయ్యబొమ్మ. పిల్లలులేని వడ్రంగి, అతని భార్య ఆ బొమ్మను చాలా అపురూపంగా చూసుకునేవాళ్లు. ఒకరోజు ఆ బొమ్మ ఇంట్లోంచి పారిపోవడంతో వడ్రంగి, భార్య ఎంతో దుఃఖిస్తారు. ఓ గంధర్వకన్య అది చూసి జాలిపడి, 'పినోకియో'ను వెదికి పట్టుకుని ప్రాణంపోసి, తెచ్చి వారికి అప్పగిస్తుంది.

ఆ తర్వాత పినోకియో చేసే మంచి పనులగురించి వర్ణించిన కథలు చదివి అందరూ అతన్ని ప్రేమించి, మెచ్చుకోసాగారు. ఆ విధంగా పినోకియో పాత్రతో రాసిన కథలు ఎంత పాఠకాదరణ పొందాయంటే, పిన్నలతోపాటు పెద్దవాళ్లుసైతం రాబోయే కథ చదివేందుకు అమితాసక్తితో ఎదురుచూసేవాళ్లు.

పినోకియో అనేక సాహసకృత్యాల్లో పాల్గొంటాడు. ధైర్యం, తెలివితేటలతో ఎన్నో ఆపదలను ఎదుర్కొంటాడు.



కార్లో 15 వారాల తర్వాత పినోకియోను చంపేసి సీరియల్ ముగించాడు. కాని, పినోకియో మరణం పాఠకులకెవరికీ నచ్చలేదు. దాన్ని వ్యతిరేకిస్తూ అందరూ కార్లోపై ఉత్తరాలతో దండెత్తారు. కార్లో వారి కోరికమేరకు -పినోకియో మళ్ళీ బతికి వచ్చినట్టు, గంధర్వకన్య అతన్ని మృత్యుంజయుణ్ని చేసినట్టు కల్పిస్తూ తిరిగి సీరియల్ రచన కొనసాగించాడు.

పినోకియో కథలు ప్రపంచవ్యాప్తంగా దాదాపు 80 భాషల్లోకి తర్జుమా అయి, వివిధ పత్రికలలో ప్రచురితమయాయి.

పినోకియోపై ఎనిమిది సినిమాలు వచ్చాయి. వాటిలో వాల్ట్‌డిస్నీ తీసిన సినిమాకి బాగా పేరొచ్చింది. దానిలో పినోకియో అబద్ధమాడినపుడల్లా ముక్కు ఉబ్బటంవల్ల, అతను ఎప్పుడూ నిజమే మాట్లాడతాడని చూపాడు వాల్ట్‌డిస్నీ!



## 'తోడువార్'లు

తమిళనాడులో దక్షిణ, ఉత్తర పర్వత పంక్తులు కలిసేచోట గోవ్, కురుంబ, తోడువార్ అనే ప్రాచీన గిరిజన జాతికి చెందిన ప్రజలు నివసిస్తున్నారు. ఈ మూడు జాతుల్లోకెల్లా దృఢంగా వుండే తోడువార్‌ల ఆచారాలు వింతగా వుంటాయి.

తోడువార్‌లు 18 వేల ఎకరాల విస్తీర్ణంగల ప్రాంతంలో నివసిస్తున్నారు.

వారు పాటించే కొన్ని వింత ఆచారాలు మనకు గమ్మత్తుగా అనిపిస్తాయి.

తోడువార్ యువతికి ఎందరైనా భర్తలుండవచ్చు. సామాన్యంగా వాళ్ల అన్నదమ్ములే అయివుంటారు. ఆ భర్తలంతా ఒకే ఇంట్లో నివసిస్తారు.

తోడువార్ యువతులు మగబిడ్డ పుడితే ఘనంగా పండగ చేసుకుంటారు. మగబిడ్డకి నామకరణోత్సవం దేవాలయంలో జరిపిస్తారు. ఆడపిల్లకయితే నామకరణం తంతు ఇంట్లోనే ముగిస్తారు.

తోడువార్ యువతులు అనేక రకాల పువ్వుల డిజైన్లతో పచ్చ పొడిపించుకుంటారు. వడ్లు దంచడం, నేతపని చేయడం, పాలనుంచి వివిధ పదార్థాలు తయారుచేయడం వారి ప్రధాన వ్యాపకం!

శాకాహారాన్నే ఎక్కువగా తినే వీరు శ్రమజీవులు. కొన్ని సందర్భాలలో వేణువు లాంటి వాయిద్యపు గానంతో ఉల్లాసం పొందుతారు. చనిపోయినవారికి అంత్యక్రియలు జరిపేటప్పుడు మాత్రమే నృత్యం చేస్తారు.

చాలామంది తోడువార్ యువతులు హిందూ దైవాలనే పూజిస్తారు. చంద్ర, సూర్యగ్రహణాలకు ఉపవాసముంటారు.

తోడువార్ యువతులు పెద్దల్ని ఎంతో గౌరవిస్తారు. పెద్దవాళ్లు ఎవరైనా వచ్చిన వెంటనే గౌరవసూచకంగా పాదాలను తాకుతారు.

వాళ్లు జుట్టును పొట్టి, పొడుగాటి జడలుగా అల్లుకుంటారు. 'గో-బా-దేవర్‌పాయ్' అనే వింత దుస్తుల్ని ధరిస్తారు. వాటిని పర్వత ప్రాంతాలలో విరివిగా పెరిగే ఓ చెట్టు వేరునుంచి తీసిన నారతో తయారుచేస్తారు.

తోడువార్‌లు పశువుల్ని శ్రద్ధగా పోషిస్తారు. గేదెల్ని పూజించడమేకాక కొన్ని ప్రత్యేక సందర్భాలలో గేదెలతో ఊరేగింపు జరుపుతారు.

పూర్వం తోడువార్ యువతులకి మొదటి సంతానంగా ఆడపిల్ల పుడితే చంపేసేవారు. ఈ ఆచారాన్ని అతిక్రమించినవారి ముక్కు తెగ్గోసేవారు. ఇప్పుడా ఆచారం రూపుమాసిపోయింది.

తోడువార్‌లు తమ ఇంటిని 'మండూ' అంటారు. ఒక్కొక్క మండూలో నాలుగైదు కుటుంబాలు కాపురముంటాయి!



# సహజ

ఓల్గా –



శారద మనసేమీ బాగోలేదు. బాధతో దిగులుతో, ఒంటరితనంతో బరువెక్కి పోయివుందది! ఈ బరువు ఇవాళ కొత్తగా వచ్చిపడింది కాదు. నాలుగైదేళ్ళుగా అంగుళం అంగుళం చొప్పున పేరు కుంటూవచ్చి చివరికివాళ పర్వతంలా తయారయింది. శారదకి బరువు దించు కోవాలనిపిస్తోంది. వెక్కివెక్కి ఏడ్చి గుండెల్లో పేరుకున్న దిగులు తగ్గించు కోవాలని ప్రయత్నిస్తోంది. కానీ ఇవాళ ఆమెకాశక్తి కూడా లేకుండాపోయింది. నిజానికి ఏడ్చి ఏంలాభం? ఇన్నాళ్ళూ ఆ ఏడుపునే ఆలంబనం చేసుకుంది. తన కోపాన్నీ, విచారాన్నీ, దిగుల్నీ నిరాశనూ అసంతృప్తినీ - అన్నిటినీ ఆ ఏడుపు ఆధారంతోటే మింగేసింది. అదొక్కటే చేయగలపని అన్నట్టుగా ఏడ్చేసింది. ఆ ఏడుపునే ఆధారం చేసుకుని బతకాల్సిన రోజులు ఇంకా ఉన్నాయని కూడా ఆమెకు తెలుసు.

శారదకివాళ ఏడుపు రావటంలేదు గానీ గతం గుర్తొస్తోంది.

జ్ఞాపకాల్లో తెల్లటి కాగితంమీద అందమైన గీతలు గీస్తున్న తన వేళ్ల కళ్ళముందు కదులుతున్నాయి. సన్నగా తెల్లగా వున్న ఆ చేతిలో ఎర్రని పెన్సిల్ చకచకా కదులుతోంది కాగితంమీద.

అప్పుడు...

పక్కనే కూర్చుని చూస్తున్న సహజ చటుక్కున శారద చేతిని తన చేతిలోకి తీసుకుని ముద్దుపెట్టుకుంది.

ఆశ్చర్యపోయి "ఏమిటీ పిచ్చిపనీ" అంది శారద.

"నిజమే ... నీ చేతినీ ఆ వేళ్ళనూ చూస్తుంటే నాకు పిచ్చెక్కిపోతుంది. ఎంతశక్తి వుందోగదా ఈ వేళ్ళలో. ఎంత అందంగా వున్నాయో ఇవి"

"నీ మొహం...నా వేళ్ళకంటే నీవే అందంగా వుంటాయి. నావి మరీ సన్నం. నీవి సమంగా, తెల్లగా, నున్నగా మెరిసి పోతుంటాయి" అంది శారద.

"సరేలే ... ఎంత మెరిసిపోతే ఏం లాభం చెప్పు. నేను తిన్నగా ఒక్క గీత గియ్యలేను. ఎన్ని వంకర్లు పోతాయో- నువ్వు ఎంత వంకరగా గీసినా అందులో ఏదో అందం వస్తుంది. ఊరికే నాలుగు గీతలు అలా ఇలా గీసేస్తావు- అదో పిట్టో పువ్వో అయిపోతుంది. నిజంగా నువ్వు అదృష్టవంతురాలివి శారదా"

"గీతలు గియ్యటమే అదృష్టం కాదు.. అవి అందంగా కనిపించటమే అసలు అదృష్టం! ఈ గీతల్లో నీకు ఏ అందమూ కనిపించలేదనుకో...అప్పుడు నీకు ఇంత సంతోషం, నా వేళ్ళను ముద్దుపెట్టుకోవా లన్నంత పరవశం వుండేదేనా?"

''అదీ నిజమే! అయినా నాకు చక్కని చిత్రాలు గీసిచ్చే స్నేహితురాలుంది. అవి చాల్లే'' అంది సహజ.

అలాంటి సహజ జ్ఞాపకం రాగానే శారదకు ఒంటరితనం తగ్గినట్టనిపించింది. కనీసం సహజకు ఉత్తరాలు కూడా రాయకుండా తనిలా ఎందుకు బండగా వున్నానా అన్న విచారం పట్టుకుంది.

తండ్రి జ్ఞాపకం వచ్చాడు. ఆయన శారదను ప్రోత్సహిస్తూ వుండేవాడు. ఆయన స్నేహితులెవరు ఇంటికి వచ్చినా, "మా అమ్మాయి బొమ్మలు బాగా వేస్తుంది" అని చెప్పి, ''శారదా..నువ్వేసిన బొమ్మలు తీసుకురా తల్లీ'' అని పిల్చే వాడు.

అందరూ ఆ బొమ్మల్ని మెచ్చుకుం




టుంటే సంతోషించేవాడు.

బి.ఏ చదివేప్పుడు కొత్త సంవత్సరం వస్తోందంటే తనే చక్కటి గ్రీటింగ్ కార్డులు తయారుచేసేది. స్నేహితులందరికీ అవే ఇచ్చేది. ఒకరోజు రాత్రి పదకొండు గంటలదాకా మేలుకుని బొమ్మలు గీస్తూ వుండటం చూసి తండ్రి లేచి వచ్చాడు.

"మరీ అంత పిచ్చి పనికిరాదమ్మాయ్‌ రేపు వేసుకోవచ్చు గానీ ఇక పడుకోరాదూ" అన్నాడు.

"నాన్నా...రేపే ఉగాది. పొద్దున్నే ఫ్రెండ్స్‌కి, లెక్చరర్లకూ గ్రీటింగ్సు ఇవ్వాలి. నిన్నా మొన్నా ఏం బొమ్మలు వెయ్యాలా అనే ఆలోచనతోనే సరిపోయింది. ఇదిగో... ఇదే చివరిది. మొత్తం ఎనిమిది. మూడు నా ఫ్రండ్స్‌కి, నాలుగు మా మాస్టర్లకూ,ఒకటి నీకు. అన్నయ్యకు మొన్ననే పోస్టు చేశాను" అంది తను!

"నాక్కూడానా?ఏదీ...ఏం వేశావు?"

"అయ్యో.... నీ గ్రీటింగు నువ్వు ఇప్పుడే చూడకూడదు! మిగిలినవి చూపిస్తాలే. ఇదిగో...ఈ ఒక్క పువ్వూ అయిపోతే అన్నీ పూర్తయినట్లే"

"ఏంటమ్మా ఇది! అక్షరాలు ఇలా రాశావు. పల్లకీలో పూలూ, అమ్మాయి. ఎందుకిలా రాశావు?"

"అది ఉషకు. దానికి కవిత్వం పిచ్చి ఉంది నాన్నా! రోజూ మాక్కూడా చదివి విన్పిస్తుంది. అందుకనలా రాశాను. ఇదిగో ఇటునుంచి మొదలుపెట్టి ఇలా పైకి చదివి మళ్ళా ఇలా కిందికి చదవాలి. చదువుతానుండు. నీకు కళ్ళజోడు లేదుగా.

'ప్రణయ వల్లకి పల్లకీ
ప్రసవభర వసంత పల్లిక పల్లకీ
శక్ర చాప వక్రరేఖ పల్లకీ
మధు స్వప్నశాఖ పల్లకీ'-బాగుంది కదు నాన్నా?"

"చాలా బాగుందమ్మా"

"ఇది వెయ్యటం చాలా తేలిక కూడా నాన్నా! సహజ కోసం వేసిన బొమ్మకు నాలుగ్గంటలు పట్టింది. ఇదిగో చూడు" అంటూ అన్ని బొమ్మలూ వరసగా చూపించింది.

"చాలా బాగున్నాయి గానీ ఇక పడుకో" అంటూ వెళ్ళిపోయారాయన.

మర్నాడు ఉదయాన్నే తండ్రికి నూతన సంవత్సర శుభాకాంక్షలు చెబుతూ గ్రీటింగ్ కార్డు ఇచ్చింది. చిన్న పాప చేయి పట్టుకుని బొమ్మ వేస్తున్నాడాయన. ఆ పిల్ల చిన్న పువ్వుని వేసి పక్కనే 'ఉగాది శుభాకాంక్షలతో నాన్నకు' అని రాసింది. తండ్రి ఆనందంగా నవ్వాడు ఆ గ్రీటింగు చూసి. అమ్మ కూడా వచ్చి చూసి "బాగా వేశావే" అంది. "మరి అమ్మకేది గ్రీటింగు?" అన్నాడు తండ్రి.

"అమ్మకి వెయ్యలేదు నాన్నా! సారీ అమ్మా" అంది తను.

"నాన్నకి వేస్తే నాకు వేసినట్లు కాదటే పిచ్చిపిల్లా" అంది అమ్మ.

అమ్మ కోసం గ్రీటింగువెయ్యనందుకు శారదకు చాలా దిగులువేసింది. పాపం అమ్మకు నాన్నలాగా తన బొమ్మల్ని చూసి మెచ్చుకునే తీరిక వుండేది కాదు. వాటి గురించి ఎక్కువ తెలిసేదీ కాదు. తననొక్క పనీ చెయ్యనివ్వకుండా అంతా తనే చేసేది. సరిగ్గా తొమ్మిది న్నరకు భోజనం పెడితే తినటం తప్ప ఆ భోజనం తయారుచేయటం వెనకాల వున్న విషయాలేవీ ఆనాడు తనకు

తెలియవు. అమ్మ ఉతికి ఇస్త్రీ చేసిన చీరలు కట్టుకోవటం తప్ప ఆ చీరలు శుభ్రం చేయటంలో ఎంత చాకిరీ వుందో తెలియదు. ఆ చాకిరీయే లేకపోతే అమ్మ కూడా తనలా బొ మ్మ లే సే దే మో!

ఆలోచనల్లోంచి బయటపడి శారద అప్రయత్నంగా తన చేతులవంక చూసు కుంది. ఐదేళ్ళలో ఈ చేతులెట్లా అయి పోయాయి. వేళ్ళెంత బండబారిపోయాయి. విరిగిన గోళ్ళవంక చూసుకుంటే శారద మనసులో బరువు మరికాస్త పెరిగింది. ఆ సున్నితత్వం, ఆ లాఘవం ఈనాడు లేవు. అంట్లుతోమీ, గుడ్డలుతికీ, వంట చేసీ, పిల్లల్ని పెంచీ ఈ చేతులిట్లా తయా రయ్యాయా? లేక బొమ్మలు వెయ్యనందు వల్లే బండబారిపోయాయా? నాన్న అంతమంచివాడుగదా...నాకి పెళ్ళెందుకు చేశాడు-అనుకునే సరికి శారదకు దుఃఖం వచ్చేసింది.

"నాన్నా! నాకి పెళ్ళెందుకు చేశావు నాన్నా?" అని ఎదురుగా నాన్న వున్నట్టే అడిగింది శారద.

ఉలిక్కిపడింది. ఎవరో తలుపులు దబదబా బాదుతున్నారు. గబగబా హాల్లో కొచ్చి తలుపు తీసింది శారద. ఎదురుగా సహజ.

సహజ! ఐదేళ్ళ తర్వాత హఠాత్తుగా ఆశ్చర్యకరంగా సహజ!

"ఏంటి తల్లీ! నన్ను లోపలకు రానివ్వవా? అసలు నన్ను చూడగానే కావలించుకుంటావనుకున్నానుగానీ మాటా పలుకూ లేకుండా నిలబడతావనుకోలేదు. నేనసలు గుర్తున్నానా?" సహజ ఏమీ మారలేదు.

"పోనీ నువ్వే నన్ను కావలించుకో వచ్చుగదే" అంది శారద.

"తెలుగు సినిమాల్లో హీరోహీరో యిన్లలా అరమైలు దూరంనుండీ 'శారదా' అంటూ నేనూ, 'సహజా' అంటూ నువ్వూ అరుచుకుంటూ పరుగెత్తుకొచ్చి కౌగిలించుకునే సీనుకి రిహార్సల్ చేస్తూ వచ్చాను. మీ ఇంటి తలుపులు మూసి వున్నాయి. నా అరుపులు నీకు వినబడ లేదు. నన్ను చూసి నువ్వు చేతులు చాచ లేదు. మరిక నాకు మూడ్ ఎలావస్తుంది?" అంది సహజ.

పకపకా నవ్వింది శారద- "నువ్వేం మారలేదే"

"అంటే నువ్వు మారినట్లేగదా"

మళ్ళీ నవ్వింది.

"శారదా! నాలుగేళ్ళ తర్వాతఇక్కడికి ట్రాన్స్ఫర్ అయేసరికి ఆనందం పొంగు కొచ్చిందనుకో. సముద్రాన్ని వదిలేసి వస్తున్నానన్న దిగులున్నా నువ్వూ, ఉషా, రమా గుర్తొచ్చి ఎంత హాయిగా అనిపిం చిందో. నాలుగు రోజులయింది మేం వచ్చి. సామానింకా సర్దాలి. ఇవాళ ఆ పనంతా మా మంచాడికి అప్పగించి నేను నీ దగ్గరకు బయల్దేరా. మీ ఇల్లు తేలిగ్గానే దొరికిందిలే"

"మంచాడెవరే?"

"నువ్వు నా పెళ్ళికి రాలేదుగా-చుట్టా లెవరూ లేకుండా స్నేహితుల తోటి పెళ్ళిరోజు గడుపుదామనుకుంటే మీ ముగ్గురూ రాలేదాయె! ఆ రోజు నాకెంత దల్‌గా అనిపించిందో! ప్రసాద్ స్నేహితుల్లు చాలామంది వచ్చారు. రెండేళ్ళనుంచీ అక్కడేఉద్యోగంచేస్తున్నా గనుక కొలీగ్స్ చాలామందే వచ్చారు. అసలు మీరెందుకు రాలేదో, ముందది చెప్పు"

# ఈవిడే మా అమ్మమ్మ.



గోద్రెజ్‌ని ఇంటికి తెచ్చిన రోజున తీసిన చిత్రం

న్నేళ్ల క్రితం నాటి మాట. అయితేనేం, అమ్మమ్మకి
న చిన్ననాటి నేస్తం గోద్రెజ్ గురించిన తియ్యటి
లు ఇంకా ఉన్నాయి.
కూతురు పెళ్లికూతురు
తన తోటి ఇంటికి
ది కూడా గోద్రెజ్
రేటరే. అవును మరి.
జ్ ఒక అగ్రగామి అయిన
రేటర్. తరతరాలుగా
బంలో మొదటి ఎంపిక.
మే కదా. శ్రేష్ఠత
ంలో గోద్రెజ్



సంప్రదాయం సుప్రసిద్ధమే.
వీరి గృహోపయోగ వస్తువులు
కలకాలం నిలిచే విలువల
ఆధారంతో తయారైనవి.
వీటి తోటి సంబంధం
బహుకాలం సాగే
అనుబంధం.

అమ్మమ్మ రూపంలో
ఇప్పటికీ అదే కళ. ఆమె
పనిలో అదే సమర్థతా,
ఆదే విశ్వసనీయతానూ.
అచ్చం గోద్రెజ్ పోలికే!

## బహుకాలం మీకు విశ్వాసపాత్రం

**Godrej® రిఫ్రిజిరేటర్**

మేలైన శాస్త్ర పద్ధతిలో ఉత్పత్తులు
కలకాలం నిలిచే విలువలు

GBM-2034

ఇప్పుడు కారణాలెక్కడ చెప్పనే? ప్లీజ్... క్షమించి వదిలేయ్"

"సరే-నీకిద్దరు పిల్లలని విన్నాను. ఏరీ... కనపడరేం?"

"నిన్న సాయంత్రం అమ్మా వాళ్ళింటికి వెళ్లారు. ప్రతి శుక్రవారం అన్నయ్య పిల్లల్ని తీసుకెళతాడు. మళ్ళీ సోమవారం పొద్దున్నే దించుతాడు"

"పిల్లలకేం పేర్లు పెట్టావు?"

"పాప పేరు చిత్ర. బాబు పేరు చందూ. మరి నీకు అమ్మాయా, అబ్బాయా?"

"నా పెళ్ళయి రెండేళ్ళేనే. అప్పుడే పిల్లలేంటి?"

"అయితే? నాకు మా చిత్ర పుట్టేసరికి మా పెళ్ళయి సంవత్సరం నిండలా"

"బుద్ధిలేకపోతేసరి. అయినా నాకసలు పిల్లల్ని కనాలని లేదే"

"అదేంటి?" అంది శారద అమితమైన ఆశ్చర్యంతో.

"సరేగాని... నీ కొత్త చిత్రాలేవీ? అర్జంటుగా చూపించు..నేనసలు వచ్చింది అందుకే" అంది సహజ నలుమూలలా కళ్ళతోనే వెతుకుతూ.

"కొత్తవీ, పాతవీ ఏమీలేవు సాజీ" శారద దిగులుగా నవ్వింది.

"అదేంటి?"

"నేను బొమ్మలు వెయ్యటం లేదు''

''ఎందుకని?"

''ఈ సంసారంతోనే సరిపోతోంది. కుదరటంలేదు"

"పొద్దుట్నించీ పిల్లలూ, ఆయనా ఉండరుగదా! ఇంటి పనయ్యాక ఏం చేస్తున్నావు? తీరిక లేకపోవటమేమిటి? నువ్వు జాబ్ కూడా చెయ్యటం లేదుగా?"

సహజకి ఆశ్చర్యంతోపాటు కోపం కూడా మొదలయింది.

"అసలు విషయం... ఆయనకిష్టంలేదు సాజీ! దాంతో క్రమంగా నాలో ఆ ఉత్సాహం పోయింది"

సహజ కాసేపేం మాట్లాడలేదు.

"సాజీ! ఈ విషయాలొద్దులేవే. సరదాగా చిన్నప్పటి కబుర్లు చెప్పుకుందాం" శారద మనసంతా అశాంతిగా వుంది.

"రమా, ఉషా కలుస్తున్నారా?" అనడిగింది సహజ.

"రమ ఎప్పుడోగాని కలవదే. ఎప్పుడు కలిసినా వాళ్ళాయన సంగతులూ, ఆయన తిండీ, పిల్లాడూ, వాడి అల్లరీ, తెలివీ -ఇవే కబుర్లు. మనందరిలో తనే ఎక్కువ మారిపోయింది. ఉష వస్తూనే వుంటుంది. వాళ్ళాయనకి సినిమాల పిచ్చి. దీనికేమో ఇప్పుడొస్తున్న తెలుగు సినిమాలు చిరాకు. ఆయన సినిమాకెళ్ళినరోజు దీనికేం తోచక ఇక్కడకొస్తుంది. ఉష జాబ్ చేస్తోందిగా''

"నువ్వెళ్ళవా?"

"నేనూ వెళతాలే ఎప్పుడన్నా. కానీ ఈయనకు స్నేహితులిళ్ళకెళ్ళటం ఇష్టం వుండదు"

"మరి మీ ఆయనకేమి ఇష్టమే?"

"డిసిప్లిన్...పద్ధతి''

"అదేంటి?''

"అదంతేలే! ఆ గోల అలా పోనీ! మీ ఆయన పేరు ప్రసాదా?"

"ఔనుగాని ... మాటిమాటికీ ఆ గడియారం వంక అలా చూస్తున్నావేంటి? ఎవరయినా అయిదున్నరకి వస్తాన న్నారా?"

"ఎవరోకాదు...మా ఆయనే వస్తారు. అయిదూ ఇరవైకి వంటింట్లోకెళ్ళి కాఫీ

కలపాలి. అయిదున్నరకంతా ఆయన వస్తారు. వచ్చేసరికి వేడి కాఫీ రెడీగా వుండాలి. లేకపోతే ఇక ఆ రోజంతా అశాంతే మా ఇద్దరికీ"

"పోనీ ఇంత టెన్షన్ పడకపోతే నీకు వీలైనప్పుడు కాఫీచేసి ఫ్లాస్కులో పొయ్యరాదూ? రాగానే ఇవ్వొచ్చు"

"ఫ్లాస్కులో కాఫీ వాసనట. అయిదున్నరకు కాఫీ తాగటం పాతికేళ్ళ అలవాటు ఆయనకి"

''అయిదున్నరకి కాఫీ తాగే అలవాటే కానీ కాఫీ చేసుకుతాగే అలవాటు లేదా మీ ఆయనకి''

"భలేదానివే...ఆయన పద్ధతులన్నీ నిరాటంకంగా కొనసాగటానికనేగా వాళ్ళమ్మ చనిపోగానే నన్ను పెళ్ళి చేసుకున్నారు''

సహజకు మాట్లాడబుద్ధికావటంలేదు. మాట్లాడటానికేముంది? అంతా తెలుస్తూనే వుంది. శారద జీవితం నాశనమయింది. సహజకు అక్కడినుంచి వెళ్ళాలనిపించింది. ఇంకో పదిహేను నిమిషాల్లో ఆ మహానుభావుడొస్తాడు. ఇంకో అయిదు నిమిషాల్లో శారద లేచి వంటింట్లోకి వెళ్ళి కాఫీ పెడుతుంది. నాలుగేళ్ళ తర్వాత ప్రాణ స్నేహితురాలొచ్చినా కాస్త తీరిగ్గా మాట్లాడలేని స్థితికి తెచ్చాడు శారదని. అలాంటివాడిని ఇప్పుడు చూసి తను భరించగలదా?

"నే వెళ్తానే..పని చాలా వుంది"అంటూ లేచింది సహజ.

"కాఫీ అన్నా తాగకుండానే"

"నేను కాఫీ తాగనని మర్చిపోయావా? నువ్వూ కాఫీ తాగేదానివి కాదు. రోజుకి ఐదారుసార్లు టీ సేవించేదానివి ఇష్టంగా"

"ఆయనకు టీ అంటే అసహ్యం. మా ఇంట్లో టీ పొడి వుండదు... సారీ సాజీ!"

"సారీ ఎందుకే? ఈసారి నేను టీ పొడితోసహా వస్తాను. ఇద్దరం గంగాళం టీ కాచుకుని అది తాగుతూ కబుర్లు చెప్పకుందాం... సరేనా?" సహజ బలవంతపు నవ్వు తెచ్చుకుని బైటికి నడిచింది.

సహజను పంపి తలుపు వేసుకుని హడావుడిగా స్టవ్ వెలిగించింది శారద. సహజకు మనసు పాడయినట్లుంది. అసలీ విషయాలు మాట్లాడకపోతే బాగుండేది. కానీ ఎట్లా? అయినా తనేం మాట్లాడింది - ఆయనకు బొమ్మలు వెయ్యటం ఇష్టం లేదనీ, అయిదున్నరకి కాఫీ సిద్ధంచెయ్యాలనీ, ఆయనకి టీ అంటే అసహ్యం గనుక తమ ఇంట్లో టీపొడి లేదనీ చెప్పింది ... అంతేగా! అయినా ఆ నాలుగు మాటల్లోనే తన జీవితం అర్థమైపోయినట్లుంది సహజకు.

'కొత్త బొమ్మలేవి' అని అడిగింది సహజ. తను వెయ్యాలని ప్రయత్నించిన చివరి చిత్రం శారద కళ్ళల్లో మెదిలింది.

చిత్ర పుట్టినప్పటి నుంచీ శారదకు నిద్రలో చిత్ర నవ్వుని చిత్రించాలని ఎంతో అనిపించేది. నిద్రలో ఆ పసిదాని నవ్వు చూస్తుంటే సృష్టి అంతటిలోకీ అత్యద్భుత సౌందర్య దృశ్యం అదే అనిపించేది. ఆ పాపాయి నవ్వుని శాశ్వతం చెయ్యాలనుకుంది. ఒకరోజు భర్త ఆఫీసుకి వెళ్ళగానే చిత్ర మంచం పక్కనే కూచుని మూడు గంటలు కష్టపడి స్కెచ్ గీసింది. అంతలో చిత్ర లేచింది. మళ్ళీ పనులు మొదలు.

రాత్రి పది గంటలకు ఆ బొమ్మ పూర్తిచేయాలని హాల్లో టేబిల్ దగ్గర




కూచుంది. రామారావు, చిత్ర నిద్ర పోతున్నారు. చిత్ర మధ్యలో లేచి ఏడుస్తుందేమోనని సీసాలో పాలు సిద్ధంచేసి ఉంచింది.

తదేక ధ్యానంతో బొమ్మకు మెరుగులు దిద్దుతున్న శారద పాప ఏడుపు విని హఠాత్తుగా లేచింది. ఆ బొమ్మ మీదకు రెండు పుస్తకాలు, సిరా సీసా దొర్లాయి. నల్లని సిరా పాప బోసి నోటిలోకి, తెల్లని కళ్ళ కాంతుల్లోకి పాకింది.

"పాప ఏడుస్తుంటే ఒళ్ళు తెలియకుండా ఈ పిచ్చి గీతలు గీస్తూ కూచున్నావా?" రామారావు కోపంతో మండిపడ్డాడు. బాధ్యత విస్మరించిన వారంటే రామారావుకి కోపం.

పాలసీసా పాప నోట్లో పెట్టేఓపికలేని తండ్రి కూతురి లేత నవ్వుని పరవశంతో చిత్రిస్తున్న తల్లి కిబాధ్యత బోధిస్తున్నాడు. ఈ బోధనలతో, ఈ బాధ్యతలతో ఈ చాకిరితో, ఈ సంసార జీవితం శారదని నిర్దాక్షిణ్యంగా చంపేస్తోంది.

తాను గీసిన చివరి బొమ్మకు పట్టిన గతి తలచుకొని శారద మనసు ఆక్రోశించింది.

తలుపు చప్పుడయింది. శారద వెళ్ళి తలుపు తీసింది. రామారావు వచ్చాడు. హాల్లో టీపాయ్‌కి దూరంగా జరిపిన కుర్చీలమీద పడింది రామారావు దృష్టి.

"ఎవరొచ్చారు?" అన్నాడు వాచీ తీస్తూ.

"సహజ అని నా స్నేహితురాలు"

"వచ్చింది సరే... వెళ్ళగానే కుర్చీలు సరిగా సర్దుకోవాలని తెలియదూ? ఓ పద్ధతీపాడూ ఏమీ లేదు. నీకు ఎప్పటికి తెలుస్తుందని?"

రామారావులో అశాంతి పెరుగుతోంది. శారద కాఫీ అందించింది. కాఫీ సువాసనకు అతను శాంతించేలోగా కుర్చీలు సర్దేసింది.

• • •

రమ దగ్గరకు వెళ్ళాలంటే సహజకు భయంగా వుంది. శారదను చూసిన దగ్గర నుంచీ దిగులుపడుతోంది. భర్తతో ఆ సంగతి చెబితే, "ఇక నువ్వంటావుగా! ఆవిడకు కాస్త భర్తమీద తిరగబడటం ఎలాగో నేర్పు'' అన్నాడు.

మరి రమ సంగతెలా వుందో? రమ పూర్తిగా సంసారంలో మునిగిందని శారద చెబుతోంది. రమ ఇల్లు తనకు తెలుసు. అయినా వెళ్ళాలి వెళ్లాలి అనుకుంటూనే ఆలస్యం చేసింది. ఇవాళ తప్పదేమో! ఇవాళ రమ వాళ్ళింటిపక్కనే బాలమురళి పాట కచ్చేరి వుంది. రమ ఎలాగూ వెళుతుంది.బాలమురళి పాట అంటే రమకు ప్రాణం. రమ పాటలు బాగా పాడటమే కాక మంచి పాటలు ఆసక్తిగా వింటుంది. సహజకు సంగీతంలో కాస్తోకూస్తో అభిరుచి వుండటానికి కారణం రమే. ఇవాళటి కచేరీకి రమతో కలిసి వెళితే బాగుంటుందనుకుని మూడింటికే రమావాళ్ళిల్లు చేరింది సహజ.

"ఎప్పుడు వచ్చావే? ఉంటావా నాలుగు రోజులు'' అంటూ పలకరించింది రమ.

"నాలుగురోజులేమిటి? నేనిక గుంటూర్లోనే వుంటా. మా ఇద్దరికీ ఇక్కడికి ట్రాన్స్‌ఫర్ అయింది"

"నిజంగానా !...బాగుంది. పెరట్లో కూచుందాంరా. కబుర్లు చెప్పుకోవచ్చు"

పెరట్లో ఒక మోపు బట్టలున్నాయి.

''ఇప్పుడివన్నీ ఉతుకుతావా?'' సహజ నోరు తెరిచింది.

''జానే! నిన్న పంపులు రాలా. ఇవాళివి వుతక్కపోతే రేపటికి ఇంకో మోపవుతాయి. నువ్వలా కూచుని కబుర్లు చెప్పు...నేనే పని చేసేస్తా''

''సరేలే...త్వరగాకానీ. మళ్ళీ టైమయిపోతుంది" అంది సహజ వంటింటి గడప మీద కూచుని.

''టైమా...దేనికి?

''దేనికేమిటి? బాలమురళి కచేరీ ఆరింటికేగా''

''వెళుతున్నావా?''

"అదేంటి...నువ్వు రావటంలేదా?"

సహజ ఆశ్చర్యానికి హద్దులులేవు. వీళ్ళాయనకు సంగీతం ఇష్టంలేదా ఏమిటి? సహజ గుండెలో రాయిపడింది.

"నాకెక్కడ కుదురుతుందీ" అదేదో గొప్ప విషయమైనట్లుగా అంది రమ.

"ఏం.. ఏం చేస్తావు?"

''ఈ పనయ్యేసరికి నాలుగవుతుందా. అప్పుడు మా అబ్బాయి బడినుంచి వస్తాడా. వాడికీ, అత్తయ్యకూ టిఫిన్ పెట్టాలి. ఆయనొచ్చేసరికి అయిదున్నర అవుతుంది. వీళ్ళకేమో శనగపిండి పడదు. గోధుమ పిండితో చపాతీలో, పకోడీలో చెయ్యాలి. ఆయనకోసం వేరే చెయ్యాలి.ఆయన ఫలహారం పూర్తయ్యాక క్లబ్బుకెళతారు. అప్పుడు వంటచేసి వీళ్ళకు పెట్టి, అన్నీ సర్ది ఆయనకు వేడినీళ్ళు సిద్ధంచేసి, మళ్ళీ కుక్కర్‌లో ఆయనకు అన్నం పడెయ్యాలి. ఆయనకి అన్నీ వేడిగా కావాలి. క్లబ్బునించి పన్నెండు గంటలకొచ్చినాసరే...అన్నం పొగలు కక్కుతుండాల్సిందే"

రమ మురిపెంగా చెబుతుంటే సహజకు నోటమాట రాలేదు.

"నువ్వు తప్పకుండా కచేరీకి వస్తావనే నేను పెందరాళే మీ ఇంటికి వచ్చాను" అంది సహజ నీరసంగా.

''పనంతా పూర్తయితే రావచ్చుగానీ ఆరింటికల్లా ఇది అవదేమో?''

"అవుతుందిలే! ఈ పూటకి ఎలాగో చేసెయ్యి. నేనూ వున్నానుగదా. ఇద్దరం గబగబా చేసేద్దాం'' వుత్సాహంగా అంది సహజ.

''అయితే ఆ డబ్బాలో బియ్యం సోలెడు తీసి ఏరేసెయ్యి. బెండకాయలు కడిగి గుడ్డతో శుభ్రంగా తుడిచి సన్నగా ముక్కలు తరుగు. తడి లేకుండా తరగాలి సాజీ!ఏమాత్రం తడివున్నా జిగట ఎక్కువొస్తుంది. ఆయనిక ముట్టుకోరు''

సహజకు ఒళ్లు మండిపోయింది. అసలు తుడవకుండా తరుగుదామనుకుందిగానీ పాపం రమకి చివాట్లు తగుల్తాయేమోనని ఆగింది.

రమ నాలుగింటికి ఆ బట్టల గుట్టలోంచి బయటపడి, చపాతీలకు పిండి కలపాలని డబ్బా తీసింది.

"రమా....మీ బాబుకోసం బిస్కట్లూ, స్వీట్లూ తెచ్చాను. టిఫిన్ చెయ్యకు. ఇవాళ్టికి మీ అత్తగారికీ బాబుకీ కూడా అవే పెట్టొచ్చు. పని తగ్గుతుంది" అంది సహజ ఆ బిస్కట్లు తీసి రమకిస్తూ.

''అయ్యో...ఎందుకు తెచ్చావే. బైటి సరుకులు మేం పిల్లాడికి పెట్టం. మా అత్తగారూ తినరు. ఆరోగ్యం పాడవుతుందని ఆవిడ భయం. అయినా చపాతీలు ఎంతలో చేస్తాననీ''

సహజకు కోపం ముంచుకొచ్చింది. ఒక్కరోజు బిస్కట్లు తింటే ఏమవుతుంది? పోనీ పిల్లాడి ఆరోగ్యం పాడయితే మళ్లీ రమకే కష్టం అనుకుంది సహజ.

రమ చపాతీలు చేసింది. పిల్లాడు

బడినుండి వచ్చాడు.

"మమ్మీ ... ఇవాళేం టిఫిను?''

"చపాతీలు నాన్నా''

''రోజూ చపాతీలేనా? నాకు కారప్పూస కావాలి" వాడు రాగంమొదలు పెట్టాడు.

"కారప్పూస దసరా పండక్కి వొండుతానమ్మా...చాలా వొండుకుందాం. ఇవాళ చపాతీలుతిను. నే తినిపిస్తాగా''

వాడు మహా అయిష్టంగా చపాతీ తినేసరికి నాలుగుముప్పావు అయింది. రమ హడావుడిగా పకోడీల తయారీలో పడింది. కాఫీ డికాక్షన్ తయారుచేసింది. సహజ బెండకాయలు వేయించి, పప్పు బియ్యం కుక్కర్‌లో పెట్టింది. రమ హడావుడిగా ఇల్లు చిమ్మేసరికి అత నొచ్చాడు.

''రమా...త్వరగా. టిఫిన్ లేకున్నా ఫరవాలేదు. కాఫీ అన్నా ఇచ్చెయ్'' అంటూ బాత్‌రూంలో దూరాడు.

"అయ్యో... టిఫిన్ లేకపోవటం ఏమిటండీ! అన్నీ సిద్ధం. మీదే ఆలస్యం? అయినా ఎందుకంత తొందర?" అంది రమ ప్రేమ వుట్టిపడుతుండగా.

"ఇవాళ మా పాత స్నేహితులిద్దరొచ్చారు. సాయంత్రం క్లబ్బులో కలుద్దామనుకున్నాం. చదువుకునే రోజుల్లో మేం ముగ్గురం ఒక టీమ్‌లో బాడ్‌మింటన్ ఆడేవాళ్ళం. ఇవాళ మళ్ళీ ఆడాలి. ఊఁ...ఇక చాల్లే" అతను హడావుడిగా వెళ్ళిపోయాడు – రమ సహజను పరిచయం చేసే అవకాశమన్నా ఇవ్వకుండా.

సహజకు ఒళ్ళు మండిపోతోంది. నాలుగేళ్ళ నుంచీ దూరంగా వున్న స్నేహితురాలొస్తే ఆమె సంగతులేమీ అడక్కుండా పనంతాచేయించింది రమ. తన స్నేహితులకోసం పరిగెత్తుతున్నాడా పెద్దమనిషి. నాలుగేళ్ళ ఎడం వున్నా కొత్తలేకుండా రమ తనకు పని చెప్పటం తాను చెయ్యటం సహజకు బాగానే వుంది. కానీ రమలో సహజతో మాట్లాడాలని గానీ సహజ విషయాలు తెలుసుకోవాలని గానీ ఏమాత్రం ఆసక్తి కనిపించటంలేదు. తన ఇంటి పని డిస్టర్బ్ కాకూడదు. తన భర్తకూ పిల్లాడికి అత్తకూ జరిగే సేవల్లో ఏలోటూ రాకూడదు అనేది తప్ప స్నేహితురాలొచ్చిన సంభ్రమం ఏమీ లేకపోవటం సహజను బాధించింది. ఎలాగోలా పని ముగించి అత్తగారికి అప్పగింతలు పెట్టి ఆరింటికి బయటపడ్డారు ఇదరూ.

"అబ్బా! ఈ టైములో బయటికొచ్చి ఎన్ని రోజులయిందో ... ఎంత హాయిగా వుందో" అంది రమ.

సహజ చాలా సంతోషించింది ఆ మాట విని.

వీళ్లు వెళ్లేసరికే ఆడిటోరియం నిండిపోయింది. బాలమురళి పాడటానికి సిద్ధమవుతున్నాడు.

"వందే వాసుదేవం"తో మొదలయింది కచేరీ. బాలమురళి కంఠంలోంచి సంగీతం అలలు అలలుగా శ్రోతల హృదయాల్లోకి పొంగుతోంది. వరసగా పాడుతున్నాడు అద్భుతమైన కీర్తనలను.

శ్రోతలెవరో చిన్న చీటి పంపించారు "నగుమోము గనలేని" కీర్తన పాడమని.

"రమా...నీకు ప్రాణమైన పాట. నీ అదృష్టం బాగుంది" అంది సహజ.

"కానీ చాలా టైమయిందే సాజీ. నేను వెళతాను. నువ్వు పూర్తిగా వినిరా. భోజనం చేసి వెళుదువుగాని" అంది




రమ!

నిర్ఘాంతపోయింది సహజ.

"పాలు కాయాలే. లేకపోతే విరిగి పోతాయి" అంటూ రమ లేచింది.

సహజ నమ్మలేనట్లుగా చూస్తూ ఉండి పోయింది. బాలమురళి పాడుతున్నాడు. రమ వెళ్ళిపోయింది. ఎలా సాధ్యమయింది? బాలమురళి పాట రమ ప్రాణం. పైగా రమకిష్టమైన ఆ కీర్తన అద్భుతంగా పాడుతుంటే పాలు కాయాలని రమకెలా గుర్తొచ్చింది? ఆ వంటింటికి ఆడవాళ్ళ అభిరుచుల్ని హత్యచేసే శక్తి అంత బలంగా ఎలావుంది? పాలు విరిగిపోతాయట. తన బతుకే విరిగిపోయిన సంగతి రమకెలా అర్థమవుతుంది?

వంటిళ్ళు ఇలా స్త్రీలను అంధకారంలో ఉంచగలుగుతున్నాయా? పాలు విరిగితే ఏమవుతుంది? మర్నాడు భర్తకూ పిల్లలకూ పెరుగుండదు. వాళ్ళకు ఒకరోజు పెరుగు లేకపోతే ఏం? భారతీయ స్త్రీత్వమే దెబ్బతింటుందా? గృహిణి తన బాధ్యతలను మరచిపోయి కుటుంబానికి అసౌకర్యం కల్గించటం అవుతుందా?

నిజమే! ఇంకేమైనా వుందా? అదేం ఆడది అని ఈ లోకం, ఆ భర్తా-అందరూ కలిసి ఆమెను పీక్కుతిని ఆ చేసిన తప్పుకు కుమిలి కుమిలి చచ్చేలా చెయ్యరూ? బాలమురళి 'గగనానికి ఇలకూ బహుదూరంబనినాడో' అని పాడుతున్నాడు.

సహజకు అనిపించింది-"వంటింటికి కళకూ బహుదూరం బహో" అని అరవాలని.



2

"ఏంటి ఇంతాలస్యం? ఇంతసేపూ ఎక్కడున్నావు? నా ప్రోగ్రాం అంతా పాడయిపోయింది" ఇల్లుచేరగానే వస్తూనే శేషగిరి చిందులు చూసిన ఉషకి చిరాకనిపించింది.

"ఏం ప్రోగ్రాం? సినిమా ప్రోగ్రామేగా.. అది రోజూ వుండేదేగా. అయినా నాకోసం చూడటమెందుకు ... నువ్వెళ్ళొచ్చుగదా ... నేనెటూ రానుగదా" అంది.

"వెళ్ళేవాడినే. రవి బిక్కముఖం పెట్టి 'అమ్మేది అమ్మేది' అని గోల. అయినా ఇంతసేపు ఏం చేస్తున్నావు?" ఉష చిరాకు చూసి శేషగిరి కాస్త తగ్గాడు.

"ఆఫీసునుంచి తిన్నగా లైబ్రరీకెళ్ళి పుస్తకాలు తెచ్చుకున్నాను"

"సరే... నేను బజారుకి వెళ్ళి వస్తాను. సెకెండ్ షో కెళదాం... రెడీగా వుండు"

"నేను సినిమాకు రాను" అంటున్న ఉష మాట వినిపించుకోకుండానే శేషగిరి బైటికెళ్ళిపోయాడు.

బాగ్‌లోంచి టిఫిన్ బాక్సు బైటికి తీస్తోంటే లైబ్రరీ పుస్తకం కనిపించింది. ఉష కోపం తగ్గి ఒక్కసారిగా సంతోషమనిపించింది. ఈ నవల కోసం ఎన్నాళ్ళనుంచో ప్రయత్నిస్తోంది. చివరికివాళ దొరికింది. ఆ పుస్తకాన్ని ప్రేమగా బైటికి తీసి భద్రంగా అల్మరాలో




పెట్టింది. వంటింట్లోకి వెళ్ళి స్టవ్ మీద నీళ్ళు పడేసి, అంట్లు బయటేసుకుంది. అవి తోముతుంటే శరత్, రవీ వచ్చి కబుర్లు చెబుతూ నించున్నారు. కడిగినవి కడిగినట్టుగా ఇద్దరూ పందాలేసుకుని లోపల పెట్టి వచ్చారు. ఉష వాళ్ళిద్దరికీ నీళ్ళు పోసి పుస్తకాల ముందు కూచోబెట్టి కుక్కర్ పెట్టేసింది. ఇవాళ్టికి కూర చెయ్యను అనుకుంది. పొద్దుటి కూరా పప్పూ వున్నాయి. అవి శేషగిరికీ, పిల్లలకీ సరిపెట్టి తానే పచ్చడో వేసుకుంటే సరి అనుకుంటూ నవల తీసుకుని పిల్లల పక్కనే కూలబడింది. పిల్లలు అన్నమని గోల చేసేదాకా వాళ్ళను పట్టించుకోలేదు. పిల్లలు కూడా ఉషని మాట్లాడించకుండా హోంవర్క్ చేసుకున్నారు. ఉష పుస్తకం చదివితే ఆ కథ తమకు చెబుతుందని పిల్లలకు తెలుసు.

అన్నం పెడుతుంటే శరత్ అడగనే అడిగాడు.

"అమ్మా...కథ చెప్పవూ?"

"ఏం కథ నాన్నా?"

"నువ్వు చదివిన కథ"

"అదా..ఇంకా అంతా చదవలేదుగా"

"కాస్త చదివావుగా అదే చెప్పు" మారాం మొదలుపెట్టబోయే గొంతుతో అన్నాడు శరత్.

"సరే...విను. మరేమో ఒక వూళ్ళో ఒక గుడ్డి బిచ్చగాడున్నాడు. అతని పేరు సూరదాసు. అతను బాగా పాటలు పాడతాడు. ఎవరైనా డబ్బులిస్తే వాటితో రొట్టెలు కొనుక్కుని తింటాడు. ఆ సూరదాసు మిట్టూ అనే ఒక పిల్లాడిని పెంచుకుంటున్నాడు"

"మిట్టూనా" రవి నవ్వాడు.

"చెప్పు చెప్పు" శరత్ ఆత్రంగా కథ వింటున్నాడు.

"సూరదాసు తనకు అన్నం వున్నా లేకపోయినా మిట్టూకి మాత్రం మిఠాయిలు కొనిపెడతాడు. సూరదాసు వుండే గుడిసె దగ్గర ఇంకా చాలా గుడిసెలు వున్నాయి. వాళ్ళందరికీ సూరదాసంటే ఇష్టం. వాళ్ళందరి గుడిసెల్నీ పీకించి అక్కడ ఒక ఫాక్టరీ కట్టాలని ఒకాయన వస్తాడు" ఉష చెప్పటం ఆపేసింది.

"ఊఁ...వచ్చి..."శరత్ కుతూహలంగా అడిగాడు.

"అంతేరా...అంతవరకే చదివా"

"అంతేనా. ఇందాకట్నించీ చదివావుగా?"

ఉష నవ్వి రవిని ముద్దుపెట్టుకుంది.

"ఆయన పేరేంటి?" శరత్ ఆలోచిస్తూ అడిగాడు.

"ఎవరి పేరురా?"

"గుడిసెలు ఖాళీ చెయ్యమన్నాయన పేరు"

"జాన్ సేవక్"

"జాన్! మా పుస్తకంలో జాన్ వున్నాడు. చూపించనా...ఇదిగో–జాన్ హేజ్ ఎ రెడ్ బాల్. మేరీ హేజ్ ఎ గ్రీన్ బాల్" శరత్ చదవటం మొదలుపెట్టాడు.

"ఇక పడుకోండమ్మా...రేపు పొద్దున్నే లేవచ్చు"

"రేపాదివారంగా..బడిలేదుగా''ఇద్దరూ గంతులెయ్యటం మొదలుపెట్టారు.

"సరే...బొమ్మల పుస్తకాలు చూసుకోండి. నే చదువుకుంటా" అని ఉష మళ్లీ నవల అందుకుంది.

"రంగభూమి – ప్రేంచంద్" అని చదివాడు శరత్ అట్టచూసి. తొమ్మిది గంటలు కాకుండానే శేషగిరి వచ్చాడు.

వస్తూనే "ఉషా...నీళ్ళు పెట్టు" అని



# అక్యుప్రెషర్ శాండల్స్

## శరీరంలో బాధలను దూరం చేసి ఆరోగ్యపు బాటలో హాయిగా నడిచే వారికి.



రిజిస్టర్డ్. డిజైన్ నం. 155538

**రోజింటిలో 8 నిముషాలు చొప్పున రెండుపార్లు మీ సమయానికి విలువ నిస్తే చాలు.**

36 నరాల చివరి భాగాలు మీ శరీరంలో ముఖ్య అంగాలను ఆరోగ్యంగా నిలిపి ఉంచుతాయని. ఇవి నిజానికి మీ పాదాల అరికాళ్లలో వున్నాయని, ఇక వాటిపైన మీరిచ్చే ప్రెషర్ వల్లనే మీ దేహమందలి రక్తచలనాన్ని కావల్సిన స్థాయిలో ఉంచుతూ జీర్ణ శక్తితో పాటు స్వతహాగా మీ ఆరోగ్యాన్ని కాపాడతాయని మీకు తెలుసా? అక్యుప్రెషర్ శాండల్స్ 3000 సంవత్సరముల పురాతనమైన థరఫీపై ఆధారపడినాయి — అదే బయలాజికల్ స్వప్నము నుండి పొందుపడినాయి.

ఆరోగ్యానికి సులభ ఉపాయము.

అతి సౌఖ్యము — మీరు చెయ్యవల్సిందల్లా ఉదయం సాయంత్రం భోజనానికి ముందు 8 నిముషములు వీటితో నడవడమే. మీ ఆరోగ్య విధిలో మీకు నడవడం ముందే అలవాటున్నట్లైతే అక్యుప్రెషర్‌తో నడిచి మీ ఆరోగ్యానికి రెండింతల లాభాలను పొందండి. వి. పి. పి. ద్వారా రూ. 110.95 మరియు రిజిష్టర్డ్ పార్సిల్ రూ. 106.95 పోస్టేజ్. పేకింగ్ మరియు అన్ని పన్నులతో కలిపి.

ప్రపంచ ప్రఖ్యాతి చెందినవి.

అక్యుప్రెషర్ శాండల్స్ — సౌఖ్యమైనవి, మంచి అదాతో ఆరోగ్యకరమైనవి వీటి అమ్మకము యు ఎస్ ఏ, ఆస్ట్రేలియా, కన్నడా, ఇంగ్లాండ్ యూరోప్. స్కాండినేవియన్ దేశాలలో విస్తరించడమే కాక ఇప్పుడు భారత దేశంలో కూడా అత్యధికంగా అమ్ముడౌతున్నాయనడంలో ఆశ్చర్యం లేదు, ఈ రోజే ఒక జత కొనండి! మరి ఇప్పుడు. నీవు ఆరోగ్యం విషయంలో జాగ్రత్త కల్గిన వ్యక్తివే ఐతే ఈ దినమే. నీ దగ్గరలోనున్న డిస్ట్రిబ్యూటర్ దగ్గర కొనుము లేక దీనితో జత పర్చబడిన కూపన్ పూర్తి చేసి దానితో నీ పాదము యొక్క ఆకారమును కాగితముపై గీసి మాకు పంపించుము.



**అక్యుప్రెషర్ థరఫీ హెల్త్ సెంటర్**

**74, పార్క్ స్ట్రీట్ కలకత్తా-700017.**

1. మెదడు
2. మెదడు నరము
3. [illegible]
4. [illegible]
5. తల నరము
6. గొంతు
7. మెడ
8. [illegible]
9. [illegible]
10. [illegible]
11. [illegible]
12. [illegible]
13. [illegible]
14. [illegible]
15. [illegible]
16. [illegible]
17. [illegible]
18. [illegible]
19. [illegible]




20. [illegible]
21. [illegible]
22. గాల్ బ్లాడర్
23. [illegible]
24. [illegible]
25. [illegible]
26. [illegible]
27. [illegible]
28. [illegible]
29. [illegible]
30. [illegible]
31. [illegible]
32. [illegible]
33. [illegible]
34. [illegible]
35. [illegible]
36. [illegible]
37. [illegible]
38. [illegible]

**ACUPRESSURE THERAPY HEALTH CENTRE**

**74, Park Street, Calcutta-700017.**

Please tick ☑ the appropriate box.

☐ Send me a pair of Acupressure Sandals by Regd. Post. I am sending Rs. 106.95 by Bank Draft/M.O. (Payable to Acupressure Therapy Health Centre, Calcutta).

☐ Send me a pair of Acupressure Sandals by V.P.P. I promise to pay the postman Rs. 110.95 on delivery.

Name ..............................................................

Address ..............................................................

Pin ..............................................................

Size .......................................... Age ....................

Signature ..............................................................

VIJAY DIWAN

కేకేస్తే బలవంతాన లేచింది.

"ఇంకా అలాగే వున్నావేం...సినిమా కెళదాం అన్నానుగా"

"ఇప్పుడేంసినిమా? రేపాదివారమేగా.. రేపెళదాంలే"

"ఇప్పుడు నువ్వొస్తావా? రావా??అది చెప్పు"

"నే రాను"

"సరే...నే వెళ్ళాలి త్వరగా.అన్నం పెట్టు" శేషగిరి స్నానానికి వెళ్ళి పోయాడు.

ఇద్దరికీ అన్నాలు పెట్టింది ఉష.

"ఇవాళ లైబ్రరీలో మంచి పుస్తకం దొరికింది"

"ఊఁ...అందుకేనా సినిమాకు రావు"

"కాదు. నాకు రావాలనిపించటం లేదు. ఇద్దరం ఈపుస్తకం చదువుకుందాం. నువ్వు కూడా సినిమా మానెయ్ రాదూ?" ఉష అడక్కూడదనుకుంటూనే అడిగింది.

"సరేలే...తా చెడ్డ కోతి వనమెల్లా చెరిచిందట"

"పుస్తకం చదవటం చెడిపోవటమా?" ఉషకి కోపం వచ్చింది.

"ఆఁ....చెడిపోవటం కాకపోతే వెనక పడటం. ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఇంకా పుస్తకాలు చదవటమేమిటి! చక్కగా కథలన్నీ కళ్ళముందుకొచ్చి తెరమీదే కనబడుతుంటే"

"మంచి సినిమాలైతే నేనూ చూస్తాను. సినిమాలంటే కాదు నాకు కోపం...నువ్వు చూసే దరిద్రపు సినిమా లంటే నాకసహ్యం"

"ఏడుపుగొట్టు సినిమాలైతేగాని నీకు నచ్చవు. అరే...పాటలు, డాన్సులూ గిట్టవేంటి నీకు" శేషగిరి కొత్తగా ఆశ్చర్య పోయాడు.

"పాటలంటే అరుపులూ, డాన్సు లంటే గంతులూ అయితే అవి నాకు గిట్టవు" ఖచ్చితంగా అంది ఉష.

"సరే..నీ ఖర్మ. కూచుని కళ్ళుపోయేలా ఆ పుస్తకాలు చదువుకో"

శేషగిరి గబగబా అన్నంతిని లేచాడు.

"ఇప్పుడేం సినిమాలే! వుండు సరదాగా కబుర్లు చెప్పుకుందాం" అంది ఉష.

"ఏం కబుర్లు...నీ కబుర్లంటే నాకు తలనొప్పి. పేకాడుకుందామంటే వుంటాను...చెప్పు"

"ఒద్దులే....వెళ్ళు. నేను హాయిగా పుస్తకం చదువుకుంటాను" ఉషకి రంగభూమినొదిలి పేకాడుతూ కూర్చోటం అఘాయిత్యంగా కనిపించింది. శేషగిరి ఉష సంగతి ముందే తెలుసన్నట్టు నవ్వుతూ బైటికెళ్ళిపోయాడు.

'గేటు వేసి వెళ్ళాలన్న ఆలోచనైనా వుండదీ మనిషికి' విసుక్కుంటూ వెళ్ళి గేటు వేసింది ఉష.

బైట చల్లగాలి హాయిగా ఒంటిని తాకింది. వెన్నెల విరగకాస్తోంది. ఇవాళ పూర్ణిమా అనుకుంది ఉష-చందమామను చూస్తూ. ఇంట్లోకి పోబుద్ధికాలేదు. అలాగే నిలబడింది. ఆకాశంలో తెల్లని మబ్బు ముక్కలు వేగంగా ఎక్కడికో పోతున్నాయి. ఇంత చక్కని వెన్నెలను పట్టించుకున్న వాళ్ళేలేరు. ఎవరిళ్ళ ముందూ జనంలేరు. డాబాలమీదా లేరు.

'అడవిగాచిన వెన్నెల' అంటారు కానీ అది సరికాదు. అడవిలో కాచిన వెన్నెలను అక్కడుండే జంతువులైనా అనుభవిస్తాయేమో. ఈ పట్టణాల వెన్నెల మాత్రం వృధా వృధా- అనుకుంది ఉష.

ఈ వెన్నెల్లో కూచుని తానూ, శేషగిరీ







సరదాగా కబుర్లు చెప్పుకుంటే—

మంచి కవిత్వమో, నవలో చదుపు కుంటే, మంచి పాటలు వింటుంటే ఎంత బాగుంటుంది. ఇద్దరి ఆలోచనలూ ఒకటై ఆ ఏకత్వంలో ఆనందాన్ని అనుభవించ గలగటం ఎంత అదృష్టం!

చదువుకునే రోజుల్లో తను ఓ మంచి పుస్తకం చదవగానే వెంటనే సహజ,శారద, రమలతో కూడా చెప్పి చదివించేది. వాళ్లు కూడా చదివాక నలుగురూ కూచుని ఆ పుస్తకం గురించి మాట్లాడుకుంటుంటే ఎంత బాగుండేదో. మనసంతా వికసించి నట్లుండేది. మెదడు చురుగ్గా పనిచేసేది. ఒకోరోజు నలుగురికీ వాదనలు జరిగి కోపాలొచ్చేసేవి. మళ్ళీ నాలుగు రోజుల్లో మామూలయ్యేది. అటువంటి స్నేహం భార్యాభర్తలమధ్యఎందుకుండదు? శేషగిరికి తన విషయాలమీదా, తన ఆలోచనల గురించీ కాస్త శ్రద్ధవుంటే ఎంత బాగుం డేది. పెళ్ళయిన కొత్తలో అతనిచేత పుస్తకాలు చదివిద్దామని చేసిన ప్రయత్నా లన్నీ వృథా అయ్యాయి. తనే చదివి వినిపించాలని కూడా ప్రయత్నించింది. తనకెంతో ఇష్టమైన ఓ నవల చదివిద్దా మని విఫలయత్నంచేసి, చివరకు నేనే చదువుతాను వినమని కూచుంటే, పది పేజీలు చదివేసరికి శేషగిరి నిద్ర పోయాడు. తనకెంతో అవమానమని పించింది. ఇక అప్పట్నించీ ఆ ప్రయ త్నాలు మానేసింది. పుస్తకాలే స్నేహి తులు. ఈ ఒంటరితనాన్ని మరిపించటానికి పుస్తకాలుతప్ప వేరే తోడులేదు. కానీ కానీ...పుస్తకాలు చాలటంలేదు. మంచి పుస్తకం చదివినప్పుడో, తనకిష్టమైన దేదో జరిగినప్పుడో అవన్నీ చెప్పుకోవ టానికో మనిషి కావాలనిపిస్తోంది. ఒకో రోజు ఎంతో వుత్సాహంగా వుంటుంది.

ఆ ఉత్సాహంలో ఏదేదో చెయ్యాలని పిస్తుంది. అదంతా ఎవరితోనన్నా చెప్పు కుంటే ఏం చెయ్యాలో తెలుస్తుందేమో..! చెప్పుకోటానికెవరూ వుండరు. శేషగిరికి అర్థంకాదు. ఎగతాళి చేస్తాడు. అంత ఉత్సాహమూ నీరుగారి మనసంతా కుంచించుకుపోతుంది. ఒకోరోజు మనసులో ప్రేమ వుప్పొంగుతుంది. ఆ ప్రేమలో శేషగిరిని ముంచెయ్యాలని పిస్తుంది. అంత ప్రేమనూ ఏదో ఒక పిచ్చిమాట అనో, సెకండ్‌షో చూసొచ్చి నిద్రొస్తోందనో తేలిక చేసేస్తాడు. ఆ ఉత్సాహాన్నీ, ప్రేమనూ అణుచుకొని అణుచుకొని చివరకు తను పెద్ద నీరసపు మనిషవుతోంది. పిల్లల్ని మంచిగా పెంచటమనే పనే లేకపోతే ఇక ఈ జీవితంలో ఏమీలేదు. పుస్తకాలు చదువు కుంటూ, పిల్లల్ని పెంచుకుంటూ, ఒంట రిగా ఈ బతుకు వెళ్ళమార్చాల్సిందే - గాఢంగా నిట్టూర్చింది ఉష.

తన ఒంటరితనాన్ని తల్చుకునేసరికి వెన్నెలకూడా దుర్భరమనిపించి లోపలకు నడిచింది.

రవి పక్కనే పడుకుని 'రంగభూమి' తెరిచింది. శేషగిరి వచ్చి తలుపు కొట్టే వరకూ ఈ లోకంలో లేకుండా అలా చదువుతూనే వుంది.

శేషగిరి వచ్చి, "ఇంకా పూర్తికాలా నీ నవల? ఎలా చదువుతావు ఇంతింత పుస్తకాలు ఓపికగా" అన్నాడు - ఆ పుస్తకం చేతిలోకి తీసుకుంటూ.

"ఎంత బాగుందో తెలుసా?" అని ఉష ఏదో చెప్పబోతుంటే -

"పన్నెండవుతోందిగానీ ఇక నన్ను నిద్రపోనివ్వు" అంటూ మంచం ఎక్కి ముసుగు పెట్టాడు.

"ఇంకో వంద పేజీలుంది. నేనిది చదివిగాని పడుకోను" అంది ఉష పుస్తకం తీస్తూ.

"ఇదిగో..ఇలారా" పిల్చాడు శేషగిరి.

"ఏమిటి?" విసుగ్గా అడిగింది ఉష.

"ఇట్రా...చెబుతా"

శేషగిరికి కావలసిందేమిటో ఉషకి తెలుసు. ఆ రకంగా శేషగిరి పిలవగానే అతని పక్కకు వెళ్ళటం ఉషకసలు ఇష్టం వుండదు.

ఇద్దరూ కలిసి మాట్లాడుకుంటూ ఆ మాటల క్రమంలో ఒకరిమీద ఒకరికి ప్రేమ కలిగి, ఒకరి సాన్నిహిత్యం ఒకరికి ఆవేశాన్ని కలిగించి,ఇద్దరం ఒకటి కావాలనే తపన కలిగి అప్పుడు ఏకమైతే కలిగే ఆనందం కావాలని ఉష కోరిక.

ఆ కోరిక తీరే అవకాశం చాలా అరుదుగాగాని రాదు.

ఉష శేషగిరి పిలుపు వినబడనట్టే పుస్తకం చదువుతూ కూచుంది.

"పిలుస్తుంటే వినబడదా?" శేషగిరి గొంతులో కోపం ధ్వనించింది. ఆ కోపం చూసి ఉష మనస్సు ఇంకాస్త బరువెక్కింది.

అదొక డిమాండ్. ఆ డిమాండ్ తను తీర్చాలి. పొద్దున్నే కాఫీ, వేడినీళ్ళు,టిఫిను, భోజనం, ఇస్త్రీ బట్టలూ-ఇవన్నీ డిమాండ్ చేసినట్లే ఇప్పుడిది కూడా డిమాండ్ చేస్తాడు. అవన్నీ తన డ్యూటీలనుకుని చేస్తోంది. అవన్నీ చెయ్యటం తనకు పెద్ద కష్టమనిపించటంలేదు. అతనికి కావలసిన వన్నీ అమర్చటం తృప్తిగానే వుంటోంది. కానీ ఈ డిమాండ్‌ని ఇంత యాంత్రికంగా తీర్చటం తనకు చాలా కష్టంగా వుంటోంది. ప్రేమ ఇంత మెకానికల్‌గా వుండాలా? శరీరాల ప్రసక్తితప్ప మనసుల కలయిక




వుండకపోతే ఎలా? ఈ మనిషికి మనసు సంగతి ఎప్పటికి అర్థమవుతుంది. శేషగిరి మంచంమీదనుంచి లేచి వచ్చి ఉష చేతిలో పుస్తకం లాగేశాడు. అతని కళ్లు కోరికతో మెరుస్తున్నాయి. ఎంతో అందమైన కళ్లు అతనివి. ఆ కళ్ళను చూస్తూ అప్రయత్నంగానే అతని వెంట నడిచింది ఉష. 'ఆ కళ్ళలో ప్రేమలేదు...ప్రేమలేదు' అని తన మనసు లోలోపల వినబడుతున్న అరుపును నొక్కేస్తూ శేషగిరి కౌగిలిలో ఇమిడిపోయింది ఉష.

అరగంట తర్వాత...

శేషగిరి గాఢంగా నిద్రపోతున్నాడు కానీ ఉషకు నిద్రరాలేదు.

శరీరం తేలికగా అయిందిగానీ మనసు సీసపు ముద్దలా తయారయింది.

ఈ మనశ్శరీరాల ఐక్యత ఎలా ఎప్పటికి కుదురుతుంది-అనుకుంటూ లేచి మళ్ళీ పుస్తకం తెరిచింది.

నవల పూర్తయ్యేసరికి ఒంటిగంటన్నర అయింది.మనసంతా ప్రశాంతంగామారింది. లైటుతీసి పడుకుని అయిదు నిమిషాల్లో నిద్రపోయింది.

ఆరింటికంతా మెలకువ వచ్చింది ఉషకు. ఆదివారం అని గుర్తొచ్చినా మరి పడుకోబుద్ధికాలేదు. మంచం మీదనుంచి లేచేసరికి శరత్ కూడా లేచాడు. పిల్లలకు ఆదివారంనాడు మాత్రం ఐదింటికే మెలకువవస్తుంది.మిగిలిన రోజుల్లో ఏడైనా లేపందే లేవరు. ఇంత చిన్న పిల్లలమీద కూడా బడి మంచి ప్రభావమే చూపిస్తోంది అని నవ్వుకుంది ఉష. బడి భయం ఇంకా బాగా తెలియని రవి నిద్రపోతూనే వున్నాడు. శేషగిరి ఆదివారంగానీ, సోమవారంగానీ ఎనిమిదింటికి ముందు ఏరోజూ లేవడు.

ఉష లేచి వంటింట్లోకి నడిచింది. నిద్ర లేవగానే ఆడవాళ్ళ కాళ్లు ఆటోమేటిగ్గా బుర్ర ప్రమేయం ఏమీలేకుండానే వంటింట్లోకి దారితీస్తాయిగదా-అనుకుంటే ఉషకు నవ్వొచ్చింది.

వంటిల్లు కూడా నిద్రపోతోంది. ఇక ఈ వంటింటిని నిద్రలేపాలి - అనుకుని నెమ్మదిగా అంట్లగిన్నెల దగ్గరకు వచ్చింది ఉష. అవి బైటపడేసి తోమి తెచ్చేసరికి శరత్, రవి కలిసి టూత్ పేస్టంతా ట్యూబ్ లోంచి బైటికిలాగి వినోదిస్తున్నారు.

"మిమ్మల్ని పేస్టెవరు ముట్టుకోమన్నార్రా! నన్నడిగితే నేనిచ్చేదాన్నిగా" అంటూ ఆ పేస్టంతా తుడిచి వాళ్ళకు నీళ్ళిచ్చి తనూ మొహం కడుక్కుంది.

ఇవాళ టిఫిన్ పని పెట్టుకోకుండా పెందలాడే భోజనం చేసేస్తే సగంపని తగ్గుతుంది. కానీ ఆదివారం టిఫిన్ లేకపోతే శేషగిరికి బాగోదు. ఆదివారం అతను మరింత బిజీగా వుంటాడు. ఆఫీసుకైనా ఆలస్యంగా వెళతాడు గాని ఆదివారం మార్నింగ్ షోకి మాత్రం ఆలస్యం కానివ్వడు. నిద్ర లేస్తూనే వరసగా 'కాఫీ, టిఫినూ, వేడినీళ్ళు, ఇస్త్రీబట్టలూ'-ఇలా కేకలు పెడుతూనే వుంటాడు. శేషగిరి వెళ్ళిపోయాకగాని ఉషకు తీరిక దొరకదు. ఒంటిగంటకొస్తే అన్నం తిని అలాగే నిద్రపోయి సాయంత్రం బైటికెళ్తాడు. లేదా అసలింటిజోలి లేకుండా రాత్రి పదింటి వరకూ తిరిగొస్తాడు.

పెళ్ళయిన కొత్తలో ఉష ఎంత చెత్త సినిమాలైనా శేషగిరి కోసం చూసేది. ఆ సినిమాల మీద భరించలేని అసహ్యం కలగటమూ, శరత్ పుట్టటమూ ఒకేసారి జరగటంతో ఉష శేషగిరితో కలిసి సినిమాలు చూడటం మానేసింది. ఉష

ఇష్టపడే సినిమాలు శేషగిరికి పడవు.

ఉష టిఫిన్ చేసే ప్రయత్నంలో పడింది. గారెలకని రాత్రే పప్పు నాన బెట్టింది. అవి కడిగి రుబ్బి గారెలు చేసినా శేషగిరి నిద్రపోతూనే వున్నాడు. అవి వేడిగా తింటే బాగుండునని ఉష ఆరాటం. గదిలోకెళ్ళి టైము తొమ్మిది దాటింది లేవమని లేపేసింది. టిక్కెట్లు దొరక వేమోననే కంగారుతో శేషగిరి లేచి హడా వుడిగా ముఖం కడుక్కొచ్చాడు.

గారెల ప్లేటు తెచ్చిపెట్టి గడియారం తెచ్చి ముఖం ముందు పెట్టింది.

"అమ్మో! పది దాటింది. తొమ్మిది దాటిందంటావేం. ముందెందుకు లేపలేదు" గారెల వంక చూడకుండానే లేచాడు శేషగిరి.

ఉష పకపకా నవ్వి, "గడియారం ఆగి పోయింది. ఇప్పుడు ఎనిమిదే అయింది" అంది.

"ఎనిమిదింటికే లేపేశావా? ఆదివారం నిద్ర సర్వనాశనం చేశావుగదా" ముఖం చిట్లించుకుంటూ కూచున్నాడు.

"గారెలు ఆరిపోతాయని లేపేశాను. నీకు సినిమా పోతుందంటే బాధగాని, కష్టపడి గారెలు చేసింది వేడిగా తిని పెళ్ళాన్ని సంతోషపెడదాం అనే ఆలోచన వుండదు"

"చాల్లే సాధింపులు. మంచి నిద్ర పాడుచేశావు. మంచి కలకూడా వచ్చింది" దిగులుపడిపోయాడు.

"ఏం కలో అది?"

"అమితాబ్‌బచ్చన్, కృష్ణంరాజు ఫైట్స్ చేస్తుంటే మధ్యలో సిల్క్‌స్మిత డాన్సు - సిల్క్ బలే బావుందిలే" గారె తుంపి ఆవకాయ కారంలో అద్దుకుని నోట్లో వేసుకుని కళ్ళు మూసుకున్నాడు.

"ఛీ...ఛీ" అంది ఉష ముఖం చిట్లిస్తూ.

"ఓయ్" అన్నాడు శేషగిరి అధికారం వుట్టిపడే స్వరంతో.

ఉష మనసంతా అసహ్యంగా మారి పోయింది. శేషగిరితో ఏదో ఒకటి మాట్లాడాలనీ, ఇద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ టిఫిన్ తినాలనీ ఉష కోరిక. ఆ కోరిక ఎప్పుడూ తీరదు. అయిదు నిమిషాల్లో ఆ సంభాషణని ఉషకసహ్యం పుట్టేలా చెయ్యగలడు శేషగిరి. శేషగిరికి కాఫీ ఇచ్చి వెళ్ళి పిల్లల దగ్గర కూచుంది ఉష. పిల్లలు బొమ్మల పుస్తకాలు చూస్తు న్నారు. ఉషను చూడగానే, "అమ్మా ... ఈ కథ చెప్పవూ" అంటూ పుస్తకం పట్టుకుని వచ్చారు.

ఉష ఆ కథ చదువుతూ మధ్యలో శేషగిరి వంక చూసింది. శేషగిరి దీక్షగా ఓ సినిమా పత్రిక చదువుతున్నాడు. దాని మీద అర్ధనగ్నంగా వున్న ఓ తార బొమ్మ వుంది.

"ఇదిగో..ఆ పత్రికలు పిల్లలముందు చదవకు. వాళ్ళు అవి నేర్చుకుంటారు" అంది ఉష.

"ఏం నేర్చుకుంటే. నేను చెడిపోయి నట్టేనా నీ దృష్టిలో. ఒరే శరత్..ఇట్రారా! నీకు కథ చెబుతాను" అని పిల్లలను పిల్చాడు. శరత్, రవి ఇద్దరూ శేషగిరి దగ్గరకు పరిగెత్తారు.

"ఇదిగో వీడు అంజాద్‌ఖాన్ అని పెద్ద విలను" బొమ్మ చూపిస్తూ చెప్పాడు శేషగిరి.

"విలనంటే?" రవి అడిగాడు.

"అరే....విలనంటే తెలియదా. నా పిల్లలకు విలనంటే తెలియదా. ఎంత పరువు తక్కువ. ఏం పెంపకం నీ




పెంపకం" ఉషని వెక్కిరించాడు శేషగిరి.

"చాల్లే...నీకు తెలియని చాలా విష యాలు వాళ్ళకు తెలుసు. ఒరే శరత్... ఇటురారా"

మళ్ళీ పిల్లలిద్దరూ ఉష దగ్గరకు పరిగెత్తారు.

"కన్యాశుల్కం నాటకం ఎవరు రాశార్రా?"

"గురజాడ" టక్కున చెప్పాడు శరత్.

"అమ్మ అనే నవల ఎవరు రాశార్రా? రవీ...నువ్వు చెప్పు. ఒద్దొద్దు...చెప్పకురా. ముందు నాన్ననడుగుదాం. నువ్వు చెప్పు- అమ్మ అనే నవల రాసిందెవరో? రవికీ నీకూ పోటీ"

ఉష ఉత్సాహంచూసి పిల్లలు పకపకా నవ్వారు.

"అమ్మా? ఆ నవల ఇంకా సినిమాగా రానట్లుందే! సరే...నాకు తెలియదులే! అయినా ఆ అమ్మ నవల ఎవరు రాస్తే మనకేంటి?" తేల్చేశాడు శేషగిరి.

"అంజాద్‌ఖాన్ విలనంటే తెలియక పోతే నష్టం ఏంటి?"

"అమ్మో ... చాలా నష్టంవుంది. విలన్ని గుర్తుపట్టలేకపోతే చావుదెబ్బలు తింటాం. ఒరే...మీ అమ్మ చెప్పే అమ్మ కథలూ, అమ్మమ్మ కథలూ వినకండి. ఇప్పుడే ముసలాళ్ళయిపోతారు" పిల్లల్ని హెచ్చరిస్తున్నట్లు కళ్ళ పెద్దవిచేసి చెప్పాడు శేషగిరి.

"అమ్మే మంచి కథలు చెబుతుంది" అన్నాడు శరత్.

ఉష గర్వంగా నవ్వింది - శరత్‌ని ముద్దుపెట్టుకుంటూ.

"చాలే సంబరం. నాకు నీళ్ళు పెట్టు.. టైమయిపోతోంది" లేచాడు శేషగిరి.

"ఇవాళేం సినిమాకి? పిల్లల్ని కూడా తీసుకుపోరాదు. నాక్కాస్త రెస్టు దొరుకు తుంది"

"పిల్లల్ని నాతో సినిమాకి పంపిస్తావా? నీ కంఠంలో ప్రాణం వుండగానే! అయినా ఇవాల్టి సినిమా పెద్దలకు మాత్రమే" అని కన్నుకొట్టాడు శేషగిరి.

"ఛి ఛీ ... సిగ్గులేకపోతే సరి" అంటూ నీళ్లు తోడటానికి వెళ్ళింది ఉష.

స్నానంచేసి పూలరంగడిలా ముస్తా బయ్యాడు శేషగిరి.

"ఇంకా చిన్న పిల్లాడిలా ఆ బొమ్మల చొక్కాలెందుకు. కాస్త హుందాగా కని పించే బట్టలు కొనుక్కోరాదూ?" అంది ఉష శేషగిరి కొత్తగా కొనుక్కున్న బొమ్మల చొక్కా చూస్తూ.

"భలే...ముప్ఫైఏళ్ళకే నన్ను ముస లాడినై పొమ్మంటావా? అసలే నువ్వు ముసలమ్మవయ్యానని నేనేడుస్తుంటే"

"నేను ముసలమ్మనైతే నాకంటే అయిదేళ్ళు పెద్దాడివి-నువ్వు కుర్రాడివా?"

"నేనెప్పుడూ కుర్రాడినే" అంటూ సెంటు పట్టించాడు చొక్కాకి.

"ఛీ...పాడుకంపు" అంటూ గది లోంచి బైటికి నడిచింది ఉష.

"నీకు మంచి సినిమాలేకాదు....మంచి వాసనలు కూడా పడవు. నా ఖర్మ. దొరికి నందుకు చెప్పుకోవాలి. మా నాయనమ్మ నయం నీకంటే"

శేషగిరి మాటలు వినపడనట్లే కూచుంది ఉష పేపర్ చూస్తూ.

"ఉషా...ప్లీజ్" దీనంగా వినపడింది శేషగిరి గొంతు.

"ఏమిటి?ఏంచెయ్యాలి?" ఆ గొంతుతో పిల్చాడంటే ఏదో సేవ చెయ్యాలని ఉషకి తెలుసు. శేషగిరి చేతిలో పాలిష్ బ్రష్

వుంది.

"నాయనమ్మలకు బూట్లు పాలిష్ చేయటం వస్తుందా? ఆ బూట్లు పాడు చేశానంటే లేనిపోని తంటా" అంది.

"ఛా ... నువ్వు నాయనమ్మేంటి! నీ అందం ఎవరికుంది. ఆ అందాన్నంతా ముతక చీరలు కట్టి ముచ్చట ముడులేసి పాడుచేసుకుంటున్నావని నా బాధగాని, నీతో అందంలో ఏ సినిమాతారా..."

"చాల్లే...అపు. పాలిష్ చేస్తాలే" ఉష చిరాకుపడుతూ పాలిష్ బ్రష్ తీసుకుంది. శేషగిరి ఈలవేస్తూ హుషారుగా అటూ ఇటూ తిరుగుతున్నాడు.

"ఎప్పుడూ ఓ...వుత్సాహంతో పొంగి పొర్లుతున్నట్టుంటాడు. అయిదు నిమిషాలు కాలొకచోట నిలవదు. ఏం మనిషో" విసుక్కుంటూ బూట్లు పాలిష్ చేస్తోంది ఉష!

"శరత్, రవీ...మీ బూట్లు కూడా తెండిరా! పనయిపోతుంది" అని కేకేసింది.

శేషగిరి బూట్లు తొడుక్కుని బైటికి పరిగెత్తాడు. ఉష పిల్లల బూట్లు పాలిష్ చేసి ఒకమూలన పెట్టింది. వంటచేద్దామా, కాసేపు పిల్లలతో కాలక్షేపం చేద్దామా అని ఆలోచిస్తుండగా వాకిట్లో రిక్షా ఆగింది.

"అరే...సహజా" పెద్దగా కేకేసింది ఉష. ఉష కేకవిని పిల్లలిద్దరూ గబగబా పరిగెత్తుకొచ్చి, లోపలికొస్తున్నావిడను చూస్తూ ఉష పక్కనే నిలబడ్డారు.

సహజ లోపలకి వస్తూనే ఇద్దరు పిల్లల్నీ ఒక్కసారే ఎత్తుకోవాలని ప్రయత్నించి ఎత్తుకోలేక దించేసింది.

"నేనొక్కసారన్నా చూడకుండానే నేనెత్తుకోలేనంతగా పెరిగిపోయారు"

"నువ్వెప్పుడు వచ్చావు?" ఆశ్చర్యం లోంచి తేరుకుని ఆనందంలో మునిగి పోతూ అడిగింది ఉష.

"పది రోజులయింది"

"పదిరోజులైతే ఇప్పుడా రావటం. ఎక్కడ దిగావు?" ఉషకు కోపం వచ్చింది.

"ఇంక ప్రతి పదిరోజులకూ వస్తుంటాలే...అలగకు"

"అంటే"

"అంటే నాకూ, ప్రసాద్‌కీ ఇక్కడికే ట్రాన్స్‌ఫర్ అయింది. మా ఇల్లు అరండల్ పేటలో. శారదనీ, రమణీ కలిశాను. నిన్నే ఆలస్యంగా కలుస్తున్నా" జాలిగా అంది సహజ.

"ఏడిశావులే..ఆయనేరీ? ఇద్దరూ కలిసి రాకూడదూ? నేనసలు చూడలేదుగదా అతన్ని"

"పెళ్ళికెందుకు రాలేదు? సహజ జీవిత భాగస్వామిని చూడటం అంత తేలికనుకున్నావా? నువ్వే మా ఇంటికి వచ్చి చూడాలి" హాస్యంగా అంది సహజ.

"ఊరికే రావచ్చా? కొబ్బరికాయా, పూలూ, పళ్ళూ పట్టుకురావాలా?"

"నువ్వేం తెచ్చినా స్వీకరిస్తాం"

"సరేలే..కూచో. మంచినీళ్ళివ్వనా?"

"ఇవ్వు. మీ పేర్లేంటిరా" అంటూ పిల్లల్ని దగ్గరకు తీసుకుంది సహజ.

పిల్లలిద్దరూ సిగ్గుపడిపోయారు.

"ఏంటే వీళ్ళ పేర్లు?" మంచినీళ్ళ గ్లాసందుకుంటూ అడిగింది.

"శరత్‌చంద్ర, రవీంద్ర"

"ఇంత తెలుగు సాహిత్యాన్నొదిలి బెంగాలీ సాహిత్యంమీద పడ్డావేమిటే? పెద్దవాడికి రవీంద్ర అని పెట్టాలేమో లెక్కప్రకారం"




# పొదుపు చేస్తే నెలనెలా
# జీవితమంతా వెన్నెలే

జాబిల్లి చక్కదనానికి,
వెన్నెల చల్లదనానికీ,
ప్రాతఃకాల భూపాలానికి
మలయసంధ్యామారుతానికి–ఇదో నిర్వచనం.
ఉదయ భానుడి కిరణాలకి
ఆ మురళీ వేణునాదానికి
ప్రశాంతమైన జీవితానికి,
మీ పిల్లల బంగారు భవిష్యత్తుకు - మరో నిర్వచనం.

ఔనండి.....పిల్లల భవిష్యత్తుకు,
సరయిన నిర్వచనం.
చెప్పగలిగినప్పుడే, జాతికి పురోగమనం.
ఆ ఆనందానికో నిర్వచనం–
జాతీయపొదుపు సంస్థ.

ఎన్నెన్నో పథకాలు
అన్నీ బహుసార్థకాలు



ఏవరాలకు:
మీకు దగ్గరలో ఉన్న పోస్టాఫీస్,
జిల్లా కలెక్టర్ కార్యాలయంలో
స్పెషల్ తహసిల్దార్, జిల్లా సేవింగ్స్
అధికారి, భారత ప్రభుత్వం,
డిప్యూటీ డైరెక్టర్, స్మాల్ సేవింగ్స్

NSU/AMCU/14/83








కమీషనర్,
స్మాల్ సేవింగ్స్, ఆంధ్రప్రదేశ్,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029

# మీ భద్రత మా బాధ్యత

"నాకు శరత్ ఎక్కువిష్టం కదా. ఇంకో మగపిల్లాడిని కనాలని నేననుకో లేదు. అమ్మాయి పుడుతుంది. ఏం పేరు పెట్టాలా అని ఆలోచిస్తుంటే ఆ ఆలోచన తెగకముందే అబ్బాయి పుట్టేశాడు. పోన్లే ... మరీ రవీంద్రుడు బాధపడతాడని ఆ పేరు పెట్టేశాను" ఉష హాయిగా నవ్వింది.

ఉష నవ్వు చూసేసరికి సహజకు కొత్త వుత్సాహం వచ్చింది. రమలాగా, శారదలాగా కాకుండా ఉష నిజంగా సంతోషంగా బతుకుతోంది అనుకుంటే సహజకు హాయిగా ఉంది.

"శేషగిరి కనిపించడేం?" లోపలి గదిలోకి చూస్తూ అడిగింది సహజ.

"బైటికెళ్లాడులే" అంది ఉష.

"నేనతనికి గుర్తున్నానా? పెళ్లిలో చూడటమేగదా? ఔనుగానీ...ఉత్తరాలన్నా రాయకుండా ఏం చేస్తున్నావు?"

"ఏంటో అశ్రద్ధయిపోతోంది! అసలు తీరిక దొరకదు. కాస్త టైముంటే ఏ పుస్తకమో చదువుతూ కూచుంటా. నా సంగతి తెలియనట్లడుగుతావేం! ఎన్ని కబుర్లన్నా చెబుతాగానీ నాలుగు వాక్యాలు రాయాలంటే కుదరదు"

"నీకు రాసే అలవాటుంటే మంచి రచయిత్రివయ్యేదానివి..సరేగానీ...మంచి పుస్తకాలేం చదివావీమధ్య"

"ప్రేమ్‌చంద్ 'రంగభూమి' చదివాను. ఎన్నాళ్లనించో ఆ పుస్తకంకోసం ప్రయత్నిస్తుంటే నిన్ననే దొరికింది. రాత్రంతా కూచుని చదివేశా. ఎంత బాగుందో. నువ్వు చదివావా?" కుతూహలంగా అడిగింది ఉష.

"ఆఁ...చదివా. నాక్కా నవల చాలా ఇష్టం. ఎన్ని రకాల పాత్రలోగదా. పైగా ప్రేమ్‌చంద్ మానవ మనస్తత్వంలో వుండే వైవిధ్యాన్ని చాలా బాగా చూపిస్తాడు. ఒకే పాత్ర చాలా మంచిగానూ, చాలా చెడ్డగానూ కూడా ఆలోచిస్తుంది. మంచి పాత్ర చెడ్డ ఆలోచనలను కంట్రోలు చేసుకోగలుగుతుంది...అంతే తేడా"

"కానీ ఈ నవలలో సోఫియాకు చెడ్డ ఆలోచనలేం వచ్చాయి? ఎంత మంచి పాత్ర" ఆలోచనగా అంది ఉష.

"సరేలే..వినయుడి కోసం ఆ కలెక్టర్ని ప్రేమించినట్లు నటించి మోసగించి పిచ్చిగా వుండమూ?"

"అది ప్రేమకోసం గదా"

"నిజమే...కానీ ఇంకేరచయితైనా సోఫియా లాంటి పాత్రను ఆ రకంగా చేస్తాడా? హీరోయిన్నీ వాంప్‌నీ కలగలిపి ఒకే స్త్రీలో చూపగలుగుతాడా?"

"ఎందుకలా చేశాడంటావు?"

"జీవితం అలాగే వుంటుంది కాబట్టి. జీవితంలో హీరోయిన్లనీ, వాంప్‌లనీ ప్రత్యేకంగా వుండరు. మనిషిలో మంచి చెడ్డలు రెండూ వుంటాయి. వాళ్ళెదురయ్యే పరిస్థితులనుబట్టి, వారి జీవిత విధానాన్నిబట్టి, స్వభావాన్ని బట్టీ ప్రవర్తిస్తుంటారు"

ఇద్దరూ సాహిత్య ప్రపంచంలో పడి టైము మర్చిపోయారు.

శరత్, రవీ ఆటలతో విసుగెత్తి ఆకలంటూవచ్చేసరికి పన్నెండు దాటింది.

"అరే...అన్నం వండలేదే! బిస్కట్లి స్తానుగాని కాసేపు ఆడుకోండి నాన్నా... తొందరగా అన్నం వండేస్తాను" అంటూ ఉష లేచింది.

"నేనూ వెళ్తాను మరి" సహజ కూడా లేచింది.

"ఉండు...అన్నం తిని సాయంత్రానికి





వెళ్ళవుగానిలే''

"ప్రసాద్ ఎదురుచూస్తుంటాడు"

"నువ్వెళ్ళి వంట చెయ్యాలా?"

"అక్కర్లా...తనే చేసేస్తాడు"

"ప్రసాద్ వంట చేస్తాడా?" ఆశ్చర్యపోయింది ఉష.

"ఏం...బాగానే చేస్తాడు. ఈసారి ఆదివారం మీరిద్దరూ వచ్చి మా ఇంట్లో భోజనం చెయ్యాలి. రమనూ, శారదనూ కూడా రమ్మంటాను"

"అలాగయితే నువ్వు ఉండిపోరాదూ? సాయంత్రం వెళ్ళొచ్చు"

''నాలుగింటికి మాత్రం వెళ్ళితీరాలి. మేమిద్దరం కలిసి సాయంత్రం రోజ్ గార్డెన్‌కి వెళ్ళాలనుకున్నాం"

"ఇంకా రోజ్ గార్డెనుందా అక్కడ" ఆశ్చర్యపోయింది ఉష.

"అదేంటి..లేదా! ఏమయింది?''ఇంకా ఆశ్చర్యపడింది సహజ.

''ఏమో..నాకు తెలియదు. ఈ నాలుగైదేళ్ళలో నేనటు వెళ్ళలేదు. నీకింకా రోజ్‌గార్డెన్ గుర్తుందా?" నవ్వింది ఉష.

"నువ్వుకూడా ఇలాగైపోయావుగదా" సహజ నిట్టూర్చింది.

ఉష నవ్వి, "సరే..నాలుగింటికి పంపుతాను గానీ వుండిపో.సాజీ..మనం దాదాపు అయిదేళ్ళ తర్వాత కలుసుకున్నాంగానీ అలా లేదు కదూ నిన్న మొన్న కలుసుకున్నట్టుంది. ఏంటిది? ఎందుకిలా వుంది?" సంతోషపడుతూ అడిగింది.

"మనం ఎక్కడ ఆగామో అక్కడ నుంచే మొదలయ్యాం. మధ్యలో గాప్స్ లేవు. మనిద్దరం అయిదేళ్ళ క్రితం కలిసినపుడు 'కాలాతీత వ్యక్తులు' గురించి మాట్లాడుకున్నాం. ఇవాళ మళ్ళీ కలవగానే 'రంగభూమి' గురించి మాట్లాడుకున్నాం. ఎక్కడా ఏమీ ఆటంకాలు లేవు. పెళ్ళీ, ఉద్యోగం, పిల్లలూ – ఏవీ మన ఆలోచనలకు అడ్డురాలేదు. శారద కొమ్మలెయ్యటంలేదు. తెలుసా?'' హఠాత్తుగా అడిగింది సహజ.

"తెలుసు..చాలా దిగులుగా వుంటుంది శారదని చూస్తుంటే" అంటూనే ఉష వంటింట్లోకి నడిచింది.

''శారద సరే..రమని కలుస్తున్నావా?" కూరల బుట్ట అందుకుంటూ అడిగింది సహజ.

''లేదే...చాలా రోజులయింది! రమ ఎంత మారిపోయిందంటే వాళ్ళ సంసారం సంగతులు తప్ప మరొకటి మాట్లాడదు. నాపసానిలాగా తయారయింది. నువ్వెళ్ళానన్నావుగా..ఎలావుంది? ఏమంటోంది?''

"అలాగేవుంది. నాకు చాలా బాధనిపించింది. ఆడవాళ్ళను సంసారాలు మింగేస్తాయి ఉషా! మేమిద్దరం కలిసి బాలమురళి పాట కచేరీకి వెళ్ళాం. మధ్యలో లేచి వెళ్ళిపోయింది పనుందంటూ''

''నిజమా?"

"ఊఁ..నిజంగా ఎంతాశ్చర్యపోయానో! పాటలంటే దానికెంత ప్రాణం. అంతటి ఇష్టాన్ని ఎవరు, ఎలా మింగేశారు? భర్తా? అత్తగారా? పిల్లాడా?''

''ముగ్గురూ కలిసిన ఆ సంసారమై వుంటుంది. ఈ ఇంటి చాకిరీకి అంతుండదే సాజీ...పళ్ళ బిగువున చేసుకుపోవాల్సిందే"

"అయితేమాత్రం నువ్వు పుస్తకాలు చదవటం మానుకున్నావా?"

"లేదులే. అవి లేకపోతే ఎప్పుడో విరక్తిపుట్టేది ఈ చాకిరంటే. ఈ పని

కాగానే ఆ పుస్తకం చదువుకోవచ్చనే ఆలోచనతో ఈ పని గబగబా చేసేసుకుంటాను"

"అమ్మయ్య. నువ్వు మారలేదనుకుంటే నాకెంత సంతోషంగా వుందో. శేషగిరి కూడా పుస్తకాలు బాగా చదువుతాడా?"

"బొత్తిగా చదవడు. అదే నా దిగులు"

"అయ్యో-పోనీలే...నీకడ్డం రావటం లేదుగా''

ఇద్దరూ కలిసి వంటచేసి పిల్లలకు పెట్టారు. అప్పటికే టైము రెండయింది.

''అతనింకా రాలేదేంటి?'' సహజ ఆశ్చర్యంగా అడిగింది.

"ఫ్రెండ్స్‌తో వెళ్ళుంటాడు. మాట్నీకి వెళితే వెళతానని కూడా అన్నాడు. మనం భోజనం చేసేద్దాం''

ఉష కంచాలు పెట్టింది.

''ఆదివారంనాడు మిమ్మల్ని విడదీసే ఫ్రెండ్సెవరే. శత్రువుల్లా వున్నారుగాని స్నేహితుల్లా లేరు''

''మరి నేను మీ ఇద్దర్నీ విడదియ్యలేదా? మీ ప్రసాద్ కూడా నన్నిలాగే శత్రువుననుకుంటాడా ఏం ఖర్మ'' ఉష నవ్విందిగానీ మనసులో దిగులనిపించింది.

శేషగిరి సినిమాపిచ్చి గురించీ, అతనికీ తనకీమధ్య అభిరుచుల్లో వున్న తేడా గురించీ సహజకు అప్పుడే చెప్పటం బాగోదని ఉష ఆ ప్రసక్తేమీ తీసుకురాలేదు. సహజ ఇక్కడే వుంటుంది. నిదానంగా తన ఆలోచనలూ, దిగుళ్లూ అన్నీ చెప్పుకోవచ్చు అనుకుంది.

ఇద్దరూ భోజనాలు ముగించి మళ్ళీ కబుర్లలో పడ్డారు.





"పోనీ నువ్వు కూడా రాకూడదూ. పిల్లలతో సరదాగా వుంటుంది'' అంది సహజ. టైము మూడున్నర దాటుతోంది. ఉషనొదిలి వెళ్ళాలనిపించటంలేదు. కానీ ప్రసాద్‌తో రోజ్‌గార్డెన్‌కి వెళ్ళాలనీవుంది.

"రావొచ్చుగానీ..'' అని మొహమాటపడింది ఉష.

''శేషగిరివస్తే ఇబ్బంది పడతాడా?''

''ఇబ్బందేంలేదులే"

శేషగిరి ఎప్పుడు వస్తాడో ఉషకి నమ్మకంలేదు. పోనీ వెళ్దాం అనిపిస్తోంది.

''అయితే వచ్చెయ్. తొందరగా రెడీకా. లే..పిల్లల్ని నే తయారుచేస్తాలే...పో" సహజ ఊపిరాడనివ్వలేదు.

ఉష తయారై ఇంటికి తాళం వేసి తాళంచెవి పక్కవాళ్ళకిచ్చింది.

సహజ వాళ్లిల్లు చేరేసరికి ప్రసాద్ వాకిట్లోనే ఎదురయ్యాడు. మధ్యాహ్నం నుంచీ కంగారుపడుతూనే వున్నాడు సహజ రాలేదేమిటా అని. ఫ్రెండుతో పిల్లలతో దిగుతున్న సహజనుచూసి,

"ఏమయ్యావు. చూసి చూసి విసుగెత్తిపోయింది. రానని చెప్పి వెళితే నా కాలక్షేపం నేను చూసుకునేవాడిని. మీ ఊరుగదా అని నన్ను మరీ ఇంటి పక్షిని చేస్తున్నావు" అన్నాడు కాస్త కోపం నటిస్తూ.

''ఉషా...ప్రసాద్ కోపం పోగొట్టే బాధ్యత నీదే" అంది సహజ. ఉష నవ్వుతూ నిల్చుంది. ప్రసాద్ కూడా నవ్వి,

''ఇంతకూ మనం బైటికెళ్తున్నామా లేదా?" అని అడిగాడు.

''వెళ్దాం. ఉషని కూడా అందుకేలా కొచ్చా. నేను పది నిమిషాల్లో స్నానంచేసి వస్తాను" అంటూ లోపలికెళ్ళింది సహజ.

ప్రసాద్ కూడా బట్టలు మార్చుకోటానికి లోపలికి వెళ్లాడు.

ఉష వాకిట్లోకి వచ్చి మొక్కల్ని చూస్తూ నిల్చుంది.

''అమ్మా ... ఈ గులాబీ పువ్వు కొయ్యనా?" అని అడిగాడు శరత్.

''ఎందుకురా? నువ్వు పెట్టుకుంటావా?" అంది ఉష నవ్వుతూ.

''నువ్వు పెట్టుకో" అంటూనే కోశాడు శరత్. అన్నను చూసి రవి కూడా ఒకటి కోశాడు.

''అత్త కోప్పడుతుందిరా" అంది ఉష పువ్వులు తీసుకుంటూ.

''పోనీ అత్తకే ఇద్దాంలే" అన్నాడు రవి.

''పిచ్చి నాన్నా..పువ్వు కోసినందుకు కోప్పడుతుందిగానీ మనం తీసుకున్నందుకు కాదురా" అంటుంటే ప్రసాదొచ్చి, ''పువ్వులు కావాలా మీకు? ఆ పక్క చాలా వున్నాయి ... రండి కోసిస్తాను" అంటూ రవిని ఎత్తుకున్నాడు. ఉష వారిస్తున్నా వినకుండా రవీ శరత్‌లు అడిగిన పూలూ, ఆకులూ అన్నీ తుంపి ఇచ్చాడు ప్రసాద్. ఉష అయ్యో అయ్యో అని అరుస్తున్నా వినిపించుకో లేదు.

సహజ వచ్చి, ''ఊరుకో ఉషా...మీ పిల్లలకి ప్రసాద్ సంగతి తెలియదు గాబట్టి వాళ్ళు పూలడిగారు. పిల్లలు అడగాలేగాని కొండమీద కోతినన్నా తెచ్చిస్తాడు. మా ఇంట్లో మంచి వస్తువులన్నీ మా పక్కింటి పిల్లలు పాడుచేస్తుంటారు. ఇక రండిరా...పెద్ద తోటకెళ్ళి బోలెడుపూలు తెచ్చుకుందాం'' అని పిల్లల్ని పిలిచింది సహజ.

సిటీ బస్సెక్కి కాలేజీ దగ్గర దిగారు.



అప్పటికి అయిదయింది. ఊరు బయట పొలాల దగ్గర చల్లని గాలికి అందరికీ హాయనిపించింది.

గులాబీ తోట కోసం వెదకటం మొదలెడితే అదెక్కడా కనపడలేదు. అయిదేళ్ళలో ఆ ప్రాంతం చాలా మారింది. కొత్త కొత్త ఇళ్ళు, ఆఫీసులూ చాలా వచ్చాయి. వాళ్ళనీ వీళ్ళనీ వాకబు చేస్తే ఆ తోటతీసేసి రెండేళ్ళయిందనీ, అక్కడ స్పిన్నింగుమిల్లు కట్టారనీ చెప్పారు. ఆ మిల్లు దాటే వచ్చారు వీళ్ళు. మళ్ళీ ఆ పెద్ద మిల్లు దగ్గరకెళ్ళి దాన్ని చూసి నిట్టూర్చి ఆ గేటు దగ్గరే అరుగుల్లాగా వుంటే వాటి మీద కూలబడ్డారు.

"ఎన్ని కథలు చెప్పావోగదా రోజ్ గార్డెన్ గురించీ. చివరికి ఇదన్నమాట... నీ గులాబీల తోట" అని నిట్టూర్చాడు ప్రసాద్.

సహజకు అప్పటికే నీరసంవొచ్చి మాట్లాడకుండా కూచుంది.

పిల్లలిద్దరూ సహజ ఒళ్ళో చేరి, "పెద్ద తోటెక్కడత్తా" అనడుగుతున్నారు.

"పత్తి వ్యాపారానికి పెద్దతోట బలైపోయిందిరా" అన్నాడు ప్రసాద్.

"రోజ్ గార్డెన్ గురించి ఏం కథలు చెప్పిందండీ" అనడిగింది ఉష.

"మీరు మొదట ఈ తోటకి వచ్చినపుడు జరిగిన విశేషాలన్నీ నాకు తెలుసండీ..."

"మా హెడ్‌మిస్ట్రెస్ తిట్టిన తిట్లు కూడానా?"

"ఆఁ..అవి కూడా" నవ్వాడు ప్రసాద్.

"మేం మిషనరీ స్కూల్లో చదవటం వల్ల అనవసరంగా ఎన్ని తిట్లు తిన్నామో చెప్పలేమండీ. మేం పదిమంది ఆడపిల్లలం కలిసి ఈ తోట కొస్తే ఆ రోజే హిందూ కాలేజీ అబ్బాయిలొచ్చారు. వాళ్ళకీ మాకూ చిన్న గొడవయింది. అసలెందుకే గొడవయింది నీగ్గుర్తుందా?"

ఉషకి గతాన్ని తల్చుకుంటే నవ్వాగటం లేదు.

"మన రాజశ్రీ మూలంగా. ఆ కోతి ఆ అబ్బాయిల్లో ఒకతనికి గుండుంటే అతన్ని చూసి నవ్వింది. ఆ గుండుకొలత కనుక్కోవాల్సింది వర్నియర్ కాలిపర్స్‌తోనా, స్క్రూగేజ్‌తోనా అని పెద్దగా అడిగింది తన ఏడవ ఫారం పరిజ్ఞానమంతా వెలగబెడుతూ. ఇక వాళ్ళూరుకుంటారా? గొడవ పెరిగింది"

ఉష నవ్వాపుకోలేకపోయింది. ప్రసాద్ ఆ విషయాలన్నీ తెలుసని చెప్పిన సంగతి మర్చిపోయి,

"అదిసరే..అయిపోయిందా. మర్నాడు ఎలా తెలిసిందో మా స్కూల్లో ఆ సంగతి తెలిసింది. పదిమంది ఇళ్ళకూ కబురుచేసి పేరెంట్స్‌ని పిలిపించారు. మేము ఫిజిక్స్ క్లాసులో పాఠం వింటున్నామో, నిర్మలా టీచరుగారి జడనే చూస్తున్నామో గుర్తులేదుగాని హెడ్ మిస్ట్రెస్ వచ్చి పదిమందినీ పిల్చుకెళ్ళారు. ఇక ఎట్లా తిట్టారంటే ఏడ్చీ ఏడ్చీ మా కళ్ళు వాచిపోయాయి. సాయంత్రం ఇంటికెళ్ళేప్పుడు మాకు కాపలాగా టీచర్లు వచ్చారు. మేం ఇంటికెళ్ళకుండా ఏ రైలు కిందో పడతామని వాళ్ళ భయం. ఇంతా చేస్తే ఒక్క రాజశ్రీ వాళ్ళింట్లో తప్ప ఎవరింట్లోనూ పెద్దగా పట్టించుకోలేదు. అలా ముగిసిందా గొడవ" అని చెప్పి, "నా పిల్లల్ని మాత్రం మిషనరీ స్కూల్లో చేర్చను బాబు" అంది ఉష.

"మగపిల్లలకి ఏ రూల్సూ వుండవే. ఇంట్లో అయినా స్కూల్లో అయినా ఆడ




పిల్లలే అటు కదలగూడదు, ఇటు మెదల గూడదు. తలెత్తగూడదు. కాస్త నవ్వ కూడదు" కసిగా అంది సహజ.

"మన జానకి టీచరుగారి ఊతపదం గుర్తుందా?

'"ఎందుకా వికగబాటు" అంటుండేది. మనం నవ్వకునేవాళ్ళం. తిన్నగానే నిల బడ్డాంగా, వెనక్కి విరుచుకుపడలేదుగా అనుకునేవాళ్ళం! ఆడపిల్లల్ని వినయంగా వుండేలా తయారుచెయ్యాలని వాళ్ళ తాపత్రయం"

ప్రసాద్ లేచి "చీకటి పడుతోంది. ఇక వెళ్దాం రండి. ఇంకాసేపుంటే ఈ మిల్లువాళ్ళు తరిమేస్తారేమో" అన్నాడు.

ఉషా పిల్లలూ అక్కడినుంచి కొత్త పేటకు రిక్షా మాట్లాడుకున్నారు. సహజా, ప్రసాదూ సిటీబస్‌కోసం చూస్తామన్నారు.

ఉష ఇంటికెళ్ళేసరికి ఏడుగంట లయింది. ఇల్లు తాళం పెట్టేవుంది. ఇంకా ఇల్లు గుర్తురాలేదన్నమాట - అనుకుంటూ తాళం తీసింది. మళ్ళీ అన్నం వండి పిల్లలకు పెట్టింది. పొద్దున మిగిలిన అన్నం తను తిని పిల్లల్ని నిద్రబుచ్చే సరికి తొమ్మిదయింది. పిల్లల పక్కన పడుకుని అలాగే నిద్రపోయింది.

మళ్ళీ తలుపు కొట్టిన చప్పుడుకు మెలకువ వచ్చి టైముచూస్తే పదకొండు గంటలు. కోపంగా వెళ్ళి తలుపుతీసి వచ్చి పడుకుంది. అన్నం పెట్టను. పెట్టుకుని తింటే తింటాడు లేకపోతే లేదు-అనుకుంది కచ్చగా.

శేషగిరి మాట్లాడకుండా బట్టలు మార్చుకుని పడుకున్నాడు. ఉష ఇంక పూరుకోలేకపోయింది.

"అన్నం తినవా?"

"తినే వచ్చాను" అన్నాడు శేషగిరి దుప్పటి ముసుగు పెడుతూ.

"ఎక్కడా?"

"ఫ్రెండింట్లో. ఫస్టు షో చూసి వాళ్ళింటికెళ్ళి భోంచేశాం. ఇవాళ వాళ్ళ అబ్బాయి పుట్టినరోజట"

ఉషకి కోపగించుకోవాలో అక్కర్లేదో తెలియలేదు. స్నేహితుడి కొడుకు పుట్టిన రోజున వాళ్ళింట్లో భోజనం చేసినందుకు కోపం ఎలా తెచ్చుకోవాలో ఉషకు తెలియలేదు.

"పోనీ చెప్పి వెళ్ళొచ్చుగా"

"నాకు మాత్రం తెలుసా? అనుకో కుండా బజార్లో కలిశాడు. కలిసి సినిమాకి వెళ్ళాం. రమ్మంటే సరేలే అని వెళ్ళాను. ఇంతకీ రేపా చద్దన్నం నేనే తింటాలే. నీ ఏడుపు ఆపు'' విసుక్కున్నాడు శేషగిరి.

"చద్దన్నం తినాలని ఏడుస్తున్నానా"

"మరేంటి నీ గోల?"

"ఆదివారం మనిద్దరం కలిసి గడపా లని నాకుంటుందని నీకెన్నిసార్లుచెప్పాను"

"నాతో సినిమాకు రావొద్దన్నానా? నువ్వు రావు. నీతోపాటు గిన్నెలు కడు గుతూ కూచోమంటావా ఏమిటి? నిన్న రాత్రి సినిమాకి వెళ్దామంటే వచ్చావా? నాతో కలిసి గడపటం నీకిష్టం వుండదు. దానికి మళ్ళీ నన్నంటావెందుకు?"

"పిల్లల్ని వదిలి సెకండ్‌షోకి ఇద్దరం వెళ్ళటం కుదురుతుందా?"

"నువ్వు వస్తానంటే పిల్లల్ని మీ అమ్మగారింట్లో దించి వచ్చేవాడిని. నీకు నాతో సినిమాకు రావటం ఇష్టంలేదు. ఇంకేవో కారణాలు చెబుతావెందుకు?'' శేషగిరి లేచి కూచుని మళ్ళీపడుకున్నాడు.

ఉష లేచి వెళ్ళి శేషగిరి మంచంమీద కూచుంది.

"నాకా పిచ్చి సినిమాలు ఇష్టంవుండవు.

అందులో రాత్రి మంచి పుస్తకం దొరికింది. పోనీ ఒక్కరోజుకి నువ్వు నాతో పాటు ఆ పుస్తకం చదవొచ్చుగా" సామరస్యంగా అంది.

"తల్లీ.... నా సినిమాలు నువ్వు చూడొద్దు. నీ పుస్తకాలు నేను చదవను. ఎవరికిష్టం వచ్చిన పనులు వాళ్లు చేసుకుందాం. అర్ధరాత్రి ఈ తిరణాల ఏమిటి? ఫో ... పోయి పడుకో. నాకు నిద్ర ముంచుకొస్తోంది" ముసుగు బిగించి పడుకున్నాడు.

ఉషకు అవమానంతో కళ్ళు నీళ్లు తిరిగాయి. తనంతట తాను మంచిగా మాట్లాడటానికి వస్తే పోయి పడుకోమంటాడా?

ఈ వాదన ఆపేసి సహజ వచ్చిన సంగతి, రోజ్‌గార్డెన్ సంగతి శేషగిరితో చెప్పాలని వచ్చింది ఉష.

శేషగిరి మాటలకు బాగా కోపం వచ్చి లేచివెళ్ళి రవి పక్కన పడుకుంది.

తన విషయమేదీ అతనికి పట్టదు. అతని అవసరాలన్నీ తీరుతుంటే చాలు. తన భావాలూ,తన పనీ,తన స్నేహితులూ ఇవేవీ అతనికక్కరలేదు. నిన్న రాత్రి అతను పిలవగానే వెళ్ళింది తను. అతని కోరికకు తల వొగ్గింది. ఇవాళ తనంతట తాను అతని దగ్గరకు వెళితే విదిలించి కొట్టాడు. తన ప్రేమకూ, ఇష్టానికి, కోరికకూ ఏ విలువా లేదు అతని ప్రపంచం వేరు. తన ప్రపంచం వేరు. ఇద్దరి ప్రపంచాలూ ఎప్పటికైనా ఒకటవుతాయా? శేషగిరికి ఈ సినిమా పిచ్చీ, ఆడంబరాల పిచ్చీ ఎప్పటికైనాపోతుందా? నిన్న రాత్రి ఎంత దిగులుగావున్నా 'రంగభూమి' చదవటం వల్ల మనసు




బాగయింది. ఆ పుస్తకం గురించే ఆలోచిస్తూ పడుకుంటే వెంటనే హాయిగా నిద్రపట్టింది. ఇవాళ మరీ ఒంటరిగా దిగులుగా వుంది.

ఉష కళ్ళల్లో నీళ్లు చెంపల మీదకు జారాయి. పక్కన తన మనిషంటూ ఉండికూడా ఏమిటీ వంటరితనం. ఆదివారమంతా శేషగిరి ప్రమేయం లేకుండానే గడిచింది. మళ్ళీ రేపటినుంచీ రొటీన్ మొదలు- పని, తిండీ, వురుకులూ పరుగులూ, పిల్లలూ, చదువులూ...ఇదే వరస.

రేపు మంచి పుస్తకమేదన్నా దొరికితే బాగుండును. చదివి హాయిగా నిద్రపోవచ్చు. తను కూడా తాగుబోతులా తయారయిందా ఏమిటి? తాగేవాళ్ళకు అది లేకపోతే నిద్రపట్టదట. తనకూ పుస్తకం వ్యసనమయిందా? శేషగిరికి సినిమా వ్యసనం. సహజకూ, ప్రసాద్‌కూ ఏవ్యసనముందో?ఏవ్యసనమైనాభార్యాభర్తలిద్దరికీఒకటే అయితే పేచీవుండదు. ప్రసాదు మంచాడిలా వున్నాడు.పొద్దుటనుంచీ భార్య కోసం ఎదురుచూసి భార్యతో, భార్య స్నేహితురాలితో కలిసి సరదాగా కబుర్లు చెప్పడంచేనే తెలుస్తోంది-మంచిమనిషని. వంట కూడా తనే చేశాడు. 'నీతో పాటు గిన్నెలు కడుగుతూ కూచోనా' అన్నాడు శేషగిరి. గిన్నెలు కడగటం హీనమైన పని అతని దృష్టిలో. అలాంటి పనులు తనే చెయ్యాలి. ఇద్దరం కలిసి ఆ పనులు చెయ్యాలనే ఆలోచనే అతనికి రాదు. చేయించాలనే ఆలోచన తనకు రాలేదు ఇవాల్టివరకూ.

సహజ అన్ని విషయాలూ ప్రసాద్‌తో చెప్పుకుంటుంది. పంచుకుంటుంది. కలిసి పని చేసుకుంటారు. కలిసి పుస్తకాలు చదువుకుంటారు. వాటి గురించి ఇద్దరూ


నాకు ఫలక్ నామా ప్యాలెస్ లాంటి భవనం కావాలి


చూడు...అది నాగార్జున సిమెంట్ తో కట్టినదై యుండాలి సుమా
MAM-SATYAMURTHY

చక్కగా మాట్లాడుకుంటారు. ఒకరు మాట్లాడేది ఇంకొకరికి అర్థమై ఆనందం కలుగుతుంది. ఎంత అదృష్టమది. తమ మధ్య ఏ విషయాన్ని గురించైనా పోట్లాట తప్ప మాట్లాట వుండదాయె. ఛీ...ఇక నుంచీ శేషగిరి ఏమన్నా పట్టించుకో కూడదు. వాదన పెంచగూడదు.

ఈ రకమైన ఆలోచనలతో ఎప్పటికో నిద్రపోయింది ఉష.




'అమ్మయ్య...వచ్చేశారా? ఇక రారేమో అనుకుంటున్నా. పొద్దున్నే టిఫిన్ తింటానికి రమ్మంటే 10 గంటలకా వచ్చేది'' అంటూ సహజ హడావుడిగా ఆహ్వానించింది.

"మేం టిఫిన్ చేసే వచ్చామండీ'' అన్నాడు రామారావు.

''అయినా మళ్ళీ తినాల్సిందే! మేం చేసింది వృథా అవటానికి వీల్లేదు... కూర్చోండి"

శారదనీ, ఉషనీ, రామారావునీ, శేషగిరినీ కూర్చోబెట్టి ప్రసాద్‌ని పిలిచింది సహజ. 'వస్తున్నా' అని ఐదు నిమిషాల తర్వాత టీ కప్పులు ట్రేలో పెట్టుకుని వచ్చాడు ప్రసాదు. ప్రసాదుని చూస్తూనే నిలబడ్డారు శారదా, ఉషలు. 'అరె!అదేమిటండీ' అంటూ టీ కప్పులు తీసుకుని భర్తలకిచ్చి, తామూ తీసుకున్నారు. 'నేను టీ తాగనండీ' అంటూ రామారావు కప్పు ట్రేలో పెట్టేశాడు.

"మా ఇంట్లో కాఫీ పొడి లేదండి" అని నవ్వి-

"అయితే పనంతా అయిపోయ్యాక వచ్చారన్నమాట" అంది సహజ.

"పనంతా అప్పుడే ఎలా అవుతుంది. పద వంటింట్లోకి'' అంటూ శారద లేవబోతుంటే ప్రసాద్ అడ్డుపడ్డాడు.

"పనేమీ లేదండీ! కొంచెం వున్నా తర్వాత చేసుకోవచ్చు. మీరు పాత స్నేహితులు. ఎన్ని కబుర్లో చెప్పుకోవాలి. మేం కొత్త స్నేహితులం. పరిచయాలు పెంచుకోవాలి. కాబట్టి కాసేపు పనులు వాయిదా వేద్దాం. ఒంటిగంటకు మీకు భోజనం పెట్టే పూచీ నాది" అన్నాడు. శేషగిరి వాచీ చూసుకుని ఇబ్బందిగా కుర్చీలో కదులుతున్నాడు.

ఉష నవ్వి "వెళ్లు'' అంది.

"ఎక్కడికి" ప్రసాద్ అడిగాడు.

''ఇవాళ 'బొబ్బిలిపులి' మార్నింగ్‌షో టిక్కట్టు సంపాదించానండీ! ఇవాళే రిలీజ్ కదా...చాలా కష్టపడి సాధించా టిక్కట్టు. సినిమానుంచి ఇటే వస్తాను. అయినా లేట్ అవుతుందేమో నా కోసం చూడకుండా మీరు భోజనం చేసెయ్యండి" అంటూ లేచాడు శేషగిరి. రామారావు దిన పత్రికలో మునిగిపోయాడు.

"మీ ఇద్దరూ పిల్లలున్నా ఆ బెడద లేకుండా గడుపుతున్నారే" అంది సహజ.

"పుట్టిళ్లు అత్తిళ్లు ఒకే ఊరైతే అదే సుఖం" అంది శారద.

''రమని ఎంత బతిమాలినా రానన్నది. ఇవాళ వాళ్ళాయన క్లబ్బు మెంబర్లకి పార్టీ ఇవ్వాలట. తీరదుగాక తీరదంది. రమకూడా వస్తే బాగుండేది"

''నాకు రమ రాకపోతేనే బాగుం టుంది. అది వచ్చినదగ్గర్నించీ వెళ్ళేదాకా 'మా ఆయనా, మా అబ్బాయి, మా అత్తగారు' ఇదే సొద. నాకైతే తెగ చిరాకేస్తుంది'' అంది శారద.

ఉష, సహజ నవ్వారు. ప్రసాద్ వంటింట్లోకి జారుకున్నాడు.

''మనం ఆ గదిలోకి పోదాం'' అంది శారద మెల్లిగా.

రామారావు పత్రికలో ఎడిటోరియల్ చదవటం ముగించి డెమోక్రసీ గురించి రిటైర్డ్ మిలటరీ ఆఫీసరు ఎవరో రాసిన వ్యాసం చదవటం మొదలెట్టాడు.

ముగ్గురు స్నేహితురాళ్ళూ పక్క గదిలో మంచంమీద కూచున్నారు.

"నిజంగానే ప్రసాద్‌గారు చాలా మంచి మనిషి. నువ్వు 'మా మంచోడు మంచోడు' అంటే ఏమో అనుకున్నా" అంది ఉష.

సహజ నవ్వి, "ఈ మాట అతనితో అన్నారో చంపేస్తాను" అంది.

''అదేం ... ఎందుకననకూడదు?"

"అనొద్దే ... దానికో కథ వుంది. తర్వాతెప్పుడన్నా చెప్తాలే"

"మీ ఇంట్లో చాలా పుస్తకాలున్నాయే" అంది ఉష అల్మారాల వంక చూస్తూ.

"ఔనే. మా ఇంట్లో మంచి పుస్తకాలు వున్నాయి. మంచి పాటల రికార్డులు వున్నాయి. రెండు మూడు మంచి పెయింటింగులు కూడా వున్నాయి. అవన్నీ వుండటానికి కారణం మీరే"

"అదేంటి?" అన్నారు ఉష, శారదలు ఒక్కసారే.

"మరి చిన్నప్పటినుంచీ రమ పాటలు పాడీ, శారద బొమ్మలు వేసీ, ఉష దొరికిన పుస్తకమల్లా నా చేత చదివించి నాకీ పిచ్చి ఎక్కించారు. ఇపుడు మీరు హాయిగా సంసారాలు చేసుకుంటుంటే నేనింకా ఈ పిచ్చిలోనే పడి కొట్టుకొంటున్నా"

సహజ ఏడుపు మొహంపెట్టింది. ముగ్గురూ నవ్వుకున్నారు.

"సాజీ...మన బి.ఏ. రోజులు తల్చుకుంటే ఎంత ఆనందంగా వుంటుందో. బి.ఏ. మొదటి సంవత్సరంలో విశ్వనాథ నవలలు, బాపిరాజు నవలలు తెగచదివాం. రెండో సంవత్సరం అంతా కవిత్వం-కృష్ణశాస్త్రి నుంచి కరుణశ్రీగారిదాకా. చివరి సంవత్సరంలో చలం పుస్తకాలు దొరికాయి మనకి"

"నువ్వింకా పుస్తకాలు చదువుతున్నందుకు నాకు చాలా సంతోషంగా వుందే ఉషా! శారదా, రమా ఇట్లా అయిపోవటం చూసి నాకెంత దిగులేసిందో?"

"ఎన్ని పుస్తకాలు చదివి ఏంలాభం?" ఉష నిట్టూర్చింది.

"అదేంటి...ఆ వేదాంతం"

"వేదాంతం కాదు. మొన్న ఒక కథలో ఆ రచయిత అంటాడు – ఎన్ని జీవితసత్యాలు తెలిసీ ఏం ప్రయోజనం, ఒక సత్యానికనుగుణంగా కూడా జీవితాన్ని మార్చుకోలేనపుడు అని. అది నిజంకదూ?"

ముగ్గురి మనసులూ బరువెక్కాయి. ఉషకూడా సంతోషంగా లేదా అనుకుంది సహజ. 'బొబ్బిలిపులి' గుర్తొచ్చాడు. సంతోషంగా వుండకపోటానికే అవకాశం వుందనిపించింది. 'సాజీ' వంటింట్లోంచి ప్రసాద్ కేకవేశాడు.

"పదవే .... మనం మరీ దర్జాగా కూచున్నాం. అతనిచేత వంట చేయించట మేమిటి?'' అంటూ శారద లేవబోయింది.

''ఏయ్..లేవకు. అతని స్నేహితులొస్తే వాళ్ళు కబుర్లు చెప్పుకుంటుంటే నేను చెయ్యనా? మా మంచోడికి లేనిపోని అలవాట్లుచేసి చెడగొట్టకండి'' అంటూ సహజ వంటింట్లోకి నడిచింది.

"సహజ చాలా అదృష్టవంతురాలు" అంది శారద. ఉష నవ్వింది.

''మనకంటే ధైర్యం, తెలివి కలది అంటే బాగుంటుంది''

శారదకది నచ్చలేదు.

"బి.ఏ పూర్తయ్యేదాకా మనం,సహజా ఒక్కలాగే వున్నాంకదా. అప్పుడు సహజకంటే మనం తెలివితక్కువ వాళ్ళమనో, ధైర్యంలేని వాళ్ళమనో అను కున్నామా? ఇప్పుడు అదృష్టం బాగుంది దానికి మంచి మొగుడు దొరికాడు. మనకు...నీకేంలే సినిమాలపిచ్చి ఒకటి తప్పితే శేషగిరిగారు సరదాగానే వుంటారు. మరి నా ఖర్మే ఇలా కాలింది''

ఉష ఏమనాలో తెలియక వూరుకుంది.

సహజవచ్చి "వంటయింది. తిందామా, -కాసేపాగుదామా?'' అనడిగింది.

"అప్పుడేనా?"

ప్రసాద్ రామారావుని మాటల్లోకి దించే ప్రయత్నంలో పడ్డాడు. ముగ్గురు స్నేహితులూ పాతరోజుల్ని జ్ఞాపకం చేసుకుంటూ కాలం మరిచిపోయారు. ఒంటిగంటకు ప్రసాదొచ్చి పిల్చేదాకా వాళ్ళు ఐదేళ్ళవెనక జీవిస్తున్నారు.

"గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్ - అనేమాట నిజమయినట్లుగా వుంది మీ వరస చూస్తుంటే. మీకు ఆకలి కావటంలా'' అన్న ప్రసాద్ మాటలకు ఉలిక్కిపడ్డారు.

'అమ్మో..ఒంటిగంటయిందా'అంటూ హడావుడిపడ్డారు. రామారావు మౌనంగా సహజ మాటలకు నవ్వకుండా, భోజనం ముగించాడు. శారద ఇబ్బందిగా, ఉష హాయిగా నవ్వారు. సహజ, ప్రసాద్‌ల ఆత్మీయత ఉషకెంతో బాగుంది. వాళ్ళతో కలిసిపోయింది. శారద వాళ్ళను ఆశ్చ ర్యంగా చూస్తూండిపోయిందితప్ప వాళ్ళతో కలవలేక పోయింది. భోజనాలవగానే రామారావు వెళ్లాలన్నాడు. శారద కూడా బయల్దేరింది. ఉష వుండిపోయింది.

"రెండు దాటిపోయింది. మార్నింగ్‌షో వదిలేసివుంటారే?శేషగిరిగారింకా రాలేదే?" అంది సహజ.

"ఆ పక్కహాల్లో ఏ 'ఖూనీకోరో' వుంటే చూసొస్తాడు'' అంది ఉష అసహనంగా.

"'ఖూనీకోరు' నా?"

"సినిమా లేవే! నిజంగా ఖూనీ కోరుని కాదు"

"ఆ సినిమా వుందా నిజంగా"

"లేకపోతే వస్తుంది..రాకేం? దరిద్రపు సినిమాలు"

చిరాకు పడింది ఉష.

"మరీ అంత పిచ్చేమిటే?"

"నా ఖర్మ"

"ఛా...నోర్మూయ్. ఇంకా నయం కదూ-పేకాటా, తాగుడూ అయితే చచ్చి పోయేదానివి. ఇది నీ అదృష్టం అనుకో వాలి" అంది సహజ నవ్వుతూ.

"అంతేలే" అంది ఉష నీరసంగా.

సహజ ఉష నీరసం గమనించి "నా పుస్తకాలు అన్నీ చూసి నువ్వు చదవనివి వుంటే తీసుకెళ్ళు. నాకు పుస్తకాలు చదివే పిచ్చేగాక చదివించే పిచ్చి కూడా నువ్వే ఎక్కించావు. ఇన్నాళ్ళికి నీమీదే ప్రయోగించే అవకాశం దొరికింది" అన్నది.



ఇద్దరూ పుస్తక ప్రపంచంలో పడ్డారు. సాయంత్రం ఐదింటికి ఉష ఒక్కర్తే ఇంటికి వెళ్ళిపోయింది.

"ఏంటోయ్ ... ఆలోచిస్తున్నావు. పెద్దగా పైకి ఆలోచించరాదూ నేనూ వింటాను"

ప్రసాద్ సహజ మొహంలోకి చూస్తూ పక్కనే కూచున్నాడు.

సహజ కాస్త జరిగి ప్రసాద్‌కి చోటిచ్చి మళ్ళీ ఆలోచనల్లో పడిపోయింది.

"నీ నిశ్శబ్దంలోంచి పుట్టిన ధ్వనులు నా హృదయాన్ని తాకుతున్నాయి" సహజ ముఖాన్ని తనవైపు తిప్పుకుంటూ అన్నాడు ప్రసాద్.

"ప్లీజ్.... నీ ఆధునిక ఆశు కవిత్వంతో నన్ను చంపకు...నా మనసేం బాగోలేదు" అంది సహజ దిరాగ్గా.

"నీ మనసు బాగు చెయ్యటానికి నేనున్నాగదా"

"ఔను... నువ్వున్నావు"

సహజ మళ్ళీ మౌనంలో పడిపోయింది.

"ఏంట్రా...నీ దిగులు మళ్ళీ నీ స్నేహితుల్తో కలిసి బి.ఏ చదువుతావా?"

"కాదు. శారద చాలా డల్‌గా వుంది. చూశావుగా రామారావుని. ఉష శారదలా కాకపోయినా సంతోషంగా మాత్రం లేదు. ఆ సినిమాల పిచ్చాడెక్కడ దొరికాడో? ఒక్క మంచి సినిమా చూడడట. పిచ్చి సినిమాలు, పిచ్చి పాటలు. ఎలా పాపం వీళ్ళిద్దరూనూ"

"పిచ్చీ.... ఇన్నాళ్ళనుంచీ నువ్వు లేవుగదా ... వాళ్ళ జీవితాలు వాళ్ళు జీవించటం లేదా? నువ్వు దిగులుపడి చెయ్యగలిగిందేముంది...చెప్పు"

"అందే నా స్నేహితులు దిగులుగా

వుంటే నేను సంతోషంతో పొంగిపోతూ వుండనా?" సహజ మండిపడ్డది.

"కాదులే ... విచారించు. దుఃఖ సముద్రంలో మునిగిపో. విషాద సంగీతం వినిపించనా" ప్రసాద్ లేచి టేప్ రికార్డర్ పెట్టాడు.

సహజ కోపం తగ్గింది, "అదికాదు కానీ...వీళ్ళకోసం నేనేం చెయ్యలేనా?"

"ఎందుకు చెయ్యలేవూ ... వాళ్ళకే సహాయం కావాలంటే అది చెయ్యగలవు. కానీ ముందు వాళ్ళకు నీ సహాయంతో అవసరం రానీ"

"అంతేనంటావా?"

"అంతే... నువ్విక్కడికొచ్చి నెల దాటిందేమో వాళ్ళ జీవితాల గురించి నీకు తెలిసిందితక్కువ.వాళ్ళు నువ్వూహించేంత బాధలో లేరేమో! అసలు. ఆడవాళ్ళు..."

"ఆడవాళ్ళ గురించి నీకేం తెలియదు. నువ్వు మాట్లాడకు"

"అయితే సరే! రేప్పొద్దున దాకా నీతో మాట్లాడను. లైటు తీసిపడుకో" అంటూ ప్రసాద్ ముసుగు పెట్టి పడుకున్నాడు.

సహజ మళ్ళీ దిగులుగా ఆలోచనల్లో పడింది. శారదను తల్చుకుంటే సహజకు చాలా దిగులుగా వుంది. అయిదేళ్ళ సంసార జీవితం క్రమక్రమంగా కొంచెం కొంచెంగా శారదలోని కళనూ ఉత్సాహాన్ని ఎలా చంపేసిందో తల్చుకుంటే సహజ గుండె నీరయిపోయింది. ఈ హత్య చట్టబద్ధమయింది. ఈ హత్యను ఎవరూ పట్టించుకోరు. కొందరు సంతోషిస్తారు. ఈ హత్యకు కారణమైన శారద సంసారాన్ని లోకులంతా తెగ పొగుడుతారు. శారద ఆ సంసారాన్ని ద్వేషిస్తే? ద్వేషించకుండా ఉండటం సాధ్యమా? అప్పుడు లోకమంతా శారదమీద విరుచుకు పడుతుంది. కానీ ద్వేషించందే శారద సంతోషంగా బతకలేదు.

సహజ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ప్రసాద్ నిద్రలో ఇటు తిరిగి సహజమీద చెయ్యివేసి పడుకున్నాడు. చిన్నపిల్లాడిలా నిద్రపోతున్న ప్రసాద్‌ని చూస్తే సహజకు గుండెల్లోంచి ప్రేమ పొంగింది. మెల్లగా ప్రసాద్ చెంపను ముద్దుపెట్టుకుని 'ప్రసాద్ నిజంగానే మంచివాడు' అనుకుంది.

పాపం... ఆరోజు ప్రసాద్‌మీద ఎట్లా దాడి చేశానో-అని నవ్వుకుంది సహజ. పెళ్ళయిన కొత్తరోజులన్నీ సహజకు గుర్తొచ్చి క్రమంగా దిగులు తగ్గి పెదవుల మీదకు నవ్వుపాకింది. ప్రసాద్ ముఖం లోకి చూస్తుంటే మనసు ప్రశాంతంగా మారుతోంది. పాపం.... ఆరోజు 'నేను పంచాడిని' అంటూ వచ్చి ఎలా బిక్క ముఖం పెట్టాడో అనుకుని మళ్ళీ నవ్వుకుంది. ప్రసాద్ తనకు మొదటిసారి పరిచయమైన రోజూ, ఆతర్వాత స్నేహం కలిసిన రోజూ గుర్తొచ్చింది సహజకు.

ఆరోజు అంతర్జాతీయ మహిళా దినోత్సవం.ఎవరో మహిళాసంఘంవారుఆ సందర్భంగా జానకీదేవిగారిని సత్కరించే కార్యక్రమం పెట్టుకున్నారు. జానకీదేవి గారుస్వాతంత్ర్యసమరయోధురాలు.ఆవిడ కిప్పుడు 70 ఏళ్ళదాకా వుంటాయి. ఆవిడ సంఘసంస్కర్తగా కూడా పేరు తెచ్చుకుంది. ఆ ప్రోగ్రాం పేపర్‌లో ఆవిడ పేరు చదవగానే సహజకు ఆ మీటింగుకు వెళ్ళాలనిపించింది. ఆవిడ అనుభవాలు వింటే చాలా బాగుంటుందనిపించింది. మహిళా సమాజాలంటే సహజకంత మంచి అభిప్రాయం లేదు. సహజకున్న అభిప్రాయాలను బలపరుస్తూ మిగిలిన సమాజాలవారు ఆడవాళ్ళకు ముగ్గుల




పోటీలూ, పూలజడల అల్లిక పోటీలూ, అందాల పోటీలూ నిర్వహిస్తున్నారు. అవేవీచెయ్యకపోగా స్వాతంత్ర్యోద్యమంలో పనిచేసిన ఒకావిడను సత్కరిస్తున్నారంటే సహజకు ఈ మహిళా సంఘంవారిమీద సదభిప్రాయమే కలిగింది. సరిగ్గా అయిదు గంటలకల్లా ఆ మీటింగు హాలుకి చేరుకుంది. అక్కడ హడావుడి అప్పుడే మొదలయింది.

'పేళ్ళా తక్కువగా లేదు' అనుకుంది- అక్కడ తళతళలాడుతున్న జరీ చీరల్నీ, మెరుస్తున్న ఆభరణాలనూ చూస్తూ. అక్కడ మీటింగు వాతావరణం కంటే పేరంటం వాతావరణం ప్రముఖంగా కనిపించేసరికి సహజకు చిరాకేసింది.

సహజకు ముందు వరసలో కూచున్నావిడ వాళ్ళమ్మాయి సమర్తబంతి ఎంత ఘనంగా జరిగిందో చెబుతుంటే, వెనక వరసలో కూచ్చున్నావిడ తాను మద్రాసు వెళ్ళిన సందర్భంగా కంచి పట్టుచీరలు ఎంత మంచివి ఎంత చౌకగా కొన్నదో చుట్టూవున్నవారి నోరూరేలా చెబుతోంది.

ఆ మీటింగ్‌కి నలుగురే మగాళ్ళొచ్చారు. ఇద్దరూ యాభై యేళ్ళు దాటినవాళ్ళు. ఒకతనుయువకుడు.ఇంకోచిన్న కుర్రాడు. అన్ని వయసులవారికీ రిప్రజంటేషన్ వుంది అనుకుంది సహజ.

'ఈ మీటింగ్‌కి మగాళ్ళు రావచ్చా? రాకూడదని ప్రోగ్రాం పేపర్‌లో లేదు. రావచ్చనుకుంటే మరీ నలుగురేవచ్చారేం?' అనుకుంటుండగా జానకీదేవిగారువచ్చారు. ముఖ్యులంతా హడావుడి పడుతూ ఆవిడను తీసుకొచ్చారు. కూర్చోబెట్టి దండలేశారు. ఫొటోలు తీశారు. మీటింగు ప్రారంభమయింది.

అధ్యక్షత వహించినావిడ లేచి జానకీదేవిగారి గురించీ, ఈ మహిళాసంఘం గురించీ ఏకకాలంలో మాట్లాడాలని ప్రయత్నించి ఆ రెండు విషయాలూకాక ఇంకేదో మాట్లాడుతోంది.

సహజకు జీవితంమీద విరక్తి పుట్టుకొచ్చింది. ఎన్ని మీటింగుల్లో ఇలా విరక్తి పుట్టుకొచ్చినా మళ్ళీ మళ్ళీ తానీ మీటింగులకు ఎందుకొస్తానా అని సీరియస్‌గా ఆలోచించింది! తనకు కాస్త సంఘ జీవనం కావాలి, నలుగురు మనుషుల్ని కలవాలి అని వుంటుంది. ఎక్కడ ఏ మంచి విషయం జరుగుతుందో అది ఎక్కడ మిస్ అవుతానో అని ఎన్ని చెత్త విషయాలనో భరిస్తూ వుంటుంది. ఇవాళా అంతే జరిగింది...అనుకుంది నిరాశగా.

ఎలాగైతేనేం అధ్యక్షురాలు ఆ ఉపన్యాసాన్ని ఒక ఒడ్డుకు జేర్చింది.

జానకీదేవిగారు మాట్లాడటం ప్రారంభించారు ఆవిడ ముఖం చాలా అందంగా, హుందాగా వుంది. కానీ ఆమె చెప్పే మాటలు వింటున్నకొద్దీ సహజకు అసంతృప్తి పెరిగిపోతోంది.ఆమె స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి ఏమీ చెప్పలేదు. గాంధీగారి గురించి నాలుగు వాక్యాలు చెప్పింది. ఆ తర్వాత ఆవిడ భారతీయ స్త్రీత్వాన్ని గురించి మాట్లాడటం మొదలు పెట్టింది. గృహిణిగా, తల్లిగా భారతస్త్రీకి ఎంతో గౌరవం వుందట. ప్రపంచంలో ఏ స్త్రీ కూడా భారతస్త్రీ పొందినంత గౌరవాన్ని పొందటంలేదట. పురుషుల్ని ప్రోత్సహించి గొప్ప పనులు చేయించే, పిల్లల్ని చక్కగా పెంచి మంచి పౌరులుగాతయారుచేసే మహత్తర బాధ్యత స్త్రీ మీద వుందట. ఆ బాధ్యతను విస్మరించిన స్త్రీ దేశానికి మహాపరాధం చేస్తోందట.తన గృహాన్ని చక్కదిద్దుకునే

స్త్రీయే తన ఇంటిని స్వర్గంచేసుకునే స్త్రీయే తన పురుషుడికి సహకరించిన స్త్రీయే ఈ సమాజాన్ని ముందుకు తీసుకెళ్ళ గలదంటూ ఆవిడ తన ఉపన్యాసాన్ని ముగించింది.

అందరూ చప్పట్లు కొడుతుంటే సహజకు విపరీతమైన కోపం వచ్చింది.

అనుకోకుండా లేచి నిలబడి "నేను కూడా మాట్లాడవచ్చాండీ" అని అడిగింది.

జానకీదేవిగారు సహజ తన ఉపన్యాసానికి స్పందించి మాట్లాడతానంటుం దనుకొని 'మాట్లాడమ్మా' అన్నారు.

అధ్యక్షురాలికి అదేమీ నచ్చలేదు గానీ జానకీదేవిగారు అనుమతిచ్చింతరవాత తాను కాదంటే బాగుండదని వూరుకుంది. సహజ లేచి నిలబడి–

"జానకీదేవిగారు స్వాతంత్ర్యోద్యమంలో తన అనుభవాల గురించి మాట్లాడతారను కొని నేనీ మీటింగుకి వచ్చాను. కానీ జానకీదేవిగారు భారతీయ స్త్రీ గొప్పదనాన్ని గురించీ, స్త్రీ ధర్మాల్ని గురించీ చెప్పారు. భారతీయస్త్రీ చరిత్రలో ఎంత గౌరవింపబడిందో నాకు తెలియదు. నాకు అంత చరిత్ర తెలియదు. కానీ 'నస్త్రీ స్వాతంత్ర మర్హతి' అని మనువు అన్నాడని తెలుసు. నాకు తెలిసినంత వరకూ మన హిందూధర్మానికి మను ధర్మశాస్త్రమే ఆధారం. చరిత్ర వదిలె య్యండి..ఇంకా ఇప్పుడుకూడా స్త్రీకి ఇల్లూ, పిల్లలేనా ధ్యేయాలు. ఇంటిపనీ, పిల్లల పెంపకం స్త్రీ, పురుషలిద్దరూ కలిసిచేస్తే ఇద్దరికీ వ్యక్తిగతంగా అభివృద్ధిచెందే అవకాశాలుండవా? పురుషుల్ని ప్రోత్సహించటమేగాని స్త్రీలేం గొప్పపనులు చేయలేరా? అంతర్జాతీయ మహిళా దినోత్సవంనాడు సమానహక్కుల గురించో లేదా స్త్రీలు చేసిన గొప్ప పనుల గురించో చెప్పకుండా వంట బాగా చేసుకోండి, పిల్లల్ని బాగా పెంచండి అని చెబుతా రెందుకు? జానకీదేవిగారు స్వాతంత్ర్యోద్యమంలో పనిచేసేటప్పుడు ఇల్లూ, పిల్లలూ అని ఆలోచిస్తే ఆ పని చెయ్యగలిగేవారా?"

సహజకు ఆవేశం ఎక్కువైపోయి మాటలు రాలేదు. ముఖం ఎర్రబడిపోయి ఒళ్ళంతా చెమటపట్టేసింది. వచ్చి కుర్చీలో కూచుంది. హాలంతా కలకలం. అందరూ సహజకేసి వింతగా చూశారు. కొందరు సహజను మెచ్చుకుంటే మరికొందరు కోపం తెచ్చుకున్నారు.

జానకీదేవి లేచి–

"నేను స్త్రీలను గొప్ప పనులు చెయ్యొద్దని చెప్పలేదమ్మా! ఎన్ని గొప్ప పనులు చేసినా గృహాన్ని నిర్లక్ష్యం చెయ్యకూడదని నా ఉద్దేశం. స్త్రీలు గొప్ప పనులు చెయ్యాల్సిందే. సమానహక్కులు పొందాల్సిందే. అంతమాత్రాన తాను పురుషుడి కంటే గొప్పదాన్ననుకొని విర్రవీగకూడదు. తన బాధ్యతల్ని విస్మరించకూడదు. అసలు గాంధీగారు కూడా స్త్రీ స్థానం పురుషుడి వెనకే అనేవారు. మా ఉద్యమంలో కూడా స్త్రీలెక్కడ కష్ట పడతారోనని సాధ్యమైనంతవరకూ స్త్రీలను పికెటింగులలోకి రావద్దనేవారు. భర్తలు అరెస్టయ్యాకే భార్యలు వాళ్ళ స్థానంలోకి రావాలనేవారు. మీరు ఖాదీ ఉద్యమం చేపట్టండి...అది చాలు మీకు. అదెంతో గొప్ప సేవ దేశానికి అనేవారు గాంధీ గారు మాతో. ఉప్పు సత్యాగ్రహం ప్రారంభిస్తూ కూడా స్త్రీలెవరూ ఈ ఉద్యమంలోకి రానవసరంలేదనే అన్నారాయన. అయినా సరోజినీదేవిగారు గాంధీగారితోపాటు సత్యాగ్రహం చేశా








# శ్రీషిర్డీసాయిబాబా మహాత్మ్యం

దర్శకత్వం:
కె.వాసు

నిర్మాత: గోగినేని ప్రసాద్

సంగీతం:
ఇళయరాజా

ఈ చిత్రంలోని పాటలు ECHO క్యాసెట్స్‌లో & రికార్డుల్లో వినండి.

రనుకోండి. అందుకని నా ఉద్దేశం ఏమిటంటే-స్త్రీ ఎన్ని హక్కులు సాధించినా ఎన్ని గొప్పపనులు చేసినా తన ధర్మాన్ని మర్చిపోకూడదు."

మళ్ళీ చప్పట్లు మోగాయి.

సహజకు ఈసారి కోపం రాలేదు. నీరసం వచ్చింది. ఈవిడతో వాదించటం అనవసరం అనిపించి కదలకుండా కూచుంది.

మీటింగు పూర్తయింది. సహజ వరండాలో నడుస్తుంటే వెనకనించీ 'ఏమండీ! మిమ్మల్నే' అని పిలుస్తూ వచ్చాడు మీటింగుకి వచ్చిన ఆ నలుగురు మగాళ్ళ లోని యువకుడు.

సహజ ఆగి ఏమిటన్నట్టు చూసింది.

"మీరు చెప్పింది చాలా బాగుందండీ! ఆవిడ ఉపన్యాసం నాకేమీ నచ్చలేదు. ఈవిడ స్వాతంత్ర్యోద్యమంలో తన అనుభవాలు చెబుతుందనే నేనూ మీటింగుకి వచ్చాను. చాలా నిరాశపడ్డాను. మీరు మాట్లాడిన నాలుగు మాటలూ విన్నాక కాస్త తేరుకున్నాను. చాలా మంచి విషయం చెప్పారు" అన్నాడతను.

"థాంక్సండీ" అంది సహజ పెద్ద ఆసక్తి లేకుండా.

"మీరింకా నీరసంగా వున్నారే! నేనూ మాట్లాడదామనుకున్నా. అప్పుడు మీకు ఉత్సాహం వచ్చేదేమో"

"మరి మాట్లాడకపోయారా?"

"ఆవిడ వరసా, ఆ శ్రోతల వరసా చూస్తే మాట్లాడాలనిపించలేదండీ"

"నిజమే... నాకివాళ ఈ మీటింగ్‌కి ఎందుకొచ్చానా అనిపించింది. మీకూ అంతేనా" అంది సహజ.

"కాదండి ... నాకు ఇవాళొక కొత్త విషయం తెలిసింది. స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీల గురించీ, గాంధీగారి గురించీ ఆవిడ చెప్పిన విషయాలు కల్పించి చెప్పినవి కాదుగదా. ఆ విషయం గురించి ఇంకా తెలుసుకోవాలని వుంది. స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీల పాత్ర, వాళ్ళకున్న పరిమితులూ వీటి గురించి తెలుసుకోవాలనిపించింది. ఎలా తెలుస్తుందో ఏమో?"

సహజ నడుస్తున్నదల్లా ఆగి ఇప్పుడు అతని మొహంకేసి పరీక్షగా చూసింది.

అతనూ ఆగి, "మీ పేరేమిటండీ?" అనడిగాడు.

"సహజ"

"నా పేరు ప్రసాదండి! ఆంధ్రా బ్యాంక్‌లో పని చేస్తున్నాను. మీరు చదువుతున్నారా?"

"లేదండీ... ఆర్టీసీ ఆఫీసులో పనిచేస్తున్నాను"

"అలాగా! ఇవాళ మీటింగులో మీ పరిచయం కావటం బాగుంది. మీరెక్కడికెళ్ళాలి?"

"కృష్ణ నగర్" అంది సహజ.

"కృష్ణ నగరా... అదెక్కడ?"

"లేడీస్ హాస్టల్ దగ్గరండీ! అదుగో మా బస్ వచ్చేస్తోంది...మళ్ళీ కలుద్దాం" అంటుండేసరికి సహజ ఎక్కాల్సిన బస్సు వచ్చి ఆగింది. సహజ ఎక్కేసింది. ప్రసాద్ కాస్త నిరాశగా చూస్తూ నిలబడి పోయాడు.

'అతనెక్కడుంటున్నాడో... ఆంధ్రా బ్యాంకు ఏ బ్రాంచిలో పనిజేస్తున్నాడో ఏమీ కనుక్కోలేదే' అనుకుంది సహజ బస్సులో సీటు దొరికాక. ఛీ... ఈ బస్సుల్ని చూసి హడావుడిపడటం ఎప్పటికి పోతుంది... బస్సొచ్చి ఆగితే అది ఎక్కి తీరాలనే అనుకుంటుంది. ఆ బస్సుపోతే ఇంకో బస్సు రాదా?తొందరగా




బస్సు పట్టుకుని ఇల్లు చేరాలనే ఆలోచన తప్ప ఇంకోటుండదు.దరిద్రపు అలవాటు. కాసేపతనితో మాట్లాడి, అడ్రసు కనుక్కొని, తన అడ్రసు ఇచ్చి తర్వాత వచ్చిన బస్సు ఎక్కకూడదా - అని తనను తానే తిట్టుకుంది సహజ.



## 4

విశాఖ నుంచి భీమ్లీ వెళ్ళే రోడ్డు ప్రకృతి ప్రజలకిచ్చిన వరం అనుకుంది సహజ భీమ్లీలో బస్సు దిగుతూ. ఆ బస్సులో సగానికి పైగా సహజ ఆఫీసులో పనిచేసే వాళ్ళే. పదిహేను మంది మగవాళ్ళూ, సహజతో కలిసి అయిదుగురు ఆడవాళ్ళూ ఆ ఆదివారం భీమ్లీలో బస్సు దిగారు.

"మంచి ప్లేసు చూడాలండీ ముందు. గెస్టు హావుసులుంటాయా ఇక్కడ?" ఎందుకో హడావుడిపడుతున్నాడు వెంకట్రావు.

"ఒకవేళ వున్నా మనకిపుడు దొరకవు లెండి! ఇవాళ చల్లగావుంది. ఇదిగో... ఇక్కడ బాగానే వుంది. ఇక్కడే వేద్దాం మన మఠం'' సముద్రానికి అల్లంత దూరానే ఆగారు వాళ్లు.

''మఠమేమిటి?'' అంది సహజ ఆశ్చర్యంగా.

''మీరొచ్చాక ఇదే మొదటిసారా పిక్నిక్ రావటం'' అంది ప్రసన్న.

"ఔనండీ" అంది సహజ.

''అయితే కాసేపట్లో మఠ ప్రవేశం చేస్తారుగా ... తెలుస్తుందిలెండి" అంది లక్ష్మీకుమారి.

'ముందు ఆ టిఫిన్లు తియ్యండిబాబూ ఆకలేస్తోంద'ని గోల మొదలెట్టారందరూ అందరూ శుభ్రంగా తిన్నారు. మగాళ్ళు సిగరెట్లు వెలిగించారు.

"ఊఁ....ఇక తియ్యండి. దుప్పట్లు తెచ్చారా? ఎవరి దగ్గరున్నాయి?" వెంకట్రావు హడావుడి. గబగబా రెండు పెద్ద దుప్పట్లు పరిచారు. రెండు గ్రూపులై పదిమందొక దుప్పటి చుట్టూ, తొమ్మిదిమంది ఇంకో దుప్పటి చుట్టూ కూర్చున్నారు.సహజను 'మీరు ఇటురండి' అని ఆహ్వానించారు తొమ్మిదిమందున్న గ్రూపువాళ్ళు. నలుగురాడవాళ్ళలో ఇద్దరొక గ్రూపులో, ఇద్దరింకో గ్రూపులో చేరారు. సహజ విస్తుపోయి చూస్తుంటే-

"ఏంటలా చూస్తున్నారు? వచ్చి కూచోండి" అంటూ పేక కట్టలు పైకి తీశాడు కృష్ణమూర్తి.

"ఇప్పుడు పేకాడతారా?" అంది సహజ నమ్మలేనట్లుగా.

"ఊఁ....మరేం చేస్తామనుకున్నారు?"

"సముద్రం దగ్గరికి వెళ్లొద్దూ?"

"వెళ్ళొచ్చులెండి! సాయంత్రందాకా వుంటాంగా. వెళ్ళేప్పుడు సముద్రం దగ్గరికి వెళితే చీరలు తడిసినా, మనం తడిసినా ఫరవాలేదు.ఇప్పుడే వెళితేచికాకు" అంది లక్ష్మీకుమారి. మిగిలినవాళ్లు సహజ నసలు పట్టించుకోకుండా ఏ వరసలో కూచోవాలో నిర్ణయించుకోటానికి పేక ముక్కలు తీస్తున్నారు. 'నాది పెద్ద ముక్క - నాది చిన్నముక్క' అని హడావుడి పడుతున్నారు.

సహజకు అసహ్యమనిపించింది.

"నాకు పేకాట రాదు. వచ్చినా సముద్రపొడ్డుకి వచ్చి పేకాడను. నేను సముద్రం దగ్గరకు వెళ్తున్నాను" అని వెనక్కి తిరిగింది.

"భీమ్లీ సముద్రంతో జాగ్రత్తగా వుండాలండోయ్! ప్రమాదాలు జరుగుతాయి. జాగ్రత్త" అని అరిచాడొకాయన.

సహజ చకచకా నడిచింది. సముద్రాన్ని చూస్తుంటే ఆనందం మనసులో మొలకెత్తి క్రమక్రమంగా అలలతో పాటే పెరిగింది.

భీమ్లీ సముద్రానికీ, వైజాగ్ సముద్రానికీ పోలికే లేదే-అనుకుంది.

సముద్రానికి కాస్త దూరంలోవున్న రాళ్ళగుట్ట మీదికెక్కి నుంచుని చూస్తోంది.

చలంగారి 'జీవితాదర్శం' జ్ఞాపకం వచ్చి వళ్ళంతా పులకరించింది.ఆ పుస్తకం తెచ్చుకున్నా బాగుండేదే అనుకుంది. వీళ్ళ పేకాటపిచ్చి గురించి ముందే తెలిసుంటే పుస్తకాలు తెచ్చుకోవాలనే ఆలోచన వచ్చేది అనుకుంది.

అలా అనుకుంటుండగానే "సహజ గారూ...గుర్తున్నానా?" అంటూ ప్రసాద్ పక్కనే వచ్చి నుంచున్నాడు.

"అరే...మీరా? పోన్లెండి. వైజాగ్‌లో కాకపోయినా భీమ్లీలోనైనాకలుసుకున్నాం. ఎంతసేపయింది మీరు వచ్చి?" అంది ఆశ్చర్యంగా.

"ఇప్పుడే....బస్ దిగి సరాసరి ఈ గుట్టదగ్గరికే వస్తున్నాను"

"ఒక్కరే వచ్చారా?" అంది సహజ ఆశ్చర్యంగా.

"ఔను....మీరు?"

"మా ఆఫీస్‌వాళ్ళతో పిక్నిక్‌కని వచ్చాను. సరేగానీ ... ఒక్కరే ఎలా వచ్చారండీ! అసలలా ఒక్కరే వస్తారా ఎవరైనా?"సహజ మళ్లీ ఆశ్చర్యపోయింది.

"మీ ఆఫీసు వాళ్ళంతా ఏరీ?"

సహజ నుదురు కొట్టుకుంది. "వాళ్ళు సముద్రానికంత దూరానే ఆగి పేకాడుతున్నారు. సముద్రం దగ్గర, అందులో ఇలాంటి సముద్రం దగ్గిర ఆ అందాలకు అంధులై పేకాడుతున్నారండీ మా ఆఫీసువాళ్ళు. ఒక్కళ్ళకీ సముద్రం మీద ఆసక్తిలేదు. నాకు చీదరపుట్టి ఇటొచ్చి కూచున్నాను. వాళ్ళకు దూరంగా వుండటమే మంచిది. లేకపోతే సముద్రపొడ్డునకూడా చెత్త విషయాలన్నీ మాట్లాడతారు"

సహజ కోపంచూసి ప్రసాద్ నవ్వాడు.

"చూశారా..మీరంతమందితో వచ్చినా ఒంటరిగా ఈ రాళ్ళమీద కూచోవాల్సి వచ్చింది. నేను ముందే జాగ్రత్తపడి ఒక్కడినే వచ్చాను. మనలాంటివాళ్లు కానపుడు మనం వందమందితో కలిసి వున్నా ఒంటరి వాళ్ళమేనండీ"

"నిజమేనండీ"

"ఊఁ....ఏం చేస్తున్నారూ? మళ్ళీ ఏ మీటింగులకన్నా వెళ్ళారా?" అనడిగాడు ప్రసాద్.

"లేదండీ! అబ్బా..ఆ అల చూడండి. ఎంతెత్తున లేస్తోందో. అమ్మో....మనదాకా వస్తుందనుకుంటానండి" సహజ రెండడుగులు వెనక్కి వేసింది. ఆ అల సహజ పాదాలు తడిపి వెళ్ళింది.

"ఇక్కడిదాకా అలలొస్తాయనుకోలేదండీ! కాసేపుండి ఇంకా ముందుకి వెళదామనుకున్నాను. రాను రాను అలలు బాగా పెరుగుతున్నాయి'' అంది సహజ చుట్టూ కలయజూస్తూ.

"మీరు భీమ్లీ రావటం ఇదే మొదటి సారా?"

"ఔనండి''





"అందుకే ఇంత నిశ్చింతగా ఈ రాళ్ళమీద నుంచుని ఇంకా ముందుకి పోదామని ఆలోచించారు. ఇంకాసేపుంటే సముద్రం మీ వెనక్కి కూడా వస్తుంది. ఈ రాళ్ళు కనబడవు"

"నిజంగానా?" అని సహజ అంటుండగానే పెద్ద అలొకటి వచ్చి సహజను కొట్టేసింది.

ఆ విసురుకి సహజ భయపడి పెద్దగా అరిచింది. ప్రసాద్ సహజ చెయ్యి పట్టుకుని రాళ్ళమీదనుంచి ఒడ్డుకి నడిపించాడు. సహజ పూర్తిగా తడిసిపోయింది. క్షణక్షణానికీ అలలు ముందుకొచ్చేస్తున్నాయి.

"ఈ అలలు నామీద పగబట్టినట్లున్నాయండీ'' అంది సహజ వెనక్కి వెనక్కి జరుగుతూ. చుట్టూ నీళ్ళు. నీళ్ల పెద్ద పెద్ద అలలు. సహజకు ఊపిరాడనట్లనిపించింది.

"భీమ్లీ సముద్రం ఎంత ఎంత.... ఏమనాలో తెలియటంలేదండీ! చూస్తుంటే భయంగా ఆశ్చర్యంగా సంతోషంగా... ఇదేమి సముద్రమండీ! ఎప్పుడూ ఇంతేనా?"

ప్రసాద్ నవ్వాడు.

"మీరిక భీమ్లీ తరచూ వస్తారు చూడండి."

చిన్నప్పుడెప్పుడో ఓ కవిత చదివానండి. ఎవరు రాశారో ఏమీ గుర్తు లావటంలేదుగానీ నాలుగు పదాలు గుర్తొస్తున్నాయి–ఈ సముద్రాన్ని చూస్తుంటే–

'ఏది ఈస్టు ఏది వెస్టు
ఇది నురగల ఫారెస్టు'

అని. నిజంగా ఇది నురగల ఫారెస్టే నండీ. అద్భుతంగావుంది"

సహజ పైమరపూ,భావుకతా ప్రసాద్‌కి



ఎంతో ముచ్చటేశాయి.

మూడు గంటలపాటు సముద్రంతో ఆడిఆడి అలసిపోయారిద్దరూ.

"కాసేపు కూచుందామండీ" అంది సహజ. ఇద్దరూ కాస్త దూరంగా నడిచి ఇసుకలో కూచున్నారు.

"ఇప్పుడు ముందు మీ అడ్రసు చెప్పండి. మళ్ళీ బస్సొచ్చిందంటే ఎక్కి వెళ్ళిపోతారు" అన్నాడు ప్రసాద్.

సహజ నవ్వింది.

"నాకూ తర్వాత చాలా అనిపించిందండీ...కనీసం మీ అడ్రసన్నా అడగలేదే, మళ్ళీ మిమ్మల్ని కలవటం ఎట్లాగా అని" అంది సహజ.

"నిజంగానన్ను కలవాలనుకున్నారా?'' అన్నాడు ప్రసాద్ సంతోషంగా.

"నిజంగా. మా ఇల్లు లేడీస్ హాస్టలు పక్కల్లే. ఆ ఇల్లంతా మాది కాదులెండి! అందులో ఓ గది"

"సముద్రం పక్కనే గది సంపాదించారే"

"ఔను. మీరు తప్పకుండా మా ఇంటికి రండి. ఆరోజు మీరన్నారే... స్వాతంత్ర్యోద్యమంలో స్త్రీల గురించి తెలుసుకోవాలనిపించిందని. ఏమన్నా తెలుసుకున్నారా?"

"లేదండీ! కొన్ని పుస్తకాలయితే సంపాదించాను. అవి చదివితే ఏమన్నా తెలుస్తుందేమో. నాకు చాలా విషయాల గురించి ప్రశ్నలూ, సందేహాలూ వస్తుంటాయండి. ఎవరన్నా నా సందేహాలు తీర్చేవారుంటే బాగుండుననిపిస్తుంది. పెద్దవాళ్ళెవరి దగ్గరకన్నా వెళదామంటే వాళ్లు మనల్ని సీరియస్‌గాపట్టించుకోరేమో అనిపిస్తుంది. పుస్తకాలు చదవటం, ఏ మీటింగులకన్నా వెళ్ళటం ఇవే నాకు చేతనైన పనులు. వీటితో సందేహాలు తీరక సతమతమవుతుంటాను"

సహజకు ప్రసాద్ చాలా నచ్చాడు. ఇతనితో స్నేహం చెయ్యాలి అనుకుంది.

"మీరు సాహిత్యం బాగా చదువుతారా?"

"బాగా అంటే చెప్పలేనుగాని..చదువుతాను" మాటల్లో కాలం ఎలా గడిచిందో తెలియలేదిద్దరికీ. పొట్టలో ఆకలి బయల్దేరి టైము చూసుకుంటే రెండు.

"ఆకలేస్తోందండీ" అంటూ లేచింది సహజ.

"మీరు భోజనం ఎక్కడ చేస్తారు? మేం భోజనాలు తెచ్చుకున్నాం"

"నేను ఊళ్ళోకెళ్లి ఏ హోటల్లోనో తింటాలెండి" అన్నాడు ప్రసాద్.

"నేనూ మావాళ్ళతో చెప్పి మీతోనే వస్తా...పదండి" అంది సహజ.

"ఎందుకూ? మంచి భోజనం తెచ్చుకుని వుంటారు. నాతోపాటు ఆ చెత్త తినటం దేనికి? మీరు వెళ్ళి మీవాళ్ళతో తినండి. నేను భోజనంచేసి మళ్ళీ మీ దగ్గరకువస్తాను"

"కాదులెండి! ఆ గంటకూడా మీతోనే గడపొచ్చుగదా. ముందు మావాళ్ళ దగ్గరకి వెళ్ళి చెప్పి వెళదాం. లేకపోతే నేనీ సముద్రంలో మునిగిపోయానని కంగారు పడతారు"

ప్రసాద్‌కి సహజ నిస్సంకోచంగా తన ఫీలింగ్సు చెప్పటం బాగా నచ్చింది. మామూలుగా ఆడవాళ్ళు మగవాళ్ళతో ఇట్లా మాట్లాడరు. సహజ మామూలు అమ్మాయైతే ఆమెకు తనతోనే వుండాలని కోరికగా వున్నా ఆ విషయం పైకి చెప్పదు, తనతో కలిసి భోజనం చేస్తాననదు. సహజ మామూలు అమ్మాయి




కాదు-అనుకున్నాడు ప్రసాద్.

వీళ్ళిద్దరూ వెళ్ళేసరికి అప్పుడే పేకాట ఎత్తేశారు.

"రండి రండి ... మీరేమయ్యారా అని భయపడుతున్నాం" అంటూ ఆహ్వానించారు.

"ఈయన నా ఫ్రెండు...ప్రసాద్‌గారు. ఆంధ్రాబ్యాంకులో పనిచేస్తున్నారు" అని పరిచయంచేసింది సహజ.

"మేమిద్దరం బైటికెళ్ళి భోజనం చేస్తాం. ఈయన ఒక్కరే వచ్చారు" అంది సహజ.

"ఎందుకూ...ఇద్దరూఇక్కడే భోజనం చెయ్యండి. చాలావుంది...సరిపోతుంది" అన్నారు మిగిలినవాళ్ళు. ప్రసాద్ మొహమాట పడ్డాడుగానీ అందరూ ప్రోత్సహించి భోజనం పెట్టారు.

చేతులు కడుక్కుంటూనే మళ్ళీ పేకాటకు సిద్ధమవుతున్న వాళ్ళనుచూసి...

"మళ్ళీ ఆడతారా?" అంది సహజ ఆశ్చర్యంగా.

"మీరు మళ్ళీ సముద్రం దగ్గరకెళతారా?" ఇంకా ఆశ్చర్యంగా అడిగారు వారిలో ఇద్దరు ముగ్గురు.

"ఆ! వెళతాను. మీరు బస్సెన్నింటికి ఎక్కుతారో చెబితే ఆ సమయానికి వస్తాను" అంది సహజ.

ప్రసాద్ కూడా బయల్దేరాడు.

"మేం అయిదింటికల్లా సముద్రం దగ్గరకొస్తాం. ఆరింటిదాకా అక్కడుండి బస్సెక్కుదాం" అన్నాడు కృష్ణమూర్తి. అందరూ అంతేనని ఆమోదం ప్రకటించారు.

సహజ, ప్రసాదూ సముద్రంకేసి నడిచారు.

"ఈ సముద్ర పొడ్డున ఇల్లు కట్టుకుని ఇక్కడే వుండిపోవాలనిపిస్తోందండీ" అంది సహజ.

"మన కెన్నో అనిపిస్తాయి గానీ అవన్నీ చెయ్యలేమండి. కుదరదు. మనం ఇప్పుడిలా అనుకున్నామా. మళ్ళీ ఛీస్లీ వచ్చేసరికి ఆరునెల్లు పడుతుంది. అసలు రాకనూ పోవచ్చు. జీవితం కుదరనివ్వదు"

"నిజమే" అంది సహజ.

"ఇక్కడి ఇతర చోట్లన్నీ కూడా తిరగాలండీ" అంది సహజ.

"ఈసారి వచ్చినపుడు వాటన్నిటినీ చూద్దాంలెండి. ఇప్పుడు టైము చాలదు. మీరేం అనుకోకపోతే నేనో పాటపాడతా"

"మీకు పాటలొచ్చా" సహజ ఆశ్చర్యపోయింది.

"రాకుండా ఎలా పాడతానండీ?"

"పాడండి...పాడండి"

"ఏం పాడమంటారు?"

"మీ ఇష్టం. మీకేవి బాగా వస్తే అవి"

"మీకు హిందీ పాటలు అర్థమవుతాయా?"

"ఊహూఁ...నాకు హిందీ అసలురాదు"

"అయితే లాభంలేదు. నాకు తెలుగు పాటలు రావు. సరే! ఏం చేస్తారు వినండి"

ప్రసాద్ పాడాడు. సహజ అర్థం తెలియకపోయినా అతని కంఠాన్ని మెచ్చుకుంది.

"చాలా మంచి గొంతండీ. మీరు తెలుగు పాటలు నేర్చుకోవాలి"

"మీ కోసం నేర్చుకుంటాగాని, ఇంకో హిందీ పాట పాడనా?"

"పాడండి" అంది.

"ఇది చాలా మంచి పాటండీ. అర్థం చెప్పనా?"

పాటలతో మళ్ళీ కాలం పరిగెత్తింది.

ఆరవుతుండగా సహజను వెతు

క్కంటూ ఆఫీసువాళ్ళొచ్చారు. అందరూ బస్సెక్కి వైజాగ్ చేరారు.

ఆ మర్నాడు సాయంత్రం ఆరింటికి ప్రసాద్ సహజ ఇంటికి వచ్చేసరికి ఆమె అతని కోసమే చూస్తోంది.

అలా రెండేళ్ళపాటు ప్రతి సాయంత్రమూ సహజ ప్రసాద్ కోసం, ప్రసాద్ సహజకోసం ఎదురుచూస్తూ, కలుస్తూ వున్నారు.

రెండేళ్ళ తర్వాత పెళ్ళిచేసుకున్నారు.

పెళ్ళయిన తర్వాత ఒక చిన్న గొడవ తప్ప ప్రసాద్, సహజల స్నేహంలో ఏమీ మార్పురాలేదు. ఆ గొడవ కూడా పాపం ప్రసాద్ ఆదర్శభర్తగా వుండాలను కోవటం వల్లే వచ్చింది. ఆ గొడవ జరిగిన తర్వాతే సహజ ప్రసాద్‌ని 'మంచాడు మంచాడు' అని ఏడిపిస్తుంటుంది. ప్రసాద్‌కి మొదటి మూడునెల్లూ ఆదర్శ భర్తరికం నెరిపేసరికి ఎందుకో తెలియని అశాంతి పట్టుకుంది. తన అశాంతికి కారణం కూడా తెలియలేదేమో! ప్రసాద్‌కి ఆ బాధ దుర్భరమనిపించింది. ఈ ప్రపంచంలో తనకు కావాల్సిన అమ్మాయి సహజే- అందులో సందేహమేలేదు. మరెందుకీ అశాంతీ, అసంతృప్తీ అనుకున్నాడు. ఓరోజు ఒంటరిగా పార్కులో చెట్టునీడన కూచుని తన మూడునెల్ల సంసార జీవితాన్ని స్మరించుకున్నాడు.

సహజను తను ఎంతో ప్రేమగా చూసుకుంటున్నాడు. అన్ని విషయాల్లో ఆమెకు సహాయపడుతున్నాడు. పొద్దున్నే ఆమె గిన్నెలు తోమితే తాను కడుగుతాడు. ఆమె ఇల్లుచిమ్మితే తాను తడిగుడ్డతో తుడుస్తాడు. కూరలు తరిగిపెడతాడు. కలిసి వంట చేసుకుంటారు. బయవులైతే పనులన్నీ తనే చేస్తాడు. తను ముందు నిద్రలేస్తే టీపెట్టి సహజను లేపుతాడు. ఇలా ప్రతి పనిలో ఆమెకు సహాయంగా వుంటు న్నాడు. తాను పనిమీదో, స్నేహితుల దగ్గరకో వెళ్లాల్సి వస్తే సహజతో చెప్పి, ఆమెను ఆమె స్నేహితుల దగ్గరకు వెళ్ళమని సలహా ఇచ్చి వెళుతున్నాడు. సహజ పనిమీద బైటికి వెళితే పనంతా తనే చూసుకుంటున్నాడు. చుట్టుపక్కల చుట్టుపక్కలేమిటి ... ఈ ఊరంతటి లోనూ ఇట్లా భార్యతో ప్రేమగా వుంటోందీ, ఆమెకు సహాయపడుతోందీ తనేనని ప్రసాద్‌కి స్పష్టంగా తెలుసు.

'తను చాలా మంచివాడు ... కానీ ఏం లాభం?' అనుకున్నాడు ప్రసాద్.

ఒక్కసారి...ఒక్కసారంటే ఒక్కసారన్నా సహజ తన మంచితనాన్ని గుర్తించి 'నువ్వెంత మంచివాడివి ప్రసాద్' అనకూడదూ? ఆ ఒక్కమాట సహజ అనాలనీ, తన ఆదర్శ ప్రవర్తనను గుర్తించిన మాట సహజ నోటినుండి రావాలనీ ప్రసాద్ మూడు నెలలు ఎదురు చూశాడు. సహజ తన ప్రవర్తనను చాలా సహజంగా, లోకంలో అంతా ఇట్లాగే జరుగుతోందన్నట్లుగా అనుకుంటోందనీ, తన ప్రత్యేకతను గుర్తించటం లేదనీ, అందుకే తనకీ అశాంతనీ ప్రసాద్ గుర్తించాడు. ఇక ఆరోజుతో ఆ అశాంతి సంగతి తేల్చేయాలనుకున్నాడు.

సహజ ఏదో పుస్తకం చదువుకుంటోంది. "సహజా" అని ప్రారంభించబోయాడు. కాని సహజ గమనించలేదు.

"సహజా"

ఏమిటన్నట్లు చూసింది.

"నాగురించి నీ అభిప్రాయమేమిటి?"

సహజ బిత్తరపోయింది.

"అదేమిటి?" అంది అయోమయంగా.





ఆంధ్రుల ఆహ్లాద రచయిత

# మల్లాది వెంకటకృష్ణమూర్తి

సరికొత్త నవల

# సావిరహే

*(వెల 25 రూపాయలు)*

**20 జనవరి, 1986న విడుదలవుతోంది**

ఈ సరికొత్త తరహా టీనేజ్ లవ్‌స్టోరి ప్రేమికులనేగాక ఇతరులని కూడా సమానంగా ఆకర్షిస్తుంది.

—మీరు ప్రేమించే అమ్మాయి చేతిని ఆమెకి అభ్యంతరం లేకుండా కనీసం అయిదు నిమిషాలు ఎలా పట్టుకోగలగడం?

—నిముషానికి వేల వాహనాలు తిరిగే రద్దీ మెయిన్ రోడ్డుమీద ఏక్సిడెంట్ కాకుండా ఓ నిముషం సేపు పడుకుని పందెంలో ఎలా గెలవగలగడం?

—మీరు ప్రేమించే వ్యక్తికి ఆ సంగతి మృదువుగా ఎన్ని రకాలుగా చెప్పవచ్చు?

ఇలాంటి టీనేజ్ యువతీయువకులకి నచ్చే అనేక చిట్కాలతో వెలువడిన 'సావిరహే' చదివితే మీకు తెలుస్తుంది.

**శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్**

మ్యూజియం రోడ్డు,

గవర్నరుపేట, విజయవాడ–520 002

ఫోను : 63322

(తలక్రిందులుచేసి చదవండి)

"ఏమిటో నువ్వే చెప్పాలి! నాలో ఏ ప్రత్యేకతా, ఏ గొప్పా కనిపించడం లేదూ?" దూకుడుగా అడిగాడు.

"వెళ్లేప్పుడు మామూలుగానే వున్నావుగా. ఇంతలో ఏమయింది? ఓ....మొన్న రాసిన కవిత పత్రికలో వచ్చింది... అంతేనా?" అంది నవ్వుతూ.

ప్రసాద్ ఇక కోపం, దుఃఖం పట్టలేక పోయాడు. మళ్ళీ చెప్పులేసుకుని విసురుగా గది బైటకునడిచాడు. సహజ పరిగెత్తుకు వెళ్ళి చేయి పట్టుకుని లాక్కొచ్చి మంచంమీద కూర్చోబెట్టింది. అతని భుజాలమీద మోచేతులానించి, "ఏమిటి సంగతి?" అంది తమాషాగా కళ్ళెగరేస్తూ.

ప్రసాద్ ఆవేశం రవ్వంతయినా తగ్గలేదు.

"సహజా...నీతో నేనెంత మంచిగా వుంటున్నాను. నీకెంత సహాయపడుతున్నాను. భర్తగా అధికారం చలాయించకుండా ఎంత ప్రేమగా ఉంటున్నాను. నా మంచితనం ఏనాడైనా గుర్తించావా? ఒక్కసారైనా నువ్వెంత మంచివాడివనే మాట అన్నావా? నేనంటే నీకు లక్ష్యం వుందీ! నన్నో చేతగాని వెధవకింద జమ కట్టావా-అనే అనుమానం నన్ను పీక్కుతింటోంది. సాజీ...నిజంగా నా మంచితనం నీకర్థం కాలేదా? అర్థమయ్యీ పట్టించుకోవా?"

మనసులోదంతా కక్కేసి ఆవేశం తగ్గించుకుని స్థిమితపడ్డాడు ప్రసాద్.

సహజ కళ్లు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. తర్వాత చిరునవ్వుతో పెదవులు విచ్చుకున్నాయి. ప్రసాద్ నెత్తిన ఒకటి కొట్టి పక్కనే పడుకుని ఆలోచనగా ప్రసాద్ వంక చూసింది. ప్రసాద్ అసహనంగా కదిలాడు. పది నిముషాలలాగే పడుకుంది సహజ.

"ప్రసాద్...నేనెవరిని?"

సహజ ప్రశ్నకు మళ్ళీ కోపం వచ్చింది ప్రసాద్‌కి.

"సహజవి"

"సహజనే. సరే...నీకేమవుతాను?"

"భార్యవి"

"మరి అందరూ భార్యల్ని నీలాగా చూడటంలేదేం? నేను నీ భార్యనే అయితే నువ్వందరిలాగే చూడొచ్చుగా"

"వాళ్ళంతా వెధవలు... నేను అటువంటివాడినికాదు. నీ భార్యనే అయితే అంటావేమిటి...నువ్వు నా భార్యవి కాక మరెవరివి?"

"నేనిన్నాళ్ళూ నీ భార్యననుకోలేదు ప్రసాద్. నీ స్నేహితురాలిననుకున్నాను. నీకు అత్యంతాప్తురాలైన స్నేహితురాలిననుకున్నాను. స్నేహితులతో ప్రవర్తించినట్లే ప్రవర్తిస్తున్నావనుకున్నానేగాని నువ్వు ప్రత్యేకంగా నన్ను మంచిగా, దయగా చూస్తూ నా కృతజ్ఞతను ఆశిస్తున్నావనుకోలేదు. ఎంత పొరపాటు చేశాను ఎంత భ్రమలో వున్నాను"

"సహజా" ప్రసాద్ మెదడులో ఏదో మెరిసింది. సహజ అతన్ని గమనించలేదు.

"నేను ఆడదాన్ని. ఏ హక్కులూ లేనిదాన్ని.బానిసను. నువ్వు మంచివాడివి.. నీ బానిసకు అన్ని సహాయాలూ చేశావు. దయగా చూశావు. అయినా ఈ బానిస తన యజమాని మంచితనాన్ని గుర్తించలేదు"

"సాజీ సాజీ...ఆపు"

"ఎందుకు ప్రసాద్... నా స్థితి నాకు అర్థం కానివ్వు. నీ సంగతి నీకు తెలుసు. లోకంలో మగవాళ్లు దుర్మార్గంగా వుంటు





న్నారనీ, నువ్వు మంచివాడివనీ నీకు తెలుసు. కానీ నా సంగతేమిటి? నా స్థితి ఏమిటి? నేను చాలా భ్రమల్లో వున్నాను. స్త్రీ పురుషులు సమానులేనన్నట్లు ప్రవర్తించాను. నేను ఏ పురుషుడికంటే తక్కువదాన్ననుకోలేదు. ఏ పురుషుడైనా నాపట్ల దయగావుంటేనే తప్ప నా సమానత్వం సాధ్యంకాదనేవిషయం నాకివాళేతెలిసింది. ఔను...సమాజంలో స్త్రీలంతా బానిసలుగా వున్నప్పుడు నాలాంటి ఒకరిద్దరు-మేం స్వేచ్ఛగావున్నాం. పురుషులతో సమానులం అనుకోవటం ఎంత వెర్రితనం. ఈ బానిసత్వం పోవాలి. అసలు బానిసలం అనే స్పృహ స్త్రీలకు రావాలి. ప్రసాద్... ఇవాళ నాకు గొప్ప కనువిప్పు కలిగింది" సహజ మాట్లాడటం ఆపేసరికి ప్రసాద్ ముఖంలో నెత్తురుచుక్కలేదు.

ఆ తర్వాత రెండు రోజులకుగాని ఇద్దరిమధ్యా ఆ విషయం గురించి స్పష్టత రాలేదు. తర్వాత ఇద్దరూ తమ తమ తప్పుల్ని గుర్తించారు.

ఎక్కువమంది మగవాళ్లు భార్యలతో పంచిగా వుండకపోవటంవల్ల తన ప్రవర్తన గొప్పగా అనిపించిందనీ,నిజానికితను మామూలుగా ఒక మనిషి ప్రవర్తించాల్సినట్లే ప్రవర్తిస్తున్నాననీ ప్రసాద్ అంగీకరించాడు. ఇంటిపని చెయ్యటం సహజకు సహాయపడటంగా అనుకోవటం తప్పనీ ఆ పని తనది కూడాననీ ఒప్పుకున్నాడు.

ఏ విషయాన్నయినా రెలెటివ్‌గా చూడాలనే సంగతి మర్చిపోయి ప్రసాద్‌ని అపార్థం చేసుకున్నానని సహజ అంగీకరించింది.

'నేను మంచాడిని' అంటూ కోపంగా వచ్చిన ప్రసాద్ ఆతర్వాత ఎలా వికృతముఖం పెట్టాడో గుర్తొచ్చేసరికి సహజకు నవ్వూ, ప్రసాద్‌పై ప్రేమా ఒక్కసారే ముంచుకువచ్చాయి. నవ్వుకుంటూనే నిద్రలోకి జారిపోయింది.




ఆ ఆదివారం అమ్మ దగ్గరికెళుతున్నానని రామారావుతో చెప్పి ముందు సహజా వాళ్లింటికొచ్చింది శారద. పదిరోజుల్నించీ సహజావాళ్లింటికి వెళ్ళాలని తనలో తనే మథనపడింది శారద.

సహజ దగ్గరకు వెళ్లటం మామూలు జీవితానికి పెద్ద రిలీఫ్. ఉష దగ్గరగానీ, రమ దగ్గరగానీ దొరకని ఆనందం సహజ స్నేహంలో దొరుకుతుంది శారదకు.కానీ సహజ తన విషయాలడిగితే, బొమ్మలు వేయటంలేదని తిడితే? మళ్లీ వెయ్యరాదా అని అడిగితే? - ఆ విషయమే శారదను భయపెడుతోంది. సహజ ఇంతవరకూ శారద నిటువంటి ప్రశ్నలేవీ అడగకపోయినా ఆమె ధోరణి శారదకి అర్థమవుతూనేవుంది. అయినా ఆ ఆదివారం సహజ ఇంటికి వెళ్ళకుండా వుండలేకపోయింది శారద.

శారదను చూస్తూనే సహజ ముఖం వికసించింది. కుశల ప్రశ్నలూ, టీ తాగటమూ అయ్యాక సహజ శారద భయపడే ప్రశ్న అడగనే అడిగింది.

"నువ్వు బొమ్మలు వెయ్యటం పూర్తిగా మానేసినట్లేనా శారదా"

"నిజంగానే మానేశానే. చిత్ర పుట్టిన తర్వాత ఒకసారి ప్రయత్నించా. అంతే... మళ్ళీ ఇక ఆ ప్రయత్నం చెయ్యలేదు"

శారదకు ఈ ప్రస్తావన బాధగా వుంది గానీ, ఈ విషయం గురించి మాట్లాడటం ఇష్టంగా కూడా వుంది. బహుశా తన కళ గురించి సహజలా తరచి తరచి అడిగేవారు లేకపోవటం శారదను చాలా బాధించి వుంటుంది. తనకున్న శక్తి ఈనాడు మరుగున పడి పోయినా ఆ ప్రస్తావన శారదకు ఇష్టం గానూ వుంది. బాధగానూ వుంది.

సహజకు శారద నిర్లిప్తత మాత్రమే కనిపించి కోపం వచ్చింది. తన కోపాన్ని అదుపులో పెట్టుకోటానికి ప్రయత్నిస్తూ సహజ అన్నది

"నీకు బొమ్మలు వేయాలనిపించ కుండా ఎలా వుంటోందో నాకు అర్థం కావటం లేదే? బాల మురళి పాడుతుంటే, వినే రమకు పాలు విరుగు తాయని ఎలా జ్ఞాపకం వచ్చిందో... నువ్వు బొమ్మలు వెయ్యకుండా ఎలా వుంటున్నావో, ఉష ఏమీ పట్టనట్టు ఆ సినిమా పిచ్చాడిని ఎలా భరిస్తోందో.... ఇవేవీ నాకు అర్థం కావు, మీ ముగ్గురనే కాదు...ఆడవాళ్ళం ఎందు కిలా మారిపోతాం? పెళ్ళికి ముందు మన కున్న ఆసక్తులూ, అ భి రు చు లూ పెళ్ళయ్యాక సర్వ నాశనమవుతాయి ఎందుకు? మనకంటూ ఒక జీవితం వుండదెందుకు? భర్త జీవితం పిల్లల జీవితం మనం పంచుకోవటమే గాని మన జీవితం పట్ల వాళ్ళకాసక్తి ఎందుకుండదు? వాళ్ళని మనమెట్లా సహిస్తున్నాం? ఈ వంటిళ్ళకు ఎందుకిలా అంకితమై పోతు న్నాం...

"మా ఆఫీసులో పనిచేసే ఆడవాళ్ళను చూస్తుంటాను గదా! యూనియన్ మీటిం గులకి ఒక్కనాడూ వుండరు. ఇల్లు. ఇల్లు ఇల్లు...వాళ్ళ ధ్యాసంతా అక్కడే. నిజమే. వాళ్ళు లేకపోతే ఆ ఇళ్ళు నడవవు. కానీ ఆ ఇళ్ళు నడవటం వాళ్ళ జీవితాలకంటే ముఖ్యమా? చిత్రమేమిటంటే ఆ ఇళ్ళుతమని మింగేస్తున్నాయని ఆడవాళ్ళకు తెలియదు. తెలిసిన రోజువాళ్ళాఇళ్ళల్లోఒక్కనిమిషం వుండరు. నువ్వు బొమ్మలు వేస్తే ఏమవు తుంది శారదా?"

"చెప్పానుగా సాజీ! ఆయనకు ఇష్టం లేదు. పెళ్ళయిన కొత్తలో నేవేసిన బొమ్మలన్నీ చూపిస్తే ఆయన మొహాన సంతోషంగానీ, మెచ్చుకోలు గానీ లేదు. మహా నిర్లిప్తంగా చూసి అవతల పెట్టే శారు. తర్వాత తర్వాత విసుక్కోవటం, వెక్కిరించటం కోపగించుకోవటం మొద లయింది. ఒక్కసారన్నా ఆయన కొను క్కురాకుండానే బొమ్మలు వేసుకునే కాగితాలు, పెన్సిళ్ళూ, రంగులూ, కుంచెలూ అనవసరమైన వస్తువులుగా, వాటికోసం ఖర్చు చేసే డబ్బు వృథా అన్నట్టుగా తీర్మానించారు. నాన్న వున్నంతకాలం నాకు దిగులనిపించలేదు. నాన్న చనిపోయాక నాకు ఉత్సాహ మంతా పోయింది. ఇంట్లో ఆయన పద్ధ తుల్లో ఏ కొంచెం అటూ ఇటూ అయినా నా బొమ్మల మీద విరుచుకుపడేవారు. నాకు క్రమ క్రమంగా ఆసక్తి చచ్చి పోయింది, ఇప్పుడు బొమ్మలు వెయ్య లేక పోతున్నానే అనే దిగులు తప్ప వేసి తీరాలనే కోరిక మిగలకుండా పోయింది. ఒకసారి చాలా పెద్ద గొడవే అయింది. బొమ్మలే కావాలనుకుంటే తనకూ, నాకూ సంబంధం వుండదన్నంత తీవ్రంగా మాట్లాడారు. ఇక అప్పట్నించీ నేను



కుంచె ముట్టుకోలేదు"

"నిన్ను చూస్తుంటే చాలా కోపంగా వుందే! నాకు బొమ్మలే కావాలి. నువ్వు అక్కర్లేదు అంటే ఏం జరిగేది?" సహజ అడక్కుండా వుండలేకపోయింది.

"బాగుందే నువ్వు చెప్పేది! ఆయన నిజంగానే అన్నంతపనీ చేస్తే..."

"చేస్తే ఏమవుతావు? నువ్వు హాయిగా వుంటావు. ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోతుందా?"

"ఉద్యోగం దొరికితే చాలా?"

"ఊఁ...చాలక"

"నీకు తెలియదులే సాజీ! అసలు పెళ్ళవకుండానే ఉండాలిగానీ ఒకసారి పెళ్ళయిందంటే నువ్వు చెప్పేవన్నీ కుదరని విషయాలు. అతన్నించి విడిపోయి అమ్మావాళ్ళను బాధపెట్టి పిల్లలకు లేనిపోని అశాంతి కలిగించి... ఏమిటి పీటివల్ల లాభం? నేను చక్కని పెయింటింగులు వేస్తాను... అంతేనా? వాటివల్ల ఏమిటి ప్రయోజనం.. ఎవర్ని వుద్ధరిస్తాయవి? ఇంతమందిని బాధపెట్టి నేను నానాకష్టాలూపడి బొమ్మలు వేసీ వేసీ ఏంచెయ్యాను వాటిని? కొన్నాళ్ళకు ఆశక్తీ, ఆసక్తీ పోతే... కనీసం తగ్గితే అప్పుడేం చెయ్యాను. కనీసం పిల్లలు లేకుండా వుంటే అదో రకం. ఇపుడు వాళ్ళ భవిష్యత్తును రిస్క్ చెయ్యలేను...

"నీకో సంగతి చెబుతాను....

"ఒకసారి నేను ఒక చిత్ర కళా ప్రదర్శనకు వెళ్ళాను. ఆ చిత్రకారుడు ఈయన పై ఆఫీసరు. ఆ ఆఫీసరు మెప్పుకోసం ఈయన ఆఫీసరు ఆహ్వానించగానే 'మా ఆవిడకూ బొమ్మలు వేయటం వచ్చు. తీసుకొస్తా' అని చెప్పి నన్ను తీసుకెళ్లారు.

ఆయన చాలా మంచి చిత్రకారుడు. చాలా మంచి పెయింటింగులు అయిదారున్నాయి. వాటిని చూస్తుంటే ఒక వంక ఆనందం, ఇంకోవైపు బాధ. ఇట్లా చిత్ర ప్రదర్శన ఏర్పాటు చేయగల శక్తీ, కళా నాకూ వున్నాయి. చెయ్యగలిగితే? కానీ వీలు కాదు... కుదరదు.

"ఆ ఆఫీసర్నీ, ఆయన భార్యనూ నాకు పరిచయం చేశారు. ఆ ఆఫీసరుగారి భార్య కలుపుగోలు మనిషి. 'మీవారి చిత్రాలు చాలా బాగున్నాయండీ' అంటే—

'బాగుండక ఏం చేస్తాయండీ! ప్రాణాలన్నీ అందులోనే పెట్టివేస్తుంటే. ఆయనకు బొమ్మ వేసే మూడ్ వచ్చి ఆ బొమ్మ పూర్తి చేసేదాకా ఆయన ప్రాణాలూ, నా ప్రాణాలూ కూడా దాని మీదనే. ఆయన గదిలో కావాల్సినవన్నీ అమర్చాలి. అరుపులూ చప్పుళ్ళూ, లేకుండా చూడాలి. ఎవరూ ఆయన్ని పలకరించ కుండా కాపలాకాయాలి. అర్ధరాత్రి దాకా టీలు సప్లయిచెయ్యాలి. నానా పాట్లూ పడితేగాని చిత్రం పూర్తవదు. పూర్తయ్యాక మాత్రం ఆ చిత్రాన్నీ, ఆయన కళ్ళల్లో తృప్తినీ చూస్తే ఇన్నాళ్ళ శ్రమ ఫలించిందనిపిస్తుంది' అంది ఆవిడ సంతోషంగా..."

"ఔనే... అది ఆవిడ విధి. భార్యా ధర్మం. దానినామె సక్రమంగా నిర్వహించి సంతోషిస్తోంది. భార్యకు సహకరించి ఆమెలోని కళను పైకి తీసుకురావటం భర్త ధర్మంగా ఏ శాస్త్రాలూ పురాణాలూ చెప్పలేదు" సహజ పళ్ళు నూరుతూ అంది.

"ఔనే. నేనూ అలాగే అనుకున్నాను. నా భర్త ప్రోత్సాహం వుంటే నేనూ ఇలాంటి ప్రదర్శన ఏర్పాటు చెయ్యగలిగేదాన్నికదా అని బాధపడ్డాను. ఆ మర్నాడు ఆ ఆఫీసర్ని మా ఇంటికి భోజనానికి పిలిచారీయన. ఆయన నేనేమన్నా చిత్రాలు గీస్తున్నానా అని అడిగాడు. 'పెళ్ళయ్యాకా, పిల్లలు పుట్టాకా నాకా ఆసక్తి పోయిందండీ. మొన్న మీ చిత్రాలు చూస్తుంటే గిల్టీగా అనిపించింది — కళను మూలపడేశానే అని' అన్నాను. అదంతా నా తప్పే అయినట్లుగా, అప్పుడాయన మాట్లాడిన మాటలు నాకు సరిగా అర్థం కాలేదుగానీ నా దిగులు తగ్గించాయి సాజీ ... ఆయన గొడవంతా ఆయన చెప్పుకున్నాడు. ఆయనంటాడూ కళను ప్రోత్సహించే వాళ్లేరు. నేను పదేళ్ళనుంచీ చిత్రాలు గీస్తూనే వున్నాను. మా ఆవిడ తప్ప మెచ్చుకునేవారులేరు. ప్రోత్సహించేవారులేరు. మొన్న ప్రదర్శన ఏర్పాటు చెయ్యటానికి నానా తిప్పలూపడ్డాను. చాలా ఖర్చు భరించాను. ఏమయింది? ఎవరో వచ్చారు. చూశారు... వెళ్లారు. అయిపోయింది. ఇక నా జీవితంలో మళ్ళీ ఇంకో ప్రదర్శన ఏర్పాటు చెయ్యగలననే ఆశ నాకు లేదు. ఎన్నాళ్ళిలా నాకోసం నేను బొమ్మ లేసుకోగలుగుతాను? జనానికి నా బొమ్మల మీద ఆసక్తి ఎలా కలుగుతుందో, దానికేం చెయ్యాలో నాకు తెలియటంలేదు. కొన్నాళ్ళకు నాకు విరక్తి వచ్చేస్తుంది. ఈ చిత్రకళ ద్వారా ఏమీ సాధించకుండానే నా జీవితం పూర్తవుతుంది. మరెందుకీ తపన? ఈ తపనవల్ల బాధ తప్ప సుఖంలేదు. మీరు మానెయ్యటమే మంచిదయింది—అన్నాడు ఆయన"

"అన్ని అవకాశాలున్న ఆయనే అలా మాట్లాడితే, అంత శక్తివున్న ఆయనే అలా నిరుత్సాహపడుతుంటే నాకెందుకీ ఈ గోల. ఏదో చిన్నతనంలో వేశాం.




ఆ అధ్యాయం అంతటితో అయిపోయింది. మా ఆయనకు ఆసక్తివుంటే బాగుండేది... లేదు. ఆయనింకాస్త సరదా మనిషయినా బాగుండేది...కాదు! అది నా దురదృష్టం. ఉన్న జీవితం అసంతృప్తిగానే వుంది. కానీ దానికే అలవాటుపడుతున్నా. రాజీ పడుతున్నా. అంతకంటే చెయ్యగలిగింది లేదు. నువ్వు నా కోసం బాధపడి, నా బాధ రేపి నానా గొడవాపడకు. నీలాంటి మంచి స్నేహితురాలుంది...అది చాలదూ?"

శారద మాటలు సహజను ఆలోచనలో పడేశాయి. చాలా సేపు ఆలోచిస్తూ కూచుంది.

శారద "ఏమిటే ... బాగా దిగులు పడుతున్నావా నా కోసం" అంది ఉత్సాహం లేని నవ్వు నవ్వుతూ.

"కాదే...ఆలోచిస్తున్నాను! సరే ... బొమ్మలేసి ఎవర్ని ఉద్ధరించాలి? ఏం ప్రయోజనం? ఏ ప్రయోజనమూ లేని దానికోసం ఈ సంసారాన్ని వదిలెయ్యటంకంటే దాన్నే వదిలెయ్యటం మంచిదిగదా అన్నావు. ఆ విషయం నాకూ ఏమీ తోచటంలేదు. కానీ ఇంకో విషయం వుందే...నీ భర్త పెత్తనాన్ని నువ్వెందుకు సహించాలి? అతను ఆజ్ఞాపిస్తే నువ్వెందుకు పాటించాలి? అతనికి ఇష్టంలేని పనులు నువ్వెందుకు మానాలి? అట్లా నీ ఆత్మగౌరవం చంపుకోవటం ఎందుకు?"

"పిల్లలకోసం....సంసారంకోసం"

"ఆత్మగౌరవం లేకుండా అది సంసారంకాదు....బానిసత్వం. పిల్లల్ని నువ్వు పెంచుకోలేవా?"

"సాజీ...నేనలా వుండలేనే. అంత ధైర్యం నాకులేదు. నేనీ పరిధిలోంచి బైటికి రాలేను...రాను.బాధపడుతుంటా. అశాంతిగా వుంటా. కుమిలిపోతుంటా. కానీ దీన్నుంచి మాత్రం బైటపడలేను... అది నా వల్లకాదు. రమ అదృష్టవంతురాలు. పూర్తిగా సంసారంలో మునిగిపోయింది. దానికే అసంతృప్తి లేదు. నాకు అశాంతివుంది. అది లేకుండా వుండలేను. దాన్ని పోగొట్టుకోనూలేను. ఒక్కోరోజు నరకంగా వుంటుందే"

శారద అసహనంగా కణతలు రుద్దుకుంటూ కూచుంది.

"తలనొప్పిగా వుందా?" జాలిగా అడిగింది సహజ.

"ఊఁ..."

"టీ తాగుతావా?"

"ఊఁ..."

సహజ లేచి టీపెట్టి తెచ్చేసరికి శారద ఆ కుర్చీలోనే వెనక్కువాలి కళ్లు మూసుకుంది. కళ్ళనుంచి కన్నీరు కారుతోంది.

సహజకు గుండె పట్టేసినట్లయింది. శారదలా కుమిలిపోయేవాళ్ళెందరో?

సహజ శారద కన్నీరు తుడిచి టీ ఇచ్చింది.

శారద టీ తాగుతూ, "నా గురించి ఆలోచించకే! నేనొచ్చినప్పుడల్లా పాత కబుర్లన్నీ చెప్పి నవ్వించి పంపు. ఆ ఆనందమైనా వుండనీ" అంది.

"చెబుతాను.పాత కబుర్లు కాదు..కొత్త కబుర్లు చెబుతాను. నీకు జీవితంమీద వుత్సాహం కలిగిస్తాను. ఆ వుత్సాహం వుంటేనే నువ్వు నీ జీవితం గురించి ఆలోచిస్తావు. అలా ఆలోచింపచేయలేపోతే మన స్నేహానికి అర్థంలేదు. ఎప్పుడూ గతంలోనే బతికేవాళ్ళు మనుషులు కాదు...దయ్యాలు"

"అయితే నేను దయ్యాన్నే"

"నేను మాత్రం మనిషినే. మనుషులు దయ్యాలతో స్నేహం చెయ్యరు"

"కానీ దయ్యాలు మనుషుల్ని పడతాయి. నేను నిన్ను పడతాను" శారద నవ్వింది.

"అసలు దయ్యాలే అబద్ధం"

"మరి నువ్వే అన్నావు....గతంలో బతికేది దయ్యాలని. నేనుకూడా మనిషినేనే. నా మీద కోపం తెచ్చుకోకు. జాలిపడు కోపం తెచ్చుకుని నా స్నేహం మానేస్తే నా కోసం నువ్వేమీ చెయ్యలేవు. జాలిపడి స్నేహంచేస్తే ఏ చిన్న సహాయమైనా చెయ్యగలవు"

శారద వెళ్ళటానికి సిద్ధమయింది.

"మళ్ళీ ఎప్పుడొస్తావు?"

"మా ఆయన క్యాంపు వెళ్ళినపుడు"

"ఈసారి పిల్లల్ని తీసుకురా. ప్రసాద్ నామీద పోట్లాడుతున్నాడు – నువ్వు పిల్లల్నికనవు సరే... స్నేహితుల పిల్లల్ని కూడా ఇంటికి రానివ్వవా అని. 'మీరు పిల్లల్ని తీసుకుని మా ఇంటికి రావద్దు' అని నేను మీతో చెప్పానట"

"నీకు పిల్లలకోడి అనే బిరుదుండేదని ప్రసాద్‌గారికి చెప్పలేదా? చిన్నప్పుడు ఎప్పుడూ పదిమంది పిల్లల్ని వెంటేసుకుని ఆడిస్తూ వుండేదానివిగా. ప్రసాద్‌కి ఎందుకో అన్యాయం చేస్తున్నావు"

సహజ నవ్వింది.

శారదను పంపి సహజ ఆలోచిస్తూ కూచుంది. ఆడవాళ్ళలోని శక్తులనూ, కళలనూ సమాజం అణగదొక్కేస్తుంది. నిజమే గానీ, మగవాళ్ళకైనా సమాజం ప్రోత్సాహం ఇవ్వటంలేదనే విషయం కూడా అబద్ధంకాదు. కాకపోతే వాళ్ళకు ప్రయత్నించే అవకాశమన్నా వుంటుంది. ఆడవాళ్ళకదీ ఉండదు. నిజమే....సమాజం ఏమీ బాగోలేదు. ఎవరూ సుఖంగాలేరు. ఆడవాళ్ళస్థితి మరీ భయంకరంగావుంది. అసలు తిండికోసమే ఇరవై నాలుగు గంటలూ పనిచెయ్యాల్సినవాళ్ళ స్థితేమిటి? తినటానికింత వుండి ఆలోచించే తీరికా స్థిమితం వున్నాళ్ళ విషయమే ఇలా వుంటే, నాలుగువేళ్ళూ నోట్లోకి పోవటమే కష్టమైన వాళ్ళ సంగతేమిటి? వాళ్ళలో కళలూ, సృజనాత్మక శక్తులూ అన్నీ మట్టిగొట్టుకుపోవటమేగా? ఇక ఆ తరగతి ఆడవాళ్ళ విషయం ఏమిటి? వాళ్ళు జీవితాన్ని గురించీ జీవనోత్సాహాన్ని గురించీ ఏమాలోచిస్తారు? వాళ్ళకు నా మాటలూ, ఆలోచనలూ హాస్యాస్పదంగా కనబడతాయా?

'ఊరవతల నీరింకిన
చెరువుపక్క చెట్టునీడ
గోనెలతో కుండలతో
ఎటుచూస్తే అటు దుఃఖం
పటు నిరాశ
చెరసాలలు ఉరికొయ్యలు
కాలువలో ఆత్మహత్య
దగాపడిన తమ్ములార
మీ బాధలు మీ గాథలు
అవగాహన నాకవుతాయ్'

నాకవుతాయా? అవవు. అవి నాకవగాహన అయితే ఆ బతుకుల జీవితసూత్రమేదో నా చేతికి చిక్కితేతప్ప నా అయోమయం పోదు. అప్పటిదాకా ఈ అశాంతి తప్పదు. దేశం ఎంత భయంకరంగా వుంది. ఆకలి, అజ్ఞానం, నిరుద్యోగం, అవినీతి, అన్యాయం. ఎవరు దీన్ని బాగు చేస్తారు? ఎలా చేస్తారు? నేనేం చెయ్యాలి?

"ఇవాళ మీ స్నేహితురాల్చినట్లున్నారు?" ప్రసాద్ మాటలతో సహజ




ఆలోచనలు ఆగిపోయాయి.

"ఎలా తెలిసింది?"

"నీ మొహం చూస్తేనే తెలిసింది. మీ స్నేహితులతో నవ్వుతూనే మాట్లాడతావు. వాళ్ళు వెళ్ళిపోయాక ఇక ఆలోచనల్లోపడి నాతో మాట్లాడవు...ఇదెక్కడి గోలరా"

"సరేగాని ...ఇలా కూచో. నీతో మాట్లాడాలి. ఇవాళ శారదొచ్చింది"

"ఊఁ..." అంటూ ప్రసాద్ ఓ కుర్చీలో కూచున్నాడు.

"శారదకు తన సంసారం చాలా అశాంతిగావుంది. కానీ వదిలి రానంటుంది. ఆ అశాంతిలోనే వుంటుందిట. నాకు చాలా కోపం వచ్చింది. అసలు తనకోసం నేనెందుకు బాధపడాలి" - సహజ బుర్రంతా గందరగోళంగావుంది.

"బాధపడమని ఎవరన్నారు?"

"ఎవరన్నా అంటే బాధపడతారా? ఇక శారదతో చెప్పేస్తా! నీ సంసారం గొడవలేవీ నాతో చెప్పకు. నేను నీకు పాత కబుర్లు చెప్పి ఎంటర్‌టైన్ చెయ్యను. నీ గురించి ఆలోచించను. నీతో స్నేహం ఇంతకుముందులా చెయ్యను...చెయ్యలేను అని"

"సహజా ... ప్రతిసారీ నువ్వు ఈ విషయంలో పొరపాటు చేస్తూనే వున్నావు. నీకు అజ్ఞానం అంటే కోపం వుండవచ్చు గానీ అజ్ఞానానికి బలయ్యే మనుషులంటే కోపం వుండగూడదు. ఎదుటివాళ్ళ అజ్ఞానాన్ని వుపయోగించుకుని లాభం పొందేవాళ్ళను ద్వేషించుగానీ అజ్ఞానంతో బాధలుపడేవాళ్ళను ప్రేమించు"

"సరేలే...అపు నీ వుపన్యాసం. నా బుర్రంతా గందరగోళంగా వుంది అలా అన్నానుగానీ శారదను ద్వేషిస్తానా? ఎలా ఈ దేశం బాగుపడేది?"

"అమ్మో చచ్చాం ... ఆడాళ్ళను గురించి కాకుండా నువ్వు దేశం గురించి కూడా ఆలోచిస్తున్నావా? ఇక నాకేది దారి?" హాస్యంగా అన్నాడు ప్రసాద్.

"నువ్వు సీరియస్‌గా మాట్లాడదల్చుకోకపోతే ఇక్కణ్నించి వెళ్లు" విసుక్కుంది సహజ.

"నేను సీరియస్‌గా మాట్లాడితే ఉపన్యాసం అంటావు గదా! సరే ఇవాళ నీ మూడ్ బాగున్నట్లులేదు. ఏదన్నా మంచి పుస్తకంచదువుకుందాం రా"

"కొత్త పుస్తకాలేమీ లేవు"

"పోనీ పాతవే" అంటూ ప్రసాద్ పుస్తకాలు వెతకటం మొదలెట్టాడు.




'సహజా ... సహజా...'అని పిలుపు వినపడ్డట్లయి బైటికి వచ్చిన సహజకు ఎదురుగా రమ కన్పించేసరికి చాలా సంతోషమనిపించింది.

"రా రా ... మా ఇల్లు తేలిగ్గా దొరికిందా?" అంది నవ్వుతూ ఆహ్వానిస్తూ.

"పుట్టి పెరిగిన వూళ్లో ఇల్లు కనుక్కోవటం కష్టమా ఏమిటి! ఈ పక్కే మా బంధువుల ఇల్లు కూడావుంది. ఇంట్లో ఎవరూ లేరా...ఇంత నిశ్శబ్దంగావుంది" అంది రమ హాలంతా కలయజూస్తూ.

"ప్రసాద్ నిద్రపోతున్నాడు. నేనిప్పుడే నిద్రలేచాను. పోయిన

అదివారం నువ్వు కూడా వస్తే బాగుండేది. శారదా, ఉషా వచ్చారు. మన పాత కబుర్లన్నీ చెప్పుకున్నాం" అంటూ సహజ మంచినీళ్లు తెచ్చి ఇచ్చింది.

"మీరు ఇంకా ఫ్రిజ్ కొనుక్కోలేదా! ఈ నీళ్ళు తాగితే దాహం తీరినట్లే వుండదు" గ్లాసు కింద పెడుతూ అందిరమ.

సహజ ఆ మాట అసలు పట్టించుకోకుండా "మీ బాబుని తీసుకురాలేదేం?" అని అడిగింది.

"అసలు నేను మాత్రం వస్తాననుకున్నానా? మావారికి ఇవాళ ఇటుపక్క పనుంది వస్తుంటే నేనూ అప్పటికప్పుడు బయల్దేరి వచ్చేశాను. వాడు నిద్రపోతున్నాడు. లేపటం ఎందుకులే. నేనుచూస్తాను. కాని నువ్వు తొందరగావచ్చెయ్యమన్నారు మా అత్తగారు. పోయినాదివారం ఒక్కక్షణం తీరలేదనుకో. ఆయన క్లబ్బు మెంబర్లకి పార్టీ ఇచ్చారు. పార్టీ అని పేరేగాని డిన్నరుకంటే ఎక్కువ ఖర్చు, ఎక్కువ చాకిరీ అయింది. ఈసారి ఇస్తే డిన్నరివ్వండి.... ఈ చాకిరీ నేను చెయ్యలేను అన్నాను. డిన్నరయితే సుఖం తెలుసా ... వంట మనిషిని పెట్టి వండించెయ్యవచ్చు"

రమ అలా చెప్పుకుపోతుంటే సహజ మాట్లాడకుండా కూచుంది. నిజానికి ఏం మాట్లాడాలో తెలియలేదు.

"రెండేళ్ళయిందిగదా మీ పెళ్ళయి. ఇంకా పిల్లలు లేకపోవటం ఏమిటి? అసలు పిల్లలు లేకపోతే ఇంట్లో సందడేవుండదు. బోసిగా వుంటుంది. మావాడిని తీసుకుని మా అత్తగారెప్పుడన్నా మా ఆడపిడ్డ దగ్గరకు వెళుతుంది. మళ్ళీ వాడు కనబడే దాకా పిచ్చెక్కినట్లుందనుకో .... మీరు ప్లానింగు చేస్తున్నారా ఏమిటి?"

"ఆఁ..అప్పుడే పిల్లలెందుకులే నాలుగైదేళ్ళు స్వేచ్ఛగా వుందామని" అంది సహజ నవ్వుతూ.

"పిల్లలు పుడితే స్వేచ్ఛ వుండదని పిల్లల్ని కనరా ఏమిటి? ఎందుకంటా ఆ స్వేచ్ఛ?" తేలికగా తీసిపారేసింది రమ.

"బాలమురళీ కృష్ణ పాట వినటానికి" అంది సహజ చటుక్కున.

"అదేంటి?" అంది రమ ముఖం చిట్లించి.

"ఆరోజు నువ్వు బాలమురళి పాడుతుంటే మధ్యలో ఎందుకువెళ్ళిపోయావు?"

"ఇంకా నయం. వెళ్ళకపోతే లీటరు పాలు విరిగిపోయేవి. మర్నాడు పెరుగు లేకపోతే ఆ తండ్రీకొడుకుల చిందులూ, కోపం పీటితోనే చచ్చిపోయేదాన్ని. మా అత్తగారు మాట్లాడకుండా వున్నట్టు కనబడుతుందిగానీ చిన్న పొరపాటుకి కూడా ఒకటే గొణుగుతుంటుంది. నేనెంత జాగ్రత్తగా వుంటే ఆ ఇల్లలా ప్రశాంతంగా వుందనుకున్నావు. సంసారంలో పడిపోయాక ఇంకా డాన్సులు, పాటలు అంటే కుదురుతుందా? నాకు రేడియో వినటానికి కూడా తీరదు. ఎప్పుడన్నా రేడియో పెట్టినా మా అత్తగారు ఆ మోతకి తలనొప్పి వస్తుంది తియ్యమని గొడవ. ఆయన ఇంట్లో వుంటే వార్తల కోసం పెడతారు. వార్తలు వినకపోతే ఆయనకు పిచ్చెక్కుతుంది"

రమ ధోరణి ఆగేలా లేదు.

"నువ్వింత మారిపోవటం నాకు ఆశ్చర్యంగా వుందే! లీటరు పాల కోసం బాలమురళి పాట వదిలేశావంటే..."

"మళ్ళీ పాటంటావేమిటే...ఆ పాలు విరిగితే, రాత్రిపూట పాలు లేకపోతే పిల్లాడికి ఆకలెయ్యదూ! అయినా కొన్ని




పాటలు విన్నాగా. ఇక ఆ పాటల పిచ్చిలో పడి సంసారం ఒదులుకోమంటావా ఏమిటి?" రమ చిరాకుపడింది.

"ఈ పాటల కోసం ప్రాణాలు ఒదిలెయ్యటానికి సిద్ధపడ్డావు ఒకరోజు... గుర్తుందా?" సహజ రమ ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అంది.

"అదేమిటి? ప్రాణాలు ఒదిలెయ్యట మేమిటి?" రమకి అర్థం కాలేదు.

"నువ్వు సంగీతాన్నే కాదు...గతాన్ని కూడా పూర్తిగా మర్చిపోయ్యావు. మనం బి.ఏ రెండో సంవత్సరంలో వుండగా గుంటూరులో బాలమురళి పాట కచేరీ జరిగింది ... గుర్తుందా? అది పొగాకు కంపెనీవాళ్ళు తమ ఆవరణలో ఏర్పాటు చేశారు. నీకు ఆ వార్త తెలిసిందగ్గర్నించీ ఎలాగైనా వెళ్ళాలని. మేమందరం ఆ కంపెనీ కాంపౌండ్ చాలా దూరమనీ, రాత్రిపూట తిరిగి రావటం కష్టమనీ వద్దన్నాం. ఇంట్లోవాళ్ళు కూడా అంత దూరం వద్దులే అన్నారు. నువ్వు ముందు మీ ఇంట్లో అందరిమీదా పోట్లాడావు. తర్వాత మా ముగ్గురి ఇళ్ళకూ వచ్చి మా అమ్మావాళ్ళను ఒప్పించావు. ఉషా వాళ్ళ అమ్మ మరీ భయపడుతుంటే 'మా ఇంటి పక్కవాళ్ళు వెళ్తున్నారు. వాళ్ళకి కారుంది. వచ్చేప్పుడు దించుతామన్నారు' అని అబద్ధం చెప్పావు. శారద అంత రాత్రి పూట భయం కదా అని వెనకాముందాడు తుంటే, 'ఏమవుతుందే ... మాక్సిమమ్ చచ్చిపోతాం ... అంతేకదా! బాలమురళి పాట విన్నాక చచ్చిపోతే ఏమే?వినకుండా చచ్చిపోతానేమోనని నేను భయపడు తుంటే' అన్నావు...గుర్తుందా? అప్పుడు నాకా మాట ఎంత నచ్చిందో. నీకిష్టమైన దాన్ని సాధించుకోవటం కోసం నువ్వు చాలా పట్టుదలగా వుంటావనీ, అది నేనూ నేర్చుకోవాలనీ అనుకున్నాను. ఇప్పుడు నువ్వు పాలు విరుగుతాయని ఇంటి పక్కన జరుగుతున్న కచేరీలోంచి లేచి రావటం తల్చుకుంటే నాకు ఆశ్చర్యం కలగకుండా ఎలా వుంటుంది? ఎందుకింత మారిపొయ్యావు. అసలెలా మారగలిగావు. నాకసలర్థం కావటం లేదు" సహజ చాలా ఆవేశంగా అడిగింది.

రమ ముఖంలో ఒక్క క్షణం పాటు నీలినీడలు తారాడాయి. ఒక్క క్షణమే. వెంటనే రమ నవ్వేసింది.

సహజ విస్తుపోయింది. తన మాటలకు రమ ఆలోచనల్లో పడుతుందనీ, తనలో వచ్చిన మార్పుకి కారణాలు వెతుక్కుం టుందనీ అనుకుంది. కాని, రమ చాలా మామూలుగా నవ్వేసింది.

"ఔను ... నువ్విప్పుడు చెబుతుంటే జ్ఞాపకం వచ్చింది. చిన్నతనంలో ఎంత పిచ్చిగా వుండేవాళ్ళమో కదా ... ఎక్కడికంటే అక్కడికి వెళ్ళటం, ఏదంటే అది చెయ్యటం...తల్చుకుంటే నవ్వొస్తోంది. ఇంకా అలాగే వుండ మంటావా ఏమిటి? నేనెప్పుడన్నా బజారుకి వెళ్ళి సాయంత్రం ఆరుగంటలలోపు రాక పోతే ఇక మా అత్తగారి కంగారు చూడాలి. ఇంట్లోకి బైటికి తిరుగుతూ వుంటుంది. ఆయ తర్వాత ఆయన పక్కన లేకుండా నేనెక్కడికీ వెళ్ళను తెలుసా! రోజులు అసలు బాగోటంలేదు"

"నేచెప్పేదేమిటి?నువ్వనేదేమిటి? అర్థం లేకుండా మాట్లాడుతున్నావు" రమ ధోరణికి సహజకు చిరాకొచ్చేసింది.

"మరి ఏమిటే నీ గోల ... నాకర్థం కావటంలేదు" రమ అంతకంటే చిరాగ్గా అంది.

"ఏం లేదులే...టీ పెట్టుకుందాంరా" సహజ వంటింట్లోకి నడిస్తే రమ కూడా వంటింట్లోకి వచ్చి ఆ గదంతా కలయ జూసింది.

"మీ వంటిల్లు బాగా విశాలంగా ఉంది. భోజనాలు కూడా ఇక్కడే చేస్తారా? డైనింగు టేబిల్ కొనుక్కోలేదా?"

"ఆ...ఇక్కడే చేస్తాం! నాకు కింద కూచుని తింటేనే ప్రాణానికి సుఖంగా వుంటుంది. చిన్నప్పట్నించీ అలవాటవటం వల్లనేమో" అంది సహజ.

"మా వంటిల్లు ఇంత పెద్దగా ఉండదుగానీ అక్కడ కూడా చిన్న బల్ల వేశాం. ఎప్పుడన్నా హడావుడయ్యి అక్కడే ఆ బల్లమీద భోంచెయ్యమంటే మావారికి ఎంత కోపం వస్తుందో! డైనింగు టేబిలు కొన్నదెందుకూ అని ఇంతెత్తున ఎగిరిపడతారు. మావాడికి కూడా డైనింగు టేబిలే కావాలి. ఒక్క మా అత్తగారు మాత్రం వంటింట్లోనే తింటుంది. ఆవిడకు డైనింగు టేబులంటే గిట్టదు. మా ఆడబిడ్డ డైనింగు టేబిలు కావాలో అని పోరుపెడుతుంటే ఆమెకు కొనివ్వకుండా ముందు మేం కొనుక్కున్నాం. తర్వాత రెండు నెల్లకు ఆమెకూ కొనిచ్చామనుకో! ఆ రెండు నెల్లూ మా అత్తగారి ముఖం చూడాలి. నల్లగా చేసుకుని కూచునేది. కాఫీకో, భోజనానికో పిలిస్తే వచ్చేది. మళ్ళీ వెళ్ళి గదిలో పడుకునేది. పిల్లాడిని కూడా దగ్గరకు తియ్యలేదు తెలుసా? ఇక మా ఆడబిడ్డ ఆ రెండు నెల్లూ నెలకు నాలుగుసార్లు బెజవాడనుంచి వచ్చేది. మా డైనింగ్ టేబుల్ చూసి ఏడ్చేది. ఆ రెండు నెలలూ మా టేబిల్ మీద ఒక్కసారన్నా భోజనం చెయ్యలేదు తెలుసా! మాకెందుకమ్మా ఈ టేబిళ్లూ అని తల్లీ కూతుళ్ళిద్దరూ వంటింట్లోనే తినేవారు. ఎలాగో రెండు నెల్లలో ఆ టేబిల్ కొని పంపించాం. ఆమె గొడవపోయింది. మా అత్తగారు మాత్రం ఈ టేబిల్ వంక చూడదు. ఎంత కుళ్లు మనిషనుకోవాలే"

సహజ మూడు కప్పుల్లో టీ పోసి ప్రసాద్‌కొకటి ఇచ్చి రెండు కప్పులు పట్టుకుని హాల్లోకి వచ్చేదాకా రమ ఆపకుండా మాట్లాడుతూనే ఉంది. సహజకు రమ చెప్పే మాటల్లో ఒక్కటి కూడా బుర్రకెక్కటంలేదు.

ఎంతసేపూ ఏం మాట్లాడినా రమ ఆ ఇంటి సంగతి తప్ప ఇంకో విషయం మాట్లాడదేం? ఎదుటివాళ్లు వింటున్నారా లేదా అనేది కూడా చూడటం లేదు. అది కూడా పట్టకుండా మాట్లాడుతుందంటే ఎంత లీనమైపోయి వుండాలి ఆ సంసారంలో. ఎట్లా లీనమవగలిగింది? అక్కడ గొప్ప ప్రేమలూ, ఆప్యాయతలూ వున్నాయా అంటే అదీ కనబడటంలేదు. రమ మాట్లాడేవన్నీ చిల్లర విషయాలే. ఆ విషయాల్లో అంతగా ఎలా కూరుకుపోగలిగింది. ఇవాళ రమ సంగతేమిటో అర్థం చేసుకోవాలి. రమని కదిలించి దాని లోపల అణిగివున్న అసలు విషయాన్ని బైటికి రప్పించాలి. ఈ మార్పు కావాలని కొని తెచ్చుకుందా .... ఒక క్రమంలో తనకు తెలియకుండానే మారిపోయిందా. రమ సంతోషమంతా నటనా? ఈ చిల్లర విషయాలు నిజంగానే రమను సంతోష పెడుతున్నాయా?

సహజ ఈ ఆలోచనల్లోపడి కొట్టుకు పోతుంటే రమ టేబిల్ మీదున్న ఆల్బమ్‌లో ఫొటోలన్నీ చూస్తోంది. సహజా, ప్రసాదూ కలిసి తీయించుకున్న ఫొటోలవి.

"మీరు చాలా ఊళ్ళు తిరిగినట్లున్నారే?" అంది రమ ఆ ఫొటోలు చూస్తూ.

"ఎక్కువేం తిరగలా. సంవత్సరానికి రెండుసార్లు ఏదో ఒక మంచి ఊరు చూడాలని మాప్లాను. అలాగేవెళుతున్నాం. ఆఫొటోలన్నీ అలావెళ్ళినప్పుడు తీసినవే"

"ఈ గుహలెక్కడివే... చాలా బాగున్నాయి?

పెళ్ళయ్యాక నేను అమరావతి కూడా వెళ్ళలేదు. మా ఆడబిడ్డవుంది గనుక రెండుసార్లు బెజవాడ వెళ్ళాలే. అమ్మో... మేమిద్దరం ఇలా తిరగటానికి బయల్దేరితే మా అత్తగారు ఊరుకుంటుందీ! అయినా అంత డబ్బు ఇప్పుడు మేం ఖర్చు పెట్టలేం కూడా"

''అదేంటీ...ఎందుకని?''

''ఔనమ్మా...మీరిద్దరూ సంపాదిస్తున్నారు. పిల్లలులేరు. మీరు ఖర్చు చేసినట్లు మేమెట్లా చేస్తాం. ముందు ఇంట్లోకి కావల్సినవన్నీ అమర్చుకోవాలా? ఫ్రిజ్ కొన్నాం. ఇంకా వాషింగ్ మెషినూ, టి.వి. కొనాలి. స్థలంకొని ఏడాదయింది. దానిలో ఇల్లు మొదలెట్టాలి. మాఅబ్బాయి చదువుకి ప్రతి నెలా కొంత బాంక్‌లో వెయ్యాలి. మళ్లీ మావారి పార్టీలూ ఖర్చులూ వుంటాయి. నేనెంతో పొదుపుగావుంటే కానీ జీవితంలో అనుకున్నవన్నీ సాధించలేం''

''జీవితంలో నీకేం కావాలి రమా? నీ జీవితాశయం ఏమిటి?'' సహజ రమ మాటలనాపేస్తూ అడిగింది.

"ఏమిటే... నీ సినిమా డైలాగులూ, పుస్తకాల్లో మాటలూ? నువ్వు ఏమీ మారలేదు. మారావుగానీ చదువుకునే రోజుల్లోకంటే ఇంకా పిచ్చిగా మారావు. మీ ఆయన కూడా నీలాంటి పిచ్చే



ష్తున్నట్లుంది''

మీ ఆయన అనే మాట సహజ చెవులకు కటువుగా వినిపించింది, ప్రసాద్ నెవరన్నా అట్లా అంటే సహజకు చాలా చిరాకొస్తుంది. ఆ చిరాకు అణుచుకుంటూ అన్నది సహజ-

''అదికాదు రమా! నువ్వు జీవితంలో సాధించాలనుకునేదేమిటి? పూరికే సరదాకు అడుగుతున్నాను''

''మంచి ఇల్లు కట్టుకోవాలి. మావాడిని డాక్టరు చదివించాలి. ఇంకో అబ్బాయిని కని ఇంజనీర్ని చెయ్యాలి. అంతే! ఇంత కంటే ఇంకేమీలేవు''

సహజకు చాలా ఆశ్చర్యమనిపించింది నవ్వూ వచ్చింది. ''ఇల్లు కట్టుకుంటావు ఓ నాలుగైదేళ్ళలో అది సరే...మీ అబ్బాయి డాక్టరు చదివితే అది అతని జీవితాశయం ఔతుందిగానీ నువ్వు సాధించేదేమిటి? పిల్లల చదువేనా మన జీవితాల్లో అతి ముఖ్యమైన విషయం? నువ్వు చెప్పేది నాకర్థమయింది. పిల్లల్ని బాగా చదివించాలనుకోవటంలో తప్పులేదు. కానీ అదేనా మన జీవితం మొత్తం... మన కంటూ ఒక జీవితం వుండొద్దా?''

సహజ మాటల్ని మధ్యలోనే ఆపేసింది రమ.

"సహజా...నీకు నిజంగా పిచ్చెక్కింది. పిల్లల్ని చక్కగా పెంచుకుని మంచి చదువులు చెప్పించటమే జీవితం. అంతకంటే ఏంచేస్తాం జీవితంలో. సరే... లోకంలో బతుకుతున్నప్పుడు అనేకం వుంటూనే వుంటాయి సరదాలు,సినిమాలు, షికార్లూ, ఆటలూ, పాటలూ! ఈ సరదాలే జీవితమా ఏంటి? ఈ సరదాలువుంటే సంతోషించాలిగాని లేకపోతే ఇక జీవితమే లేనట్లు ఏడుస్తారా?"

"పిల్లలకి చదువులు చెప్పించటమేనా జీవితమంటే" సహజ చాలా ఆశ్చర్యంగా అడిగింది.

రమ ఎంత తేలిగ్గా జీవితాన్ని నిర్వచించగలిగింది. అదే జీవితమని ఎంత నమ్మకంతోవుంది. ఇంకేమన్నావుందేమో ననే సందేహంగానీ, ఆసక్తిగానీ లేనేలేవు. రమని చూసి జాలిపడాలో, భయపడాలో అర్థంకాలేదు సహజకి.

రమ ఇంకాస్త గొంతుపెంచి మరింత ఖచ్చితంగా చెప్పింది. "పిల్లల్ని కని చక్కగా పెంచి మంచి చదువులు చెప్పించటం ... ఇదిగాక ఇంకేముంది జీవితం. నాకు మాత్రం ఇదే జీవితం. నాకు చాలా హాయిగావుంది. ఈ జీవితం లోనే అన్ని సుఖాలూ సౌకర్యాలూ ఏర్పరచుకుంటాం. హాయిగా బతికి పిల్లల వున్నతిని కళ్ళారాచూసి తృప్తిగా చచ్చిపోతాను. లేనిపోని అశాంతులూ,కష్టాలూ తెచ్చుకోవటమెందుకు. ఆ చిన్న చిన్న సరదాలు తీరకపోతే చిన్న పిల్లలమా ఏడుస్తూ కూచోటానికి? ఏ బాధ్యతలూ లేకుండా తిరిగితే ఎన్ని చికాకులొస్తాయి. మీరంటే ఇద్దరూ అలాంటివాళ్ళే. తిరుగుతున్నారనుకో. పైగా అత్తలూ, ఆడబడుచులూ లేనట్టున్నారు. పిల్లాపీచూలేరు. అన్నీ వున్న నన్నుకూడా అలా తిరగమంటావా ఏమిటి? అది సరేగాని నీ జీవితాశయం ఏమిటో కాస్త చెప్పు. పాట కచేరీలకు వెళ్ళటం, వూళ్ళ పట్టుకు తిరగటమేనా నీ జీవితాదర్శం? దానికంటే కన్న పిల్లల్ని బాగా చదివించుకుంటానంటే అది నీకు తప్పనిపిస్తోందా? అసలు ముందు నాకిది చెప్పు... నీ జీవితాశయం ఏమిటి?" రమ ఆయాసంగా ఆగింది.

రమ ఈ మాత్రం సీరియస్‌గా ఒక




సీరియస్ విషయాన్ని గురించి మాట్లాడి చాలా రోజులయినట్లుంది. ముఖమంతా చెమట పట్టేసింది. ఎర్రగా కంది పోయింది.

సహజ విస్తుపోయి రమనే చూస్తూ కూచుంది. రమ మళ్ళీ అడిగింది-

"చెప్పు...నీ జీవితాశయం ఏమిటో చెప్పు"

"పిల్లల్ని పెంచటం మాత్రం కాదు" సహజ నీరసంగా అంది.

"పిల్లల్ని కనవా? కంటే పెంచవా... పారేస్తావా?" రమ ఆవేశంగా అంది.

"పిల్లల్ని కంటాను... పెంచుతాను. కానీ అదే నా జీవితాశయంగా మార్చుకోను. పిల్లలకో జీవితం కల్పిస్తాను. అది నా విధి. నాకున్న అనేకానేక విధుల్లో అదొకటి మాత్రమె. నా మొత్తం జీవితం అదే ఎట్లా ఔతుంది?" సహజ రమకు చెబుతున్నట్లు కాకుండా తనకు తాను చెప్పుకుంటున్నట్లుగా అంది.

రమ ఇంక వెనక్కు తగ్గదలుచుకోలేదు.

"మరి నీకు జీవితమంటే ఏమిటి? నీ జీవితాశయం ఏమిటి? సూటిగా చెప్పు... నాకర్థమయ్యేలా చెప్పు"

సహజకేం చెప్పాలో వెంటనేతోచలేదు.

'తన జీవితాశయం ఏమిటి! తన జీవితాశయం పిల్లల్ని పెంచటం కాదు. ఉద్యోగమా-ఉద్యోగంలేకపోతే జీవితమే లేనట్లా...అదీకాదు. పుస్తకాలు చదవటమె జీవితాశయమా? పుస్తకాలు చదవకుండా వుండలేనుగానీ అదేనా జీవితాశయం? పాటలూ, విహారాలూ అన్నీ అంతే. ఏం లేకపోతే తాను వుండలేదు. ఏం లేకపోతే తనకు విపరీతమైన అశాంతి. జీవితంలో ఏముంటే తనకు శాంతి. తనకు శాంతినిచ్చే దేమిటి? స్నేహం...ప్రేమ. స్నేహితులు లేకుండా, ప్రేమ లేకుండా తను బతక లేదు. తన జీవితాశయం స్నేహం..ప్రేమ అంతే!' సహజకు వుత్సాహం వచ్చింది సహజ మాట్లాడబోయేంతలో రమ అందుకుంది.

"చూశావా! నీ జీవితాశయం ఏమిటో నీకే తెలియదు. ఎందుకంటే నీకే బాధ్యతా లేదు...పట్టించుకోవు. నీ సరదాలే నీకు ముఖ్యం. నాకట్లా కాదు. నాకు నా సంసారం, నా పిల్లలూ ముఖ్యం. ఇంతకీ నీకింకా చిన్నతనం వదల్లేదు. పిల్లలు పుట్టుకొచ్చి బాధ్యత మీదపడితే గాని నీకూ తెలిసి రాదు. ఈ పిచ్చికాస్త తగ్గదు. అబ్బా...లేనిపోని వాదనలు చేసి తలనొప్పి తెప్పించావు తల్లీ! బాత్‌రూం చూపించు. కాసిని చన్నీళ్ళతో ముఖం కడుక్కుంటాను" అంటూ లేచింది రమ.

సహజ లేచి బాత్‌రూం చూపించింది. రమ ముఖం కడుక్కుని టవల్‌తో తుడుచుకుంటూ .... "పౌడరు, బొట్టు, అద్దం" అంది.

సహజ గబగబా అవన్నీ తెచ్చి రమ ముందుంచింది. రమ అద్దంలో చూస్తూ, పౌడరు రాసుకుంటూ''ఈ చిన్న అద్దంలో చూసుకోవటం నాకలవాటు లేదు. మీ ఇంట్లో డ్రెస్సింగ్ టేబిల్ లేదూ?" అనడిగింది.

"లేదు. నాకిష్టం వుండదు అంత పెద్ద అద్దం" అంది సహజ.

''నీకు సుఖాలేవీ ఇష్టం వున్నట్టు లేదులే మీ ఇల్లు చూస్తేనే తెలుస్తుంది. సుఖ పడటం నేర్చుకోవే పిచ్చిమొద్దూ" అని నవ్వింది రమ.

సహజకేమీ మాట్లాడబుద్ధి కాలేదు. రమ తెలివిగలది, గడుసైనది. ఆ సంగతి తెలుస్తూనే వుంది. కానీ నా జీవితాశయం

స్నేహం, ప్రేమ అని చెబితే దానికర్థం కాదు. అర్థం కాలేదని ఒప్పుకోదు. చిన్నతనమంటుంది. పిచ్చి అంటుంది. ఎందుకు రమతో వాదన. రమ సుఖంగా, శాంతిగా బతుకుతోంది. ఎందుకామెతో ఈ వాదనలు. కానీ రమ నిజంగా సుఖంగా, ఆనందంగా, శాంతిగా బతుకుతోందా? ఎక్కడా ఏ వెలితీ లేదా? ఉన్నా గుర్తించ నిరాకరిస్తోందా?

"ఏంటోయ్ ... నీ ఆలోచన? నా మాటలకు బాధపడుతున్నావా ఏమిటి? సీరియస్‌గా తీసుకోకు....సరదాకి కాసేపు వాదించుకున్నాం. అయిపోయింది.ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళు బతుకుతాం దానికేముంది. ఇంతకీ నీకింకా చిన్నపిల్ల మనస్తత్వంపోలా"

రమ మాటలకు సహజ ఆశ్చర్యపోతోంది. తనను చిన్నపిల్లగా చూసి మాట్లాడిన వారెవరూ ఇంతవరకూ సహజకు కనపడలేదు. పైగా ఎవరితోనైనా సహజే ఎక్కువగా మాట్లాడేది. అవతలివాళ్లకు వినే అవకాశం తప్ప మాట్లాడే అవకాశం ఇచ్చేది కాదు. గబగబా మాట్లాడి వాళ్లను విమర్శించి వాళ్ళు నొచ్చుకుంటారేమోనని బాధపడేది. ఇవాళ రమ ముందు సహజ పరిస్థితి తారుమారయింది. రమే అన్ని మాటలూ మాట్లాడింది. సహజను ఆలోచనలో పడేసింది. చిన్నపిల్లవంది తన విమర్శకు సహజ బాధ పడుతుందేమోనని ఓదారుస్తోంది. జీవితంలో మొదటిసారి ఈ పరిస్థితి ఎదుర్కోవాల్సి రావటంతో సహజ తికమక పడిపోయింది. ఏం మాట్లాడాలో తెలియక వెర్రి నవ్వొకటి నవ్వి వూరుకుంది. రమ వాచీ చూసుకుని-

"అమ్మో ... అయిదున్నరయింది. నేను వెళ్లానిక" అంది.

"అతనొస్తాడేమో నిన్ను తీసుకెళ్ళటానికి" అంది సహజ.

"సరేలే...ఆయన కోసం కూచుంటే రాత్రి పన్నెండు గంటలకే ఇల్లు చేరేది. ఈ అరండల్ పేటలోనే ఆరోలైన్లో వాళ్ళ కొలీగ్ ఇంట్లో డిన్నరు. వాళ్ళాఫీసు వాళ్ళందరూ నెలకొకరి ఇంట్లో డిన్నరిచ్చుకుంటారు. ఇవాళ అక్కడికే వెళ్ళారు"

"డిన్నరయితే పన్నెండు గంటల దాకా ఏంచేస్తారు?"

డిన్నరు అని పేరేగాని వాళ్ళందరికీ తిండిమీద దృష్టి వుండదు. మధ్యాహ్నం రెండింటికే అక్కడికి చేరతారు. రాత్రి పన్నెండింటిదాకా పేకాడి అప్పుడు కొంప చేరతారు" మురిపెంగా అంది రమ.

"పేకా?"

"ఆ( ... పేకే. మా ఆయనకు పేకాటంటే ఎంత పిచ్చో తెలుసా? మా పెళ్ళి కాకముందు రోజూ ఆడేవారు. పెళ్ళయ్యాక నాకు మాటిచ్చారు — నెలకొకసారి మాత్రమే ఆడతానని. నామీద ప్రేమతో పేకాట మానేశారు. అయినా ఆయనకీ బాధ్యత తెలుసులే. పెళ్ళిగాక ముందులా కూచుని పేకాడితే సంసారం జరిగేదెలా? నెలకోసారిమాత్రం ఈ డిన్నర్లలో కరువుతీరా ఆడుతుంటారు. నాకు నేర్పాలని చూశారుగానీ నాకేంటో విసుగు ఆ ఆటంటే-మళ్ళీ మా వాడికి అయిదేళ్లు నిండలేదా .... ముక్కలన్నీ తెలుసు. వాడికెంత తెలివనుకున్నావు. సహజా!మా అత్తగారికే మాటలు చెప్పాలో, ఏవి చెప్పకూడదో అంతా వాడికి తెలుసు"

రమ ధోరణి ఆగటంలేదు. రమ దేని కోసం మురిసిపోతోందో సహజకది మహా చిరాకనిపించింది. అయిదేళ్ళ పిల్లాడు




ఎవరిదగ్గరే మాట మాట్లాడాలో అలా మాట్లాడటం? పెద్దల ప్రభావం లేనిదే అలా ఎలా తయారవుతాడు! దానికి అదో సుగుణం అనుకొని తలిదండ్రులు మురిసి పోవటం-సహజ తల పట్టుకుంది.

"నీకూ తలనొప్పి వచ్చిందీ. సరే...నే వెళతామరి" అంటూ లేచింది రమ.

సహజ ఇక వారించే ప్రయత్నం చెయ్యలేదు. రమను చూడగానే కలిగిన సంతోషం యావత్తూ ఆవిరై పోయి తెలి యని భయం పట్టుకుంది. పోయినాదివారం శారద అందుకే కాబోలు రమ రాకపోతేనే బాగుంటుంది అంది. శారద ఆ భర్తకు తలవంచి బతుకుతుందేమోగాని ఆత్మ వంచన చేసుకోవటంలేదు. రమ ఆత్మ వంచన చేసుకుంటోందా? నిజంగానే ఏ వెలితీ లేకుండా బతుకుతోందా?

అయినా మొత్తానికి రమ ఎవరూ లేపని కొన్ని ప్రశ్నలు లేపింది. ఎవరూ కలిగించనంత జటిలమైన సందేహాలు కలిగించింది. రమ గురించీ, రమ ఎంచు కున్న జీవితం గురించీ, అందులోని శాంతిని గురించీ ఆలోచించాల్సింది చాలా వుంది.

రమతోపాటు గేటుదాకా నడిచింది సహజ.

"మీ ఇంట్లో చాలా మొక్కలు న్నాయే" అంది రమ గేటుదాకా వెళ్ళి వెనక్కి తిరిగిచూస్తూ.

"మేం వచ్చి నెల దాటింది. అంతేగా! అంతకు ముందు వున్నవాళ్ళెవరో చక్కగా పెంచారు. నేను రోజూ నీళ్ల పోస్తున్నాను అంతే! నీకేమన్నా మొక్కలు కావాలా? అక్కడ ఆ కనకాంబరం పూలు చూడు. చాలా పెద్ద పూలొస్తాయి. కావా లంటే రెండు మొక్కలు తీసుకెళు. పీకిస్తానుండు" సహజ మొక్కలకేసి నడవబోయింది. ప్రసాద్ కూడా అప్పుడే లోపల్నించి మొక్కలకేసి వస్తున్నాడు.

"ఒద్దులే ఒద్దులే...పీకకు. ఈ అద్దె ఇళ్ళలో మొక్కలెవరు పెంచుతారు. రేపు ఇల్లు ఖాళీ చెయ్యమంటే అవన్నీ పీక్కుపోవాలి. మేం ఇల్లు కట్టుకున్నాక గాని మంచి తోట పెంచుకోము" అంది రమ సహజనాపేస్తూ.

సహజ అనుకోకుండా ప్రసాద్‌వంక చూసింది. ప్రసాద్ చిన్నగా నవ్వాడు.

"మీ వీధిలోకి రిక్షాలు రావా?" రమ రిక్షా రానిదే కదిలేలా లేదు.

రమ ఇంకేం మాట్లాడుతుందో ఏం వినాలోనని దిగులుపట్టుకుంది సహజకు.

"నేను మెయిన్ రోడ్డుమీదకు వెళ్ళి రిక్షా తెస్తానుండండి" అంటూ బైటికి వెళ్లాడు ప్రసాద్. ప్రసాద్ రిక్షాతో వచ్చే దాక రమ తన సంసారపు సంగతులు చెబుతూనే వుంది. సహజ మళ్ళీ రమని ఇప్పట్లో కలవగూడదని గట్టి నిర్ణయం తీసేసుకుంది.

రమ రిక్షా ఎక్కుతూ - "మీరిద్దరూ ఒక ఆదివారం పొద్దున్నే మా ఇంటికి రండి. ఇంకే టైమైనా మా ఆయన మీకు దొరకడు" అని చెప్పింది.

రిక్షా కదిలి వెళ్ళింది.

"ఆయనింకేం మాట్లాడతాడో" అంది సహజ విసుగ్గా.

ప్రసాద్ పెద్దగా నవ్వుతూ లోపలికి దారి తీశాడు.

"ఎందుకు నవ్వుతున్నావు?" ప్రసాద్ వెనకే లోపలికి వచ్చి అడిగింది సహజ కోపంగా.

"నవ్వకూడదా? నాకు నవ్వొచ్చింది నవ్వాను"



"అదే ఎందుకొచ్చిందీ అని అడుగుతున్నా"

"ఇన్నాళ్ళకు నిన్ను మౌనంలో పడేసిన మనిషిని చూశాను గదా అని. భలే మనిషిలే ఆవిడ" మళ్ళీ పెద్దగా నవ్వాడు ప్రసాద్.

"చాల్లే ఊరుకో.... నా కసలే ఒళ్ళు మండిపోతుంటే"

"ఎందుకు ఒళ్ళు మండటం? నీ జీవితాశయం ఒళ్ళు మండించుకోవటమేనా ఏమిటి?"

ప్రసాద్ పగలబడి నవ్వుతున్నాడు. సహజ కోపం పట్టలేక టేబిల్ మీదున్న పుస్తకం తీసి ప్రసాద్ మీదికి విసిరింది.

"నన్ను కొట్టటం... ఇదింకో జీవితాశయమా?" ప్రసాద్ నవ్వి నవ్వి కళ్ళ నుంచి కారుతున్న నీళ్లు తుడుచుకుంటూ అడిగాడు. నవ్వు మాత్రం ఆగటం లేదు.

"కాదు. అసలుజీవితాశయంవేరేవుంది. నీ నోరు కుట్టెయ్యటం" సహజ విసురుగా లేచి వెళ్ళబోతుంటే ప్రసాద్ చెయ్యి పట్టుకుని ఆపాడు.

"ఏంటోయ్... నీ కోపం. నేను నవ్వానంటావు గానీ మీ స్నేహితురాలు నీ జీవితాశయం ఏమిటని గదమాయించి అడుగుతుంటే నోరు మెదపవేం. నీకేం కావాలో నీకే తెలియదా ఏమిటి! ఎందుకలా నీళ్లనమిలి మీ ఫ్రెండుచేత చిన్నపిల్లలని బిరుదుపొందావు. మొత్తానికి మీ ఫ్రెండు భలేమనిషిలే. నాకు చాలా నచ్చింది"

ప్రసాద్ మళ్ళీ నవ్వు మొదలెట్టబోతుంటే సహజ ప్రసాద్ నోరు మూసేసింది.

"హఠాత్తుగా అడిగేసరికి నాక్కాస్త అయోమయం అనిపించింది. ఆ విషయం గురించి మనం స్పష్టంగా ఎప్పుడన్నా ఆలోచించామా?"

"మరి నీకే స్పష్టతలేని విషయాన్ని గురించి ఆవిడనెందుకడిగావు? ఆవిడ తెలివైందీ, గడుసైందీ కాబట్టి తనను ఆలోచింపచేయాల్సిన ప్రశ్నకు కంగారుపడకుండా, ఏమీ ఆలోచించకుండా నువ్వే నోరు మూసుకునేలాచేసింది. ఇంతకూ నీ జీవితాశయం ఏమిటో నీకు ఇప్పటికైనా తెలిసిందా లేదా?" నవ్వాపుకుంటూ అడిగాడు ప్రసాదు.

"తెలిసిందిలే" ఉక్రోషంగా అంది సహజ.

"ఏమిటది?"

"నీ కేమిటో అది చెప్పు" సహజ ఎదురుప్రశ్న వేసింది.

"ముందు నువ్వు చెప్పు"

"ఎవరు చెబితే ఏం. ముందు నువ్వే చెప్పొచ్చుగా?"

"నువ్వు నా ఆశయాన్ని కాపీకొడితే?"

"అబ్బో... అంతోటి ఆశయం నాకు లేక"

"ఉంటే చెప్పరాదూ?"

"సరే...చెబుతావిను నా జీవితాశయం స్నేహం, ప్రేమ"

"చాలా అస్పష్టంగా అయోమయంగా వుంది. వివరణ కావాలి" టీచర్‌లా పోజు పెట్టాడు ప్రసాద్.

"హూఁ...నీది మట్టిబుర్రని నాకు తెల్సులే. మంచి స్నేహితులతో స్నేహం చెయ్యటం, నిన్ను ప్రేమించటం ఈ రెండు గుణాలూ పెంచుకోటానికి మంచి పుస్తకాలు చదవటం, ప్రపంచమంతా నీతో కలిసి తిరగటం... అంతే" బరువుతీరినట్లు నిట్టూర్చింది సహజ.

"ఆగు...మంచిస్నేహితులతోస్నేహం

చెయ్యటం అన్నావు. మంచి స్నేహితులను ఎట్లా సంపాదిస్తావు! వాళ్ళెక్కడ దొరుకు తారు?"

"నా భావాలవల్లా, ఆ భావాలను బల పరుచుకోటానికి నేనుచేసే ప్రయత్నాల వల్లా ఆ క్రమంలో నాకు నేను మంచి అనుకునే స్నేహితులు దొరుకుతారు" ఈమాత్రం తెలియదా అన్నట్టు నిరసనగా ప్రసాద్‌వంకచూసి ఇంతకుముందు ప్రసాద్ నవ్విన నవ్వుకు పగతీర్చుకుంది సహజ.

"అంటే స్నేహం చెయ్యటానికి పునాది నీ భావాలూ, వాటికోసం నువ్వు చేసే పనులూ... అంతేనా?"

"అంతే" ప్రసాద్ ఎటు లాక్కెళ తాడా అనే అనుమానంతో అన్నది సహజ.

"అయితే నీ జీవితాశయం నీ భావాలు, వాటి కోసం నీవు చేసే పనులే అవుతుంది. ఎందుకంటే స్నేహం భావాల ఆధారంగానేగా జరిగేది"

"నా భావాలే నా జీవితాశయమా! ఇది మరింత అస్పష్టంగాలేదూ?" సహజ తలపట్టుకు కూచుంది.

"ఏమీ అస్పష్టత లేదు. ఉదాహరణకు సంసార జీవితం గురించి నీకు కొన్ని అభిప్రాయాలున్నాయి. మీ స్నేహితుల సంసారాలు నీ అభిప్రాయాల ప్రకారం లేకపోయేసరికి వాళ్ళను మార్చేపని పెట్టుకున్నావు. ఎందుకు నీకాపని? నీకు దగ్గరగావున్న మనుషుల భావాల్నీ, జీవితాన్నీ నీ భావాలకనుగుణంగా మార్చాలనే తపన నీలోవుంది. ఆ ప్రయత్నం చెయ్యకుండా నువ్వుండలేవు. ఆ పనిని నువ్వు స్నేహం అంటున్నావు. మంచిదే... అను. అసలు నీ ప్రయత్నం మాత్రం వాళ్ళను మార్చటం. వాళనే కాదు .... ప్రపంచాన్నంతా నీ భావాల కనుగుణంగా మార్చాలని నీకు లేదూ?"

"అది సాధ్యమా?"

"సాధ్యా సాధ్యాలుకాదు. ప్రపంచ మంతా నీకిష్టమైనట్లు మారాలని నీకు లేదూ? ఈ యుద్ధాలూ, కరువులూ దరిద్రాలూ, దోపిడీలూ- అన్నీ పోయి, అందరూ సంతోషంగా,శాంతిగా ఉండాలని నీకు గాఢంగా అనిపించటంలేదూ?"

"అనిపిస్తోంది"

"మరి అదే నీ జీవితాశయం. ప్రపంచాన్ని మార్చటమే నీ జీవితాశయం. పుస్తకాలు చదివినా, ప్రపంచాన్ని చూసినా స్నేహాలు చేసినా, ప్రేమించినా- ఏం చేసినా అందుకే. ఉన్న ప్రపంచంతో నీకు శాంతి లేదు. ఏ విషయాన్ని గురించి ఆలోచించినా అసంతృప్తే. మార్పు కోసం పాకులాడతావు... అదే నీ జీవితాశయం"

"కానీ దానికోసం నేనేంచేస్తున్నాను?"

"అందుకే మీ ఫ్రెండు అడిగిన ప్రశ్నకు వెంటనే సమాధానం ఇవ్వలేక పోయావు. మనం ఏం చెయ్యగలమో, సమాజానికి మనలోవున్న శక్తి ఎలా ఉపయోగపడుతుందో మనకు తెలియటం లేదు. అది తెలుసుకోవటం కూడా మన ఆశయంలో భాగమే"

"నువ్వూ అంతేనా?" ఆలోచనగా అడిగింది సహజ.

"నువ్వూ నేనూ వేరా?" సహజ చేయి అందుకున్నాడు ప్రసాద్.

సహజ అలాగే ఆలోచిస్తూ కూర్చుంది

"లే...ఆదివారం పూట బుర్రకు మంచిపని పెట్టింది మీ రమ. డాబా మీదికెళ్ళి కాస్త చల్లగాలి పీల్చుకుందాం పద" సహజ చెయ్యి పట్టుకుని

లేవదీశాడు ప్రసాద్.

"ముందు మొహం కడుక్కురానీ" అంటూ లోపలికి వెళ్ళింది సహజ.

ఇద్దరూ డాబామీదకు వెళ్ళారు. వీధిలో చిన్నపిల్లలు ఆడుకుంటున్నారు. వాళ్ళను చూస్తూ నుంచున్నాడు ప్రసాదు.

సహజ "ఏమిటి ఆలోచిస్తున్నావు?" అంటూ పక్కనే నిలబడింది.

"ఆలోచించటం కాదు. సంతోషిస్తు న్నాను. నీ మాటలు జ్ఞాపకం వచ్చాయి" సహజ కళ్ళల్లోకి ప్రేమగా చూస్తూ అన్నాడు.

"ఏ మాటలూ?"

"మీ రమగారితో అన్నావే- పిల్లల్ని కంటానూ అని... ఆ మాటలు"

"ఎందుకు ... నీకు పిల్లలంటే అంత ఇష్టం?"

"నీకు ఇష్టం లేదా?"

"నాకూ ఇష్టమే. కానీ భయం. అంత పెద్ద బాధ్యతను నెత్తికెత్తుకునేప్పుడు ఎంత ఆలోచించాలి?"

"ఆలోచించు నీకు పూర్తిగా ఇష్టమై తేనే! కానీ కనేవరకే నీ ఒక్కదాని బాధ్యత. తర్వాత నేసున్నాను గదా... ఇద్దరం కలిసి ఒక్క పిల్లను పెంచలేమా?"

"అలాగేలే" అంది సహజ నవ్వుతూ.

ప్రసాద్ ముఖం వెలిగిపోయింది.

"నీలాగా ఒక్కపిల్లను కనవా- అని భార్యను బతిమాలే భర్తలింకా వుంటా రంటావా?"

"అసలు భార్యంటూ వున్నది తనకు పిల్లల్ని కంటం కోసమే అనుకుంటారు అందరూ"

"నాకు చాలా అసహ్యం వాళ్ళను చూస్తుంటే. ఆడవాళ్ళ శరీరం తమ హక్కన్నట్లుంటుంది వాళ్ళకు. పిల్లల్ని కనాలో వద్దో నిర్ణయించుకునే స్వేచ్ఛ పూర్తిగా ఆడవాళ్ళకే వుండాలి"

ప్రసాద్ సహజ చెయ్యి పట్టుకుని కింద కూచోబెట్టాడు.

"రమ పిల్లల్ని పెంచటమే జీవిత మంది. నిజంగా ఆ విషయాన్ని నమ్ముతోందా? లేకపోతే ఇంకో మార్గం లేక అదే జీవితమని ఆత్మవంచన చేసుకుం టోందా??"

సహజ మనసులోంచి రమ మాటలు బైటికి పోవటంలేదు.

"రెండింటిలో ఏదైనా కావచ్చు. ఆమె నిజంగానే అదే నమ్ముతుందేమో! సామా న్యంగా ఆడవాళ్ళకు ఇల్లే ప్రపంచమవు తుంది. వాళ్ళ జీవితంలో సాధించాల్సి నవి ఆ ఇంటికి పరిమితమైపోతాయి. వేరే ప్రపంచంతో సంబంధం వుంటేగదా,.. వేరే జీవితం ఉండటానికి. అసలు ఆడా, మగా, సమాజం ఇవన్నీ తీసెయ్. అసలు మనుషులు జీవితంలో ఏం కావాలను కుంటున్నారు? దేనికి విలువ ఇస్తున్నారు? తన వ్యక్తిత్వం, కొన్ని ఆదర్శాలూ.... వీటిని ఎవరూ లెక్క చెయ్యటం లేదు. చాలామంది విలువ ఇచ్చేది ఒక్క డబ్బుకే. మీ రమ ఇంకా నయం. స్త్రీ కావటంవల్లా కొంతైనా మంచిగా వుండటం వల్లా పిల్లలే నా జీవితాశయం అంది. అదే మగవాళ్ళనెవళ్ళనయినా అడుగు... మీ జీవితాశయం ఏమిటని? నూటికి తొంభై తొమ్మిది మంది ఒకటే సమాధానం చెబుతారు - డబ్బు డబ్బు డబ్బు. డబ్బు తప్ప ఇంకో విలువేదీ ప్రపంచంలో కనబడటంలేదు. డబ్బే జీవితం. జీవితాంతం దానికోసమే పరుగు. దానికి అంతమంటూ వుండదు. మనకు



జీవితంలో కావాల్సినవి సాధించు కోటానికి డబ్బు సంపాదిస్తే సుఖం దొరుకుతుందిగానీ డబ్బుకోసమే జీవితం అనుకునేవాళ్ళకు డబ్బువల్ల సుఖంకూడా రాదు"

"ఛీ...పాడు డబ్బు. మనం ఎప్పటికీ డబ్బు సంపాదించవద్దు" సహజ అసహ్య పడింది.

"ఇవాళటి దినపత్రికల్లో రివ్యూలు చేసిన కొత్త పుస్తకాలు కొనాలంటే అయిదువందల రూపాయలు కావాలి"

"అబ్బో..వెక్కిరించావులేగాని..మనం పుస్తకాలు సంపాదిస్తున్నాం. డబ్బు సంపాదించటంలేదోయ్"

"అమ్మయ్య... అర్థమయిందిగదా"

సహజ ప్రసాద్ నెత్తిన ఒక దెబ్బ వేసింది.

* * *

రామారావుని ఇంట్లోంచి బైటికి పంపి 'అమ్మయ్య' అనుకుంది శారద. ఆఫీసు పనిమీద రామారావు వూరెళ్ళాడు. రామారావు ప్రయాణం అంటే శారదకు పెద్ద టెన్షన్. పద్ధతి ప్రకారం అతని బట్టలూ, వస్తువులూ సూట్ కేసులో సర్దటం శారదకు అయిదేళ్ళయినా రానందుకు రామారావుకి కోపం. శారద ఎలా సూట్ కేసు సర్దినా అతనికి నచ్చదు. పోనీ అలాగని అతను సర్దుకోడు. శారదను సాధించి సాధించిగాని ఆ సూట్ కేసుకు తాళం వెయ్యడు. రామారావు తిరిగి వచ్చే దాకా అమ్మ దగ్గరకు వెళదాం అనుకుంది శారద. పిల్లల్ని పొద్దున్నే పంపించింది. రామారావు ప్రయాణమయ్యే హడావుడిలో పిల్లలు కూడావుంటే శారదకిక కాలూ చెయ్యీ ఆడదు. ఆరోజు అమ్మ దగ్గరకు వెళ్ళి మర్నాడు పిల్లలతోసహా సహజ

దగ్గరకు వెళ్ళాలనుకుంది శారద. హడావుడిగా ఇల్లు సర్ది స్నానం చేసేసరికి ఆరవనే అయింది. శారద ఇంటికి తాళం వేస్తుండగా ఉష రిక్షా దిగి వచ్చింది.

"ఎక్కడికే ప్రయాణం?" అంది ఉష.

"అమ్మా వాళ్ళింటికి పోదామని. ఆయన వూరెళ్ళారు. ముందు నువ్వు కూచో. నేను తర్వాత వెళ్తాలే" అంటూ కుర్చీలు తెచ్చి వరండాలో వేసింది శారద.

"పిల్లల్ని కూడా తీసుకురాకూడదూ? అమ్మావాళ్ళ దగ్గర దింపి ఇటు వస్తున్నావా?"

"పిల్లల్ని పక్కింటివాళ్ళకి అప్పగించి వచ్చాలే" అంది ఉష పేపర్ తిరగేస్తూ.

"అదేంటి ... ఇక్కడ ఆడుకునే వారుగా?"

"నీతో మాట్లాడాలి. చాలా సీరియస్ విషయం. పిల్లలుంటే మాట్లాడనివ్వరని తీసుకురాలా" అంది పేపర్ కింద పడేస్తూ.

"ఏమిటే అది?" శారద కాస్త కంగారుపడింది.

"శేషగిరి వేరే పెళ్ళి చేసుకున్నాడు"

"శేషగిరెవరూ... శేషగిరా?ఏమిటీ.." శారద నమ్మలేనట్లుగా చూస్తూ వుండిపోయింది.

ఉష భర్త శేషగిరి. వేరే పెళ్ళి చేసుకున్నాడా? అంత నిబ్బరంగా ఆ కబురు ఉష ఎలా చెబుతోంది? శారదకి ఏమీ తోచలేదు. ఉష శారదనే చూస్తోంది.

"ఏమిటి ఉషా...ఏమిటిది?" అంది ఏం మాట్లాడాలో తెలియని శారద.

"ఏమిటో..నాకు మాత్రం ఏం తెలుసు? మొన్నరాత్రే నాకు తెలిసింది. అతని ఆఫీసులోనే పని చేస్తోందట. సంవత్సరం నుంచీ పరిచయమట. పెళ్ళిచేసుకోక తప్పని పరిస్థితట. ఇవన్నీ మొన్ననే చెప్పాడు. ఇవాళ ఇంకాసేపటికి పెళ్ళి అయిపోతుంది గుడిలో"

"అదేమిటి? నువ్వేలా వూరుకున్నావు? అసలేమన్నావు?" శారదకు దుఃఖం పొంగుకొస్తోంది.

"ఏమంటాను? ఈ సంగతి వినగానే ఏమీ తోచలేదు. కాళ్ళూ చేతులేగాదు... మెదడూ పని చెయ్యలేదు. తర్వాత నెమ్మదిగా కూడదీసుకున్నాను. శేషగిరిని వెళ్ళిపొమ్మన్నాను"

"అంటే"

"అంటే ఏముంది? ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోమన్నాను.విడాకులు తీసుకునే ప్రయత్నం చేస్తానన్నాను"

మామూలుగా చెబుతున్న ఉషను చూస్తుంటే శారదకు మతిపోతోంది.

"నీకేమన్నా పిచ్చెక్కిందా? నీ బతుకు నాశనం చేసుకుంటావా?" శారదకు చాలా ఆవేశంగావుంది. ఏమేమిటో అరిచి చెప్పాలనిపిస్తోంది. ఏదో చెయ్యాలని వుంది. ఏమిటో అర్థం కావటంలేదు.

"పిచ్చి లేదుగాబట్టే అలా అన్నాను. నా బతుకు నాశనం అయిందంటావా? ఏమో... నేనలా అనుకోవటం లేదు. నా బతుకు ఇప్పుడే మొదలయిందనుకుంటున్నాను"

"అంటే ఏమిటి ఉషా! ఏమయిందమ్మా నీకు?" అంటూ ఉష చేతులు పట్టుకుంది శారద. ఎంతో దుఃఖించాల్సిన సమయంలో రాయిలా వుందంటే దానికి పెద్ద షాక్ తగిలివుంటుందనుకుంది. శారద కళ్ళమ్మట నీళ్ళు జలజలారాలాయి. ఉషే వాటిని తుడిచింది.

"ఏంటోయ్... అంత ఆవేశపడిపోతున్నావు.ఇంతవరకూ ఎవరి బతుకునో

నేను బతికాను, ఎవరి ఇష్టాల కనుగుణం గానో బతికాను. ఇప్పుడు నిజంగా నా బతుకు నేను బతుకుదామనుకుంటున్నా" ఉష చెప్పుకుపోతోంది. కళ్ళు వింతగా మెరుస్తున్నాయి.

"శేషగిరిని పెళ్ళిలోనే చూశాను. అందగాడు, చదువు, మంచి వుద్యోగం, నన్ను వుద్యోగంచెయ్యనిచ్చే సంస్కారం వున్నాయి. నా అదృష్టం అనుకున్నాను. అతన్నే నా లోకం చేసుకోవాలను కున్నాను. క్రమంగా అతని బలహీనత లన్నీ తెలిశాయి. అతని విలువలకూ, నా విలువలకూ ఏమీ సంబంధం లేదని స్పష్టంగా తెలిసింది. అన్నీ సహించాను. ఇతనికి మంచి విలువలుంటే బాగుండు ననుకున్నానే గాని... అతనికి నా జీవితంలో ఇచ్చిన స్థానాన్నుంచి తప్పించాలనుకో లేదు. అతని స్థానం అతనిదే. పొద్దున్నే లేచి కాఫీ కలుపుతుంటే అతనికెక్కడ డికాక్షన్ ఎక్కువ తక్కువ అవుతుందో అనీ, కూర తరుగుతుంటే పెద్ద ముక్కలు అతనికి నచ్చవే అనీ, ఉల్లిపాయ సన్నగా తరక్కపోతే తినడే అనీ, అన్నం బిరుసైతే వదిలేస్తాడే అనీ అతని గురించే ఆలోచనలు. కాలర్ వెనక మురికి సరిగా పోకపోతే చికాకు పడతాడే అని ఆఫీసునుంచి వచ్చాక నేనే వుతికేదాన్ని.

"ప్రతి విషయంలోనూ అతనికే ప్రాముఖ్యత... నా వునికీ, నా ఇష్టం ఇవేవీ లేకుండా చేసుకున్నాను. నేను అనేదాన్ని ఒకదాన్ని వున్నానని మరిచిపోయాను. మొన్న శేషగిరే జ్ఞాపకం చేశాడు- నేనొకదాన్ని వున్నాననీ,నేను బతకాలనీ"

హఠాత్తుగా ఆగింది ఉష. చాలా సేపు ఇద్దరూ నిశ్శబ్దంగా కూచున్నారు. ఉష మానసిక స్థితేమిటో శారదకు అర్థం కాలేదు. సహజంగా లేదేమో అనిపించింది. ఏం మాట్లాడాలో తోచలేదు. సామాన్యంగా ఈ పరిస్థితిలో ఉష బాధపడు తుంటే శారద ఓదార్చాలి. ఉషలో ఆ బాధ కనిపించటంలేదు శారదకు. పైగా శారదనే ఓదారుస్తోంది. ఇది సహజంకాదు. ఈ స్థితినుంచి ఉషను బైటపడెయ్యాలను కుంది శారద. శేషగిరిని తిడితే?

"దుర్మార్గుడు. ఎంత పనిచేశాడు. మంచిగా వుండేవాడు... మేకవన్నె పులి అన్నమాట"

ఉష నవ్వింది. శారదకు భయం వేసింది.

"ఎందుకతన్ని తిడతావు? వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారట. ప్రేమించటం తప్పవుతుందా?"

"ఇప్పుడా ప్రేమ? ఇద్దరు పిల్లలు. రత్నంలాంటి భార్య. ఇప్పుడు ప్రేమ కావాల్సొచ్చిందా?"

"ఇప్పటిదాకా ప్రేమ దొరకలేదేమో! పోనియ్..అతని గొడవెందుకు ఇప్పుడు?"

శారదకు ఉషమీద పట్టరాని కోపం వచ్చింది.

"మరి ఏం గొడవ కావాలిప్పుడు? ఎందుకొచ్చావు నా దగ్గరికి? నీకసలు శేషగిరంటే ప్రేమలేదా? నీ వరస చూస్తుంటే అతను వేరే పెళ్ళిచేసుకున్నం దుకు సంతోషిస్తున్నట్లున్నావు"

"ప్రేమా?నాకు తెలియదు.నాకు బాధ్యత తెలుసు, వినయం తెలుసు, ఒక పద్ధతికి అలవాటుపడటం తెలుసు. వీటి మూలానే ఇన్నాళ్ళూ నా జీవితం శేషగిరితో గడిచి పోయింది. అతని బాధ్యతలన్నీ స్వీకరిం చటం, అతని కోరికలకు తల వొగ్గటం, అతనికి అలవాటవటం- వీటన్నిటినీ కలిపి

ప్రేమ అంటారేమో....నాకు తెలియదు. కానీ ప్రేమంటే ఇదేనా? నాన్న ఈ శేషగిరిని కాకుండా ఇంకో మధుసూదనుడిని చూస్తే అతనికీ ఇట్లాగే అలవాటయ్యేదాన్నే గదూ· సరేలే.... నేనొచ్చింది నీకీ విషయం చెప్పటానికే! రేపింకెవరో చెబితే నీ పరిస్థితి ఎలా వుంటుంది? నన్ను ఎలా పలకరించాలా, నా ముఖం ఎలా చూడాలా అని తెగ బాధపడేదానివి. ఆ బాధ తప్పించాను"

ఇది అసహజం, అవాస్తవం, అసత్యం అని శారద మనసు ఆక్రోశిస్తోంది. కానీ ఎదురుగా ఉష మామూలుగా కూచుని వుంది. ఎక్కడో ఏదో లోపం వుంది. అదేమిటో శారదకర్థం కావటం లేదు.

"సహజ దగ్గరకు వెళ్దామా?" అన్నది శారద.

''నేను ఇప్పుడు అక్కడినుంచే వచ్చాను. వాళ్ళు లేరు!బజారుకెళ్ళారేమో... ఇక వెళ్తానే. పిల్లలు ఎదురుచూస్తుంటారు" అంటూ లేచింది ఉష·

"ఇప్పుడు నన్నొంటరిగా వదిలి వెళతావా? రాత్రంతా నిద్రపట్టక ఒక్కతినే... వుండు నేనుకూడా వస్తాను" శారద లేచింది.

"అమ్మ దగ్గరకు వెళ్తానన్నావుగా?"

"ఫరవాలేదులే...రేపు వెళ్తాను" శారద త్వరత్వరగా కిటికీలు,తలుపులు వేసేసింది.

ఉష ఒక్కత్తే వుండటం మంచిది కాదు. ఏ అఘాయిత్యమన్నా చెయ్య గలదు. పాపం ... పిచ్చిదయిపోయింది. ఎవరన్నా తోడుగా వుండాలి. రేపు వాళ్ళమ్మ దగ్గరకు ఉషను పంపిగాని తాను ఇంటికి వెళ్ళగూడదు. అసలు వాళ్ళకు తెలిస్తే పూరుకుంటారా? ఈ సంగతి శేషగిరి చెప్పగానే అతన్ని గదిలో పెట్టి తాళం వేసి అమ్మా నాన్నల్ని, అన్నయ్యనూ పిలిపిస్తే సరిపోయేది. తన్ని తలకిపోసి మరీ చేసేవారు పెళ్ళి. ఇదింత తెలివితక్కువది అయిందేం? ఉషావాళ్ళిల్లు చేరేదాకా ఇద్దరూ మాట్లాడకుండా ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు. పిల్లలు వాకిట్లోకే ఎదురొచ్చారు. వాళ్ళను చూస్తే మళ్ళీ దుఃఖం పొంగి వచ్చింది శారదకు.

"కాసేపు పిల్లలతో కాలక్షేపం చెయ్యి శారదా! బియ్యం కడిగి పెడతాను. కూరలు పొద్దునవే వున్నాయి" అంటూ ఉష వంటింట్లోకి నడిచింది·

ఉష కొడుకులు శరత్, రవీలు శారద దగ్గర చేరారు. శరత్ చందమామ తెచ్చి 'కథలు చదువత్తా' అని కూచున్నాడు. శారద మనసెక్కడో పెట్టి చందమామ కథలన్నీ చదివేసరికి అన్నం ఉడకటం, ఉష అన్నంకలిపి పిల్లలకు తినిపించటం కూడా పూర్తయింది. వాళ్లు నిద్రకళ్ళతో వెళ్ళి మంచాలమీద పడుకుని నిద్ర పోయారు.

"మనం కూడా అన్నం తిందాం..రా" అని లేచింది ఉష. అన్నం, రెండు కూరలూ, గిన్నెలో చారుతో మామూలు గానే వంటచేసింది. మామూలుగానే తింటోంది కూడా అనుకుంది శారద, శారదకు ముద్ద మింగుడు పడటం కష్టంగా వుంది.

"ఎలా తినగలుగుతున్నావే అంత మామూలుగా" అన్నది ఆపుకోలేక. అన్నాక ఎందుకన్నానా అని నాలుక కొరుక్కుంది.

"అంటే ... తిండీ నీళ్ళూ మానేసి ఏడుస్తూ కూచోమంటావా? అతను వేరే పెళ్ళిచేసుకున్నాడని నేను అన్నం నీళ్లూ





మానేసి కుమిలి చచ్చిపోవాలా?"

"ఉషా...ఊరుకోవే!" అంది శారద.

ఉషకిది చాలా బాధ అని శారదెంత గాఢంగా నమ్ముతోందంటే ఆ నమ్మకంతో ఉషని చాలా హింసిస్తోంది.

ఉష గిన్నెలన్నీ సర్దేసింది. ఇద్దరూ మంచాలమీదకు చేరారు.

"మరిప్పుడేం ఆలోచిస్తున్నావే?" అంది శారద.

ఇప్పుడామె కాస్త తేరుకుంది.

"ఆలోచించటానికేముంది? ఉద్యోగం, పిల్లలూ"

"పిల్లల్ని ఇవ్వమనడుగదా?"

"సామాన్యంగా ఇవ్వమనడు. ఒకవేళ అంటే తీసుకోమంటాను"

"అదేమిటి?" శారద కంగారుపడింది

"అదంతే శారదా ... ఆ పిల్లల్ని అతనెలాగూ చూడడు. సామాన్యంగా అడగడు. అడిగితే నేను విడాకులంటున్నాననే పంతంకొద్దీ అడగాలి. అప్పుడు నేనేదో బలహీనంగా కనపడటం నాకిష్టం లేదు. రెండురోజుల్లో నా పిల్లలు నా దగ్గరకు వచ్చేస్తారు" ఆత్మవిశ్వాసం వుంది ఉష గొంతులో.

"రెండురోజుల్లో కాకున్నా రెండేళ్లలో శేషగిరి కూడా వస్తాడేమో. విడాకులన్న మాట ఎందుకన్నావే?"

"రెండేళ్ళకు అతనొస్తాడో రాడో, అతనొచ్చినా నేను రానిచ్చే స్థితిలో వుంటానో వుండనో అవన్నీ ఎందుకు? ఇప్పుడింకా అతని భార్యగా వుండటం నాకు అవమానంకదూ? నా ఆత్మగౌరవం నేను కాపాడుకోవాలంటే విడాకులిచ్చి తీరాల్సిందే. నేనతని భార్యగా వుండటం లేదని అందరికీ తెలియాల్సిందే" పట్టుదలగా అంది ఉష.

"నిన్ను చూస్తుంటే ఆశ్చర్యంగావుంది ఉషా... ఏమీ అనుకోకు. నిజంగా నీకు బాధగాలేదా? ఒంటరిగా జీవితమంతా గడపటమంటేభయంగాలేదా? నిన్నిలాంటి సమస్యలోపడేసి వెళ్లిన శేషగిరిమీద కోపంలేదా? నిన్ను ఈ విషయాలన్నీ అడిగి బాధపెట్టటం క్రూరత్వమే. కానీ అడగకుండా వుండలేకపోతున్నానే"

శారద చేతిని తన చేతిలోకి తీసుకుని ప్రేమగా నొక్కింది ఉష. ఉష కంటి చివరలనుంచి కన్నీళ్లు దిండుమీదపడటం బెడ్‌లైటు వెలుగులో కనిపించాక శారదకు సగం దిగులు తగ్గింది.

"అమ్మయ్య ... గడ్డకట్టిన మంచు కరుగుతోంది" అనుకుంది. చాలా సేపు ఉషేమీ మాట్లాడలేదు.

"బాధ కలగకుండా వుండదు శారదా మనింట్లో అలవాటైన కుక్కపిల్ల కనపడకపోతేనే ఎలాగో వుంటుందే మన స్వంతం అనుకున్న మనిషి వేరైపోతే బాధ ఎందుకుండదు? కానీ బాధపడి చేయగలిగింది ఏముంది? సమస్య వచ్చినప్పుడు పరిష్కరించుకోవాలిగానీ బాధపడుతూ కూచుంటే ఎలా? జీవితం అంటే భర్త ఒక్కడేనా? ఇన్నాళ్ళూ అతనే జీవితం అనుకున్నాను. కానీ ఇవాళ అతను లేకపోయినా నా జీవితం వుంది. నన్నేం చేసుకోబోతున్నావని నా జీవితం నన్ను సవాలుచేస్తోంది. ఆసవాలు నెదుర్కోవాలనిపిస్తోంది. భర్తలేనంత మాత్రాన ఆడదాని జీవితం అర్థరహితం కాదని నిరూపించాలనిపిస్తోంది. ఒంటరితనం అంటావా... పిల్లలులేరూ! మనం మన బతుకు గడపగలమోయ్. ఆలోచిస్తే మగాడే ఒంటరి జీవితం గడపలేడు. మనం బైటపనులు చూసుకోగలం ఇంట్లో



పనులు చేసుకోగలం. ఒంటరితనం అంత బాధిస్తుందనుకోను. ఇన్నాళ్లూ నేను ఒంటరిగానే వున్నాననే విషయం నీకు తెలియకపోవటంవల్ల కొత్తగా ఇవాళ నేను ఒంటరినయ్యాననుకుంటున్నావు. అతని ప్రపంచం నా ప్రపంచం ఎప్పుడూ వేరుగానే వున్నాయి. అతన్నే నా ప్రపంచం చేసుకోవాలని ప్రయత్నించా ననుకో. అది ఫలించలేదు. అందుకే నాకు విపరీతమైన బాధ కలగటంలేదనుకుంటా. కాకపోతే సెక్స్...."

శారద ఉష నోరు మూసేసింది. చెప్పగలిగే స్థితిలో ఉష వుందేమోగాని వినగలిగే స్థితిలో శారదలేదు. ప్రాణ స్నేహితురాలి కష్టాన్ని హేతుబద్ధంగా శాస్త్రీయంగా చూడగలిగేశక్తి శారదకు లేదు.

"సరే. నిద్రపో" అని ఉష అటు తిరిగి పడుకుంది.




అమ్మో ... ఇల్లు తాళం తియ్యాలంటే భయంగావుంది ఆ దుమ్ము, బూజూ దులుపుకునే సరికి నాలుగు రోజుల ఆనందం ఆవిరై పూరుకుంటుంది. ఇక వంట చేసేదెప్పుడు? తినేదెప్పుడు? ప్లీజ్.. ఇవాళ్టికి హోటల్లో తిందాం"

ఇంటి తాళం తియ్యకుండానే సహజ మారాం మొదలుపెట్టింది.

"నేను ఇల్లు దులుపుకుని వంట చేసుకుని హాయిగా తింటాను. నువ్వు ఏ మురికి హోటల్లో తింటావో నాకనవసరం" సహజ చేతుల్లోంచి తాళం చెవి తీసుకుని తాళం తీశాడు ప్రసాద్.

"నాక్కూడా కాస్త పెట్టవూ?" దీనంగా అడిగింది సహజ.

"నేను పెట్టను. కష్టపడందే కడుపు నిండదు... నిండకూడదు"

"మరి హోటల్లో నిండుతోందిగా"

"నువ్విచ్చే డబ్బులియ్యావా? ఆ డబ్బులు కష్టపడి సంపాదించినవికావా?"

"ఆ కష్టం పడగలను. డబ్బు సంపాదించగలను. వంట కష్టం పడలేకుంటా ఉన్నాను. పోనీ ఆ డబ్బేదో నీకే ఇస్తాను. ఇంత వండి పడెయ్యి. నాకు రుచులు కూడా అక్కర్లేదు"

ప్రసాద్ మాట్లాడటం ప్రమాదమని గ్రహించి చీపురు కోసం వెతకటంమొదలు పెట్టాడు.

సహజ వంటింట్లోకి వెళ్ళి దుమ్ముపడిన గిన్నెలూ, గాసులూ, ప్లేట్లూ సింకులో పడేసి తోమటానికి సిద్ధపడుతోంది.

"ఆంటీ...మీ ఇంటికి ఎవరో ఇంకో ఆంటీ వచ్చి ఈ చీటీ ఇచ్చి వెళ్ళింది"

పక్కింటి పాప రమ్య వచ్చి ఉత్తరం ఇచ్చింది. సహజ తడి చేతులన్నా తుడుచుకోకుండా హడావుడిగా ఉత్తరం విప్పింది. శారద రాసింది 'సాజీ...నేను ఇవాళ మీ ఇంటికి వచ్చాను. మీరు లేరు. పక్కింటివాళ్ళ నడిగితే మీరు ఊరెళ్లారనీ ఎప్పుడొస్తారో తెలియదనీ చెప్పారు. మీరెప్పుడొచ్చినా రాగానే ఉష దగ్గరకు వెళ్ళు. ఉష భర్త శేషగిరి వేరే పెళ్ళి చేసుకున్నాడు. ఉష విడాకుల




కోసం అడుగుతోంది. నాకేం చెయ్యాలో తోచటంలేదు. నువ్వయితే ఉషకు అండగా ఉండగలవు. నాకలా వుండే శక్తి లేదని నీకు తెలుసు. నువ్వీ ఉత్తరం చూడగానే ఉష దగ్గరకు వెళ్లు...శారద'

సహజ బాత్‌రూంలోకి వెళ్ళి మొహం కడుక్కుని బట్టలు మార్చుకుంటుంటే ప్రసాద్ ఆశ్చర్యపోయాడు.

"తొమ్మిదింటికే హోటల్లో అన్నం పెట్టరు. నేనూ వస్తాలే పన్నెండింటికి వెళదాం" అన్నాడు నవ్వుతూ. సహజ శారద ఉత్తరం ప్రసాద్ కిచ్చింది. ఉత్తరం చదివి,

"అరే...వెళ్లు త్వరగా" అన్నాడు ప్రసాద్. "ఉష ధైర్యంగానే వుంది గదూ. విడాకులకోసంఅడుగుతోంది.ఆఅమ్మాయి నాదిలి నా దగ్గరకు రమ్మని ఏడవకుండా, నన్ను కూడా ఏలుకోమని దేబిరించ కుండా"

"కొందరు పరిస్థితులొచ్చి నెత్తిమీద కూర్చున్నప్పుడుగాని తెలివి తెచ్చుకోరు. మీ ఉష అలాంటిదే. కొందరు పరిస్థితు లొచ్చి పీక పిసుకుతున్నాసరే అలాగే చచ్చిపోతారుగాని బైటపడరు. ఉష అలాంటి మనిషి కానట్లుంది. నువ్వు మీ ఉషకు బాగా ధైర్యం చెప్పు"

"అలాగే...నువ్వు నిజంగానేహోటల్ కెళ్ళిరా! ఒక్కడివే ఇబ్బంది పడకు" అంది సహజ.

"నా తిప్పలు నేపడతాలే. నువ్వు మీ ఫ్రెండ్ విషయం చూడు" అన్నాడు ప్రసాద్. సహజ హడావుడిగా బైటి కెళ్ళింది.

"ఉషా....ఉషా" అన్న పిలుపు వింటూనే ఉష సహజకు ఎదురొచ్చింది.

సహజకు వెంటనే ఏం మాట్లాడాలో తెలియక ఉష చేయి అందుకొంది.

"నేనూ ప్రసాదూ ఊర్నించి ఇవాళే గంట క్రితమే వచ్చాం. రాగానే శారద నిన్ను కలవమంటూ రాసిన ఉత్తరం చూసి ఇటొచ్చాను. ఇవాళ ఆఫీసుకెళ్ళ లేదేం? నాకు మధ్యలో గుర్తొచ్చింది... నువ్వు ఆఫీసుకెళ్లొచ్చని. అయినా వచ్చె య్యటం మంచిదే అయింది"

"ఈ వారమంతా ఆఫీసుకి సెలవు పెట్టానే. ఇవాల్టితో శలవు అయిపోయింది. సోమవారం నుంచీ వెళతాను"

"ఎందుకన్ని రోజులు శలవు పెట్టావు"

"అమ్మా, నాన్న,అన్నయ్యా ఇక్కడి కొచ్చి కూచుని నాచేత శలవు పెట్టిం చారు నాతో మాట్లాడాలని" అంది ఉష రాని నవ్వు తెచ్చుకుంటూ.

"ఏరీ...ఎవరూ కనబడరేం?" సహజ లోపలకు చూసింది.

"నిన్న రాత్రే వెళ్లారు...నా మీద కోపంతో"

"కోపమేమిటీ....ఎందుకు?"

"శేషగిరికి విడాకులిస్తానన్నానని వాళ్ళకు కోపం" ఉష గొంతులో అసహనం.

"అతను వేరే పెళ్ళిచేసుకున్నాడుగా! ఇంకేమిటీ... అతనిమీదుండాలిగాని నీమీదెందుకు కోపం?" సహజ ఆశ్చర్య పోయింది.

"అతను మగాడు. ఏదో బలహీన పడ్డాడు. తప్పు తెలుసుకున్నాడు. క్షమించమంటారు"

"శేషగిరి తప్పు చేశానని ఒప్పు కున్నాడా? మరి ఆ అమ్మాయినే గంగలో దింపుతాడట" సహజ కోపంగా అడిగింది.

"అసలు విషయం చెబుతానుండు

సాజీ! నాన్నా వాళ్ళు శేషగిరిని పిలిపించి గట్టిగా మాట్లాడేసరికి బెదిరిపోయాడు. తాను బలహీనపడ్డాననీ, ఇపుడు పశ్చాత్తాపపడుతున్నాననీ,నాకూ పిల్లలకూ అన్యాయం చెయ్యననీ, నాతో కూడా సంసారం చేస్తాననీ దొంగ ఏడుపులు ఏడ్చాడు. అది చూసి 'అతనితో కలిసి వుండు. విడాకులొద్దు పాడూవొద్దు' అంటారు అమ్మా నాన్నలు"

"ఎంత ఘోరం" సహజ కోపం పట్టలేకపోయింది.

"ఘోరమేమిటి...నీచం, అసహ్యం. నాకు తల్చుకుంటేనే కంపరమెత్తుతోంది. అతను వేరే పెళ్ళిచేసుకున్నందుకు కోపం రాలేదుగానీ ఈ మాటలన్నందుకు అతన్ని చంపాలన్నంత కోపం వచ్చింది. అతనలా అనటం ఒక అసహ్యం అయితే అమ్మా నాన్నలు దానికే ఒప్పుకోమంటారు సాజీ! నాలుగైదు రోజుల్నించీ వాళ్ళు నన్ను హింసించినంతగా శేషగిరి కూడా హింసించలేదు"

"ఏమంటారు?" సహజ చిరాకు పడింది.

"అతనితో కలిసి వుండమంటారు. ఏడుస్తారు. విడాకులన్నావంటే నే చచ్చి పోతానంటుంది అమ్మ. నా ఆత్మగౌరవం సంగతి వాళ్ళకు అర్థం కావటంలేదే. కూతుర్ని మొగుడొదిలేశాడు అని లోకం చెప్పుకునే మాటొకటే వాళ్ళ కళ్ళ ముందు కనిపిస్తోంది. దానికి తట్టుకోలేక నానాగొడవా చేశారు. నేను చచ్చినా పీడా వదులుతుందన్నట్లు మాట్లాడారే! నేనేం చేశానే సాజీ...ఇందులో నా తప్పే మిటే? ఇంకెవరితోనో సంసారం చేస్తున్న వాడిని నా భర్తగా అంగీకరించి అతన్తో ఎట్లా జీవితం గడపనే? నేను చచ్చినా పోతానుగాని ఆ పని చెయ్యలేను"

ఉష ఇన్నాళ్ళ ధైర్యాన్నీ, పట్టుదలనూ వదిలి దుఃఖాన్నాశ్రయించింది. సహజ ఒళ్ళో తలపెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

శారద దగ్గరగానీ, తల్లిదండ్రుల దగ్గర గానీ కన్నీటిబొట్టు పైకి రానివ్వని ఉష సహజ దగ్గర గుండెలవిసేలా ఏడ్చి విశ్రాంతి పొందింది. సహజకు మాత్రమే తన దుఃఖాన్నీ, కష్టాన్నీ సరిగా అర్థం చేసుకోగల సామర్థ్యం వుందని ఉష నమ్మకం.

సహజ నిశ్శబ్దంగా ఉష తల నిమురుతూ కూచుంది. క్రమంగా ఉష దుఃఖావేశం తగ్గింది. లేచి మొహం కడుక్కుని వచ్చి కూచుంది.

"ఉషా...ఇప్పుడసలు విషయాలన్నీ చెప్పు" అంది సహజ.

"ఏం చెప్పమంటావు?"

"నీకూ శేషగిరికీ మధ్యవున్న అగాథం గురించి. శేషగిరి ఎందుకు అట్లా చేశాడు. శేషగిరిమీద నీకెందుకు కోపం రాలేదు? మీ విషయమంతా మొదట్నించీ చెప్పు ఉషా! చెబితే నేనేదో చేస్తాననికాదు...అదంతా ఒకసారి నాతో చెబితే నీకు ఇంకాస్త ధైర్యంగా వుంటుంది. నువ్వు తీసుకున్న నిర్ణయం సరైందేననే నమ్మకం గట్టిపడుతుంది. ఆ నమ్మకాన్ని నీకు కలిగించటమే ఒక స్నేహితురాలిగా నేను చేయవలసింది. అందుకే పూర్తిగా చెప్పు. ఇవాళ నీ బరువంతా దించుకో"

"సాజీ ... ప్రేమకథలు ఎన్నో చదివాను గానీ ప్రేమించి పెళ్ళిచేసుకోవా లనే ఆలోచన నాకు రాలేదే! అది అసాధ్యం అని మనసులో నాకే తెలియ నంత గట్టిగా అభిప్రాయం ఏర్పడి




వుందేమో తెలియదు. నా పెళ్ళి నాన్న చేస్తారు. అందులో ఇక ఆలోచించ టానికేమీ లేదన్నట్లు డిగ్రీ పూర్తికాగానే పెళ్ళికోసం ఎదురుచూస్తూ కూచున్నాను. పెళ్ళికంటే ముందు అనుకోకుండా ఉద్యోగం దొరికింది. శేషగిరిని చూసి నేను ఇష్టపడ్డాను. అందంగా వుంటాడు. చదువు, మంచి వుద్యోగం. నేను ఉద్యోగం మానెయ్యనవసరంలేదన్నాడు. మనస్ఫూర్తిగా అతని జీవితంలోకివెళ్ళాను. అయితే క్రమంగా అతనూ, నేనూ మానసికంగా ఎక్కడా కలవమని అర్థమై పోయింది. అతనికి సినిమాల పిచ్చి. సినిమాల్లోని దరిద్రపు పాటల పిచ్చి. డిటెక్టివ్ పుస్తకాల పిచ్చి. మంచి సిని మాలు తలనొప్పి. మంచి పాటలు విసుగు. మంచి పుస్తకం పట్టుకుంటే నిద్రొస్తుంది. ఏ విషయమూ సింపుల్ గావుంటే నచ్చదు. విపరీతమైన ఆడంబరంగా హంగూ ఆర్భాటాలతో వుండాలి. నాకిష్టమైనవంటే ఎగతాళి. నేను అదంతా సహించాను. సహించటం నేర్చుకున్నాను. అవన్నీ నన్ను చెయ్యమని బలవంత పెట్టటంలేదు చాలనుకున్నాను. క్రమంగా అతనంటే మొదటి రోజుల్లో నాకున్న ప్రేమ పోయింది. ఈ సంసారం ఒక అలవాటుగా మారింది. ఆ అలవాటులో కూడా అతనికి ఏ కష్టమూ కలగకుండానే చూశాను. అతనూ, పిల్లలూ వీళ్ళకు ఏ లోటూ లేకుండా చెయ్యటమే నా జీవితాశయం అయింది. పొద్దున్నే హడావుడిగా పనులు చేసుకోవటం, ఆ హడావుడిలోనే అతని పనులు చెయ్యటం, పిల్లల్ని స్కూలుకి, ట్యూషన్‌కి పంపటం. నేను ఆఫీసుకి పరిగెత్తటం. మళ్ళీ



సాయంత్రం రాగానే పిల్లలూ, వాళ్ళ పనీ. అతను ఏ రోజూ రాత్రి పదింటికి కాని రాడు. అతనొచ్చేదాకా ఏ పుస్తకమో చదువుకుంటూ పడుకుని అతనొచ్చాక ఆ సినిమా కబుర్లు వింటూ తిండితిని పడుకోవటం... ఇదే నా జీవితం. మంచి పుస్తకాలు చదివినపుడు ఇదే జీవితం కాదని ఏదో అసంతృప్తి బయలు దేరేది. దాన్ని బలవంతాన అణిచేదాన్ని. అతనితో విపరీతమైన గొడవలేవీ లేవు గదా అని సర్ది చెప్పుకునేదాన్ని. నేను సర్దుకోగలిగానుగానీ శేషగిరి సర్దుకోలేక పోయాడు"

"అదేమిటి?" అప్రయత్నంగా అడిగింది సహజ.

"మరి శేషగిరి వేరే పెళ్ళెందుకు చేసుకున్నాడు? అతని ఆఫీసులో పరిచయమైన ఆ అమ్మాయి చాలా మోడ్రన్‌గా వుంటుంది. హిందీ, ఇంగ్లీషు, తెలుగూ అనే బేధం లేకుండా అన్ని సినిమాలూ సరదాగా చూస్తుంది. దరిద్రపు పుస్తకాలన్నీ చదువుతుంది. ఆ విషయాలన్నీ వాళ్లు కలిసి ఆనందించారు.ఆ ఆనందంలో వాళ్ళిద్దరూ ఒకటయ్యారు. మంచివో చెడ్డవో వాళ్ళిద్దరి అభిరుచులూ ఒకటయ్యాయి. నాకు ఖచ్చితంగా అతని అభిరుచులు చౌకబారువనీ, నావి విలువైనవనీ తెలుసు. కానీ వాటికోసం నేనేమీ చెయ్యలేదు. వాటిని నాలాగా అభిమానించే వాళ్ళకోసం వెతకలేదు. వాటిని పెంచి పోషించుకోలేదు. అతనివెంత చౌకబారు భావాలయినా వాటికోసం తపనపడ్డాడు. వాటిని పంచుకోగలిగే మనిషికోసం వెతికాడు. సాధించాడు. నేనేం చేశాను? నా జీవితమంతా ఒంటరిగా వెలితిగా గడపటానికి సిద్ధపడ్డాను. ఇవాళ నన్ను చూసుకుంటే నాకే సిగ్గేస్తోంది.నేను చదివిన మంచి పుస్తకాలవల్ల నాకేం తెలిసింది? నేనేం నేర్చుకున్నాను? చలాన్ని చదివి ఆహా అనుకుంటే ఏం లాభం? నా మెప్పుకోసం రాశాడా చలం. ఈ జ్ఞానోదయం శేషగిరి ఆ పెళ్ళిచేసుకుంటేగాని నాకు కలగలేదనే విషయం నాకు చాలా అవమానంగా అనిపిస్తోంది. శేషగిరిలో నాకు నచ్చని విషయాన్ని ఎందుకు భరించాను? ఎందుకతన్ని ఒదిలెయ్యలేదు? అతను నన్ను ఒదిలేసేదాకా ఎందుకు పాకులాడాను? ఈ విషయాలు ఆలోచిస్తే నామీద నాకే కోపంగా వుంది. ఇంకా ఇప్పుడు కూడా విడాకులు తీసుకోకుండా అతని భార్యగా గుర్తింపబడటం అంటే నాకు చాలా అసహ్యం. అందుకే ఎవరెన్ని అన్నా, అమ్మా నాన్నలెంత బాధపడినా నేను విడాకులు తీసుకుంటున్నాను. శేషగిరినుంచి విడిపోతాననుకుంటే నాకు చాలా రిలీఫ్‌గా వుంది. జీవితంమీద కొత్త ఆశ, ఉత్సాహం వస్తున్నాయి. నన్నెవ్వరూ అర్థంచేసుకోవటంలేదు సాజీ! నీకు నేను అర్థమవుతానని నా నమ్మకం. ఇవాళ ఇంకా వివరంగా ఏం చెప్పను? నా ఫీలింగ్స్ నీకు అర్థమయితే చాలు. వివరాలన్నీ ఎందుకు"

"ఇంకేం చెప్పొద్దు ఉషా...నాకంతా అర్థమయింది. నువ్వు ఆలస్యంగానయినా ఒక దరిద్రంలోంచి బయటపడ్డావు. ఇక లోకంసంగతి ఆలోచించటం మానేసి నీ సంగతి నువ్వు ఆలోచించుకో. నీ ధైర్యం చూస్తే నాకు చాలా సంతోషంగా వుంది. ఆ ధైర్యాన్ని కోల్పోకు. నీకు ఒంటరిగా అనిపిస్తే మా ఇంటికొచ్చెయ్...పిల్లలంటే ప్రసాద్‌కి చాలా ఇష్టం. మీ పిల్లల్ని బాగా ఆడిస్తాడు"





"అలాగే వస్తానుగానీ ప్రసాద్‌కి పిల్లలంటే అంత ఇష్టమయితే నువ్వు పిల్లల్ని కననంటావేం" ఉష తన విషయాలనుంచి బయటపడి మామూలయ్యే ప్రయత్నం చేస్తోంది.

"పిల్లల పెంపకంలోనే నా జీవితం తెల్లారుతుందనే భయంతో. 'ఒక్క అమ్మాయిని కను. నేనే పెంచుకుంటాను' అని బతిమాల్తాడు ప్రసాద్. తను తన కూతుర్ని నాకన్నా మంచిగా పెంచి మా నాన్నకంటే మంచి నాన్నవుతానంటాడు. మా నాన్నకంటే మంచి నాన్న వుండగూడదని ఆలోచిస్తున్నాను"

"చాల్లే కబుర్లు. ఒకమ్మాయిని కను. నాకూ ఆడపిల్లలంటే చాలా ఇష్టం"

తనకిద్దరూ మగపిల్లలేనని ఉషకు దిగులు.

"ఉషా...నేను వెళ్ళనా?"

"అప్పుడే...పోనీ భోజనంచేసి వెళ్దువు కాని ఒంటిగంటవుతోంది"

"ఔను. అన్నం తిని వెళ్ళటమే మంచిది. ప్రసాద్ హోటల్లో తినివుంటాడు. పాపం నన్ను హోటల్లో మురికితిండి తినమన్నాడు. తనే తినాల్సొచ్చింది. నేను కమ్మగా నీ చేతివంట తింటున్నాను"

"ప్రసాద్‌గారిని కూడా తీసుకురాక పొయ్యావా?"

"ప్రసాదుంటే నువ్వు ఫ్రీగా మాట్లాడవేమోనని తీసుకురాలేదే. ఉషా...నువ్వు ప్రసాద్‌ని కూడా మంచి స్నేహితుడిగా చూడు. పాపం ప్రసాద్ మంచివాడేలే" నవ్వింది సహజ.

"నీకంతా హాస్యం. అతని విలువ నీకు తెలియటంలేదు" సహజను కోప్పడింది ఉష.

"సరేలే. నువ్వూ, ప్రసాదూ స్నేహితులై నామీద దండెత్తుతారా? నువ్వెప్పుడూ నన్నే సపోర్టుచేస్తానని ముందు ఒట్టెయ్యి"

ఉష హాయిగా నవ్వింది.

ఉష ఎప్పుడూ ఇలా నవ్వుతూనే వుండాలి. జీవితంలో ఏదో కోల్పోయానని ఎప్పుడూ అనుకోకూడదు. ఉష ధైర్యాన్నీ, ఉత్సాహాన్నీ పెంచగలిగితే మా స్నేహం సార్థకమైనట్లే అనుకుంది సహజ.



## 8

"అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయము స్థాపించునాడు" అని పాడుతూ బస్సు దిగాడు ప్రసాద్.

"బహుశః మనం అప్పట్నించీ ప్రయత్నం మొదలెట్టేవుంటాం అమరావతి రావాలని. చివరకు ఇవాళ కుదిరింది" అంది ఉష.

అందరూ నవ్వారు.

ప్రసాద్, శారద, ఉషలతో కలిసి అమరావతి వెళ్ళాలని రెండు నెలలుగా సహజ ప్రయత్నిస్తోంది. ఒకరికి కుదిరితే ఇంకొకరికి కుదిరేదికాదు. రామారావు ఊళ్ళో వుండకూడదు...వుంటే శారదని ఒద్దంటాడు. దానివల్లేఇంత ఆలస్యమైంది. ముఖ్యంగా ఈ ప్రోగ్రాం ఉష కోసమని సహజ ఆలోచించింది. ఉష ఒంటరిగా దిగులుగా వుండకూడదనీ, నవ్వుతూ నవ్విస్తూ పెళ్ళికాకముందు ఎలా వుండేదో

అలా వుంచాలనీ, అప్పటి జీవనోత్సాహం ఉషలో మళ్లీ తీసుకురావాలనీ సహజ ప్రయత్నం. ఈ ప్రయత్నంలో భాగం గానే అమరావతి వెళ్లే ప్రోగ్రాం ఏర్పాటుచేసింది. అందరికీ వీలుకుదిరి వాళ్ళు అమరావతిలో అడుగు పెట్టేసరికి గొప్ప ప్రయత్నమేదో ఫలించినట్లయింది. నలుగురిలోనూ అమరావతిని మొదటి సారి చూస్తున్న వాడు ప్రసాదే. ముగ్గురు స్నేహితులూ చదువుకునే రోజుల్లో అమరావతి చాలాసార్లే వచ్చారు.

నలుగురు పిల్లలూ ముందు నడుస్తుంటే వెనకాల సంచులూ, టిఫిన్లూ పట్టుకుని పెద్దవాళ్ళు నడిచారు.

"ముందు గుడికి వెళదాం'' అంది సహజ.

"నీకు భక్తి ఎప్పట్నించీ" అన్నాడు ప్రసాద్.

''గుళ్లో దేవుడు తప్ప ఇంకేమీ వుండవా?''

''మిగిలినవి ఏమున్నా అందరూ దేవుడి కోసమేగదా వెళ్లేది"

"సహజ అందర్లాటిది కాదుగదా! సహజ అమరావతి గుడికి మాత్రం పున్నాగ పూలచెట్లకింద కూర్చోటానికి వెళుంది" అంది ఉష.

"మీరు అమరావతి ఎన్నిసార్లు వచ్చి వుంటారు?" అనడిగాడు ప్రసాద్.

''అబ్బో...చాలాసార్లు. మాస్కూల్లో ఒకమ్మాయివాళ్ళకి అమరావతి బస్సు వుండేది. అప్పటికి ఆర్.టి.సి రాలేదులే. మూడునెలలకోసారి ఆ బస్సులో మా స్కూలుపిల్లలందర్నీ అమరావతి తీసు కొచ్చేవారు. మాఅందరి దగ్గరా పిక్నిక్ కని డబ్బు వసూలు చేసేవారు. మా ఫ్రెండువాళ్ళకు ఒక్క పైసా ఇవ్వకుండా వాళ్ల బస్సులో అమరావతి తీసుకొచ్చే వారు''

"పాపం...ఒకసారి మంగళగిరి తీసు కెళ్ళార్లేవే" అంది శారద సానుభూతితో.

"సరేలే జన్మానికో శివరాత్రి. అయినా మన స్కూల్ మీద నాకేం కోపంలేదే. వాళ్ళన్నిసార్లు తీసుకురాకపోతేఅమరావతి అందాలు మనకెలా తెలిసేవి?"

సహజకు పున్నాగపూల వాసన చూస్తూనే గొప్ప ఉత్సాహం వచ్చేసింది.

అందరూ గుడివెనకగా వున్న పున్నాగ చెట్టుకిందికి చేరారు. పిల్లలు పున్నాగ పూలు ఏరటంలోపడ్డారు. వాళ్ళతోపాటు సహజ ఎవరు ఎక్కువ పూలు ఏరతారోననే పందెంపెట్టి మరీ ఏరుతోంది.

ఉష,శారద, ప్రసాద్ కారియర్ విప్పి పులిహోరను విస్తరాకుల్లో సర్దారు.

"ఇకరండి,టిఫిన్ తిని మళ్ళీ ఏరదాం" అంటూ పరిగెత్తుకొచ్చింది సహజ.

"ఏం చేస్తావు ఆ పూలన్నీ" ప్రసాద్ కుతూహలం.

"ఇవన్నీ జడగా అల్లాలి"

"అల్లి మీ జడలకుతగిలించుకుంటారా ఏం ఖర్మ?"

"ఛీ! నీకసలు సౌందర్య దృష్టిలేదు. ఆలోచన అసలే లేదు. మనం కాసేపట్లో నది ఒడ్డుకి వెళతాం. ఆ నదిలో ఈ పూల జడలు ఒదిలితే అవి నెమ్మదిగా నీళ్ళతో బాటు కదిలి వెళుతుంటే ఎంత బాగుంటుందనీ.ఏమైనా అమరావతి అందాలు మా జిల్లా వాళ్ళవి. మీకు సముద్రాల హోష తప్ప నదుల సౌందర్యం తెలియదు" అని ప్రసాద్‌ని చివాట్లేసింది సహజ.

"ఇంకా నయం- నదుల సౌందర్యమంతా మా సముద్రంలోనేగా కలిసేది" అన్నాడు ప్రసాద్ పౌరుషంగా.





అయ్యో ... సముద్రం సంగతెందు కెత్తానా అని విచారించింది సహజ.

అందరూ నది ఒడ్డుకి వెళ్ళారు. పిల్లలు పున్నాగపూల జడలు నదిలో వదిలి చప్పట్లు కొట్టారు. సూర్యకిరణాలు పడి తళతళా మెరుస్తున్న నీళ్ళతో తెల్లటి పున్నాగపూల జడలు వెన్నెల హారాల్లాగా కదిలిపోయాయి. అవి కనపడి నంతసేపూ వాటివంకే చూస్తుండిపోయా రందరూ.

ప్రసాద్ పిల్లలతో ఆడుతుంటే ముగ్గురూ రావిచెట్టుకింద చేరారు.

"రామారావుతో చెప్పావా ఇలా వస్తున్నానని" అంది సహజ.

"చెప్పలా. నిన్న అతను ఊరెళ్ళే ప్పుడు చెబుదామనుకున్నానుగానీ ఘర్షణ పడాలి.ఆ ఘర్షణ తర్వాత నాకు ఇక్కడికి రావాలనిపించదు. అతనికి తెలియదుగదా- అతను రేపు తెల్లవారుఝామునగానిరాడు. మనం సాయంత్రానికి వెళ్ళిపోతాంగా"

"పిల్లలు చెప్పరూ?"

శారద మొహం పాలిపోయింది.

"చెప్పొద్దంటాను. అసలు పిల్లలతో ఆయన పెద్దగా మాట్లాడరు"

"నువ్వన్నీ పొరపాటుగానే ఆలోచిస్తున్నావే. నువ్విక్కడికి రావటానికి అతని పర్మిషన్ అక్కర్లేదు. అందుచేత వచ్చే ప్పుడు చెప్పకపోయినా ఫరవాలేదు. కానీ పిల్లల్ని చెప్పొద్దనటం, మనం చేసిన పని తప్పన్న ఊహ పిల్లల్లో కలిగించటం తప్పుగదూ. అతనొచ్చాక నువ్వే చెప్పు- శనివారం అమరావతిలో ఆనందంగా గడిపానని. ఏం చేస్తాడో చూడు. నువ్వు కాస్త చురుగ్గా వుంటే అతను కాస్త తగ్గుతాడు. అసలు నువ్వే అలుసిచ్చి వుంటావు"

"నీకు తెలియదు సాజీ... పెళ్ళయిన మొదటిరోజునుంచే అతని స్వభావం నాకు అర్థంకావటం మొదలయింది. పెళ్ళిలో ఎవరితో ఏమీ మాట్లాడలా. ఒక గది తనకోసం శుభ్రంగా వుంచుకుని అందులో ఉండిపోయేవాడు. పెళ్ళయిన కొత్తలో పగలు నాతో ఒక్కమాట మాట్లాడేవాడు కాదు" శారద హఠాత్తుగా ఆగింది.

"మరి మీ అమ్మావాళ్ళేమంటారు?"

"వాళ్ళకాయన దేవుడు" నిరసనగా అంది శారద.

"అదేంటి?" సహజ ఆశ్చర్యపోయింది.

"వాళ్ళనవి పెట్టమనీ ఇవి పెట్టమనీ సాధించడు. డబ్బు ఖర్చు చెయ్యడు. ఏ దురలవాట్లూ లేవు. పెదవి విప్పి మాట్లాడడు. నోట్లో నాలుకలేనివాడు వాళ్ల దృష్టిలో. ఇంట్లో అంతా పద్ధతిగా వుంటే అతనికి ప్రశాంతంగా వుంటుంది. మౌనంగా ఆఫీసు పనో, పేపరు చదువు కోవటమో చేస్తుంటాడు. లేదా నిద్ర పోతాడు. ఆ మౌనం, ఆ నిద్రా, ఆ పద్ధతులూ నన్నెంత హింసిస్తున్నాయో వాళ్లకర్థంకాదు. ఆయన పద్ధతులకు చిన్న ఆటంకం ఏర్పడితే ఆయనెలా మండి పడతాడో వాళ్ళకు తెలియదు. ఆ ఆటంకాలురాకుండా చూడడం నాకలవాటై పోయింది"

శారద గొంతులో జీవం లేదు.

"నిన్ను బొమ్మలు వెయ్యవద్దంటున్నా దని వాళ్లకు తెలియదూ?"

"తెలుసు. అతనికిష్టంలేనపుడు మానెయ్యాలమ్మా అంటుంది అమ్మ. నాన్న వుంటే నా బాధ అర్థం చేసుకునే వారేమో. నా బాధ చూడకూడదన్నట్లు నా పెళ్ళయిన ఆర్నెల్లకే ఆయన పోయారు" శారద గొంతు విషాద

మయింది.

ఉష ఇక ఆ సంగతి ఆపమన్నట్లు సైగ చేసింది. సహజ మాట మార్చేసింది.

"సరేలే లేవండి. మ్యూజియమూ, బౌద్ధస్తూపమూ చూద్దాం. మళ్ళీ పిల్లలు ఆకలంటారు" నది ఒడ్డున ఇసకలో ఆడుతున్న పిల్లల్ని తీసుకుని కదిలారు.

మ్యూజియం చూసి బౌద్ధస్తూపం దగ్గరకు వెళుతూనే పక్కనేవున్న పారిజాతం చెట్టుదగ్గరకు పరిగెత్తింది సహజ.

"దోసెడు పారిజాతాలతో హృదయేశ్వరి డాసినభంగి' అని కవిగారు రాయటానికి ఈ చెట్టే ఇన్‌స్పిరేషన్. అసలు పుష్పవిలాపం రాయటానికి కూడా ఈ పారిజాతమే కారణం అని నా ఉద్దేశం"

"కొయ్-కొయ్" అన్నాడు ప్రసాద్.

తర్వాత గెస్ట్‌హవుస్‌కి వచ్చి కారియర్లు విప్పి భోజనాలు ముగించారు.

పిల్లలు చెట్లకింద ఆడుతున్నారు.

ప్రసాద్ భుక్తాయాసంతో దుప్పటిపరిచి పడుకున్నాడు.

"అప్పుడే రెండయింది. మూడింటికంతా నదిఒడ్డుకెళ్ళి తొందరగా రావాలి. కనీసం 5 గంటలకు బస్సెక్కగలిగితే బాగుండును. ఒకోసారి ఆయన రాత్రికే వచ్చేస్తారు" అంది శారద ఆందోళనగా.

"అలాగే వెళదాంలేగాని రామారావుతో మాత్రం చెప్పు. అసలేమవుతుందో చూద్దాం. నువ్వింతవరకూ రూల్సుని పాటించటమేగాని వుల్లంఘించలేదుగదా! చూద్దాం యేమవుతుందో" అంది సహజ.

"మొన్న మీ ఇంటికి వచ్చేముందు శారద ఏమందో తెలుసా సాజీ" ఉష చెప్పబోతుంటే-

"ఛీ-ఊరుకోవే" అని కసిరింది శారద.

"అప్పటికి ఇరవైరోజులైంది శారద కనపడి. నువ్వూ అన్నావుగదా శారదేం చేస్తోందే చాలా రోజులయింది కనపడి అని, నేనువెళ్ళి ఏమిటే కనపడటంలేదు అంటే 'కనపడను' అంది"

"అదేంటి?" సహజ చురుగ్గాచూసింది శారదవైపు.

"తన గొడవలతో మనల్ని బాధపెట్టడం ఇష్టంలేదట. మన స్నేహంచేసే అర్హత తనకు లేదట. మీ ఇళ్ళకు రావాలంటే నాకు చాలా సిగ్గేస్తుందే" అంది.

సహజ లేచి శారద పక్కనే కూచుని శారద చెయ్యి పట్టుకుంది.

"నేనారోజు దయ్యాలతో స్నేహం చెయ్యనన్నానని బాధపడ్డావా. శారదా.. నాక్కాస్త కోపం, తొందరపాటూ ఎక్కువని తెలుసుగదా. నేను ఏ మాటలని నిన్ను బాధ పెడుతున్నానో. సారీనే. నిజంగా నీ జీవితం బాగుండాలనే నే కోరుకునేది. నన్నర్థం చేసుకోవూ?"

"సాజీ! నీ సంగతి నాకు తెలియదూ? నువ్వేదో అన్నావని కాదు. నాకే అనిపించింది. మీరిద్దరూ జీవితాన్ని జీవిస్తున్నారు. నేను జీవచ్ఛవంలా వున్నాను. జీవంలేని నాతో స్నేహం మీకు విసుగు పుట్టొచ్చు" శారద సెమ్మదిగా అంది.

"శారదా! ప్లీజ్...నీ విషయాలేవీ నేను మాట్లాడను. నువ్వలా ఆలోచించకు. ఎవరి సమస్యలు వాళ్ళకుంటాయి. ఎవరికి చాతనైన పద్ధతిలో వాళ్ళు పరిష్కరించుకుంటారు. ఒకరినొకరు గొప్పగానో తక్కువగానో చూడనవసరంలేదు. నువ్వలా ఫీలైతే నాకు చాలా బాధగా వుంటుందే శారదా" అంది సహజ.

"శారదా! స్నేహం ఎప్పుడూ మనకు





ధైర్యాన్నివ్వాలి. నేనివాళ ఇంత ధైర్యంగా వున్నానంటే మీ ఇద్దరివల్లే. ఆఫీసులో, ఇంటిదగ్గరా నన్నెలా చూస్తున్నారో తెలుసా? నేను లేనప్పుడల్లా నా గురించే మాట్లాడుకుంటున్నారు. వాళ్ళకు నావైపు నుంచి విషయాలేవీ తెలియవు. నన్నడగరు. మొగుడిని వదిలేశాననే దృష్టి తప్ప ఇంకోటిలేదు. నా టేబిల్ ఎదురుగా కూచుంటుందే...ఆవిడ మొన్న నన్నూ ప్రసాద్‌ని బజార్లో చూసింది. అనుకోకుండా ప్రసాద్‌గారు బజార్లో కనిపిస్తే ఇంటిదాకా కలిసి నడిచొచ్చాం.ఆ మర్నాడు ఆఫీసులో ఆవిడ నాతో పలకలా. నేను మాట్లాడించబోతే చాలా నిర్లక్ష్యంగా సమాధానం ఇచ్చింది. తర్వాత ఇక నేనూ మాట్లాడించలేదనుకో. కానీ ఆవిడ చూపులు-నన్నో పురుగులా చూస్తుందే"

"ఆవిడెవరే, నిజంగా నువ్వు మొగుణ్ని ఒదిలేసినా లేక ఇంకొకరితో తిరుగుతున్నా అది నీ సమస్యే కదా...ఆవిడకెందుకు కోపం"

"నా అవినీతిని అసహ్యించుకుంటేనే గదా ఆవిడ నీతి స్థిరపడేది"

"అంటే సంఘబాధ్యతంతా సక్రమంగా నిర్వహించి తృప్తి పడుతోందన్నమాట. ఎవరి బాధలు వాళ్ళకుంటాయిలే అనుకోవచ్చుగా. నువ్వు సంఘ విద్రోహమైన పనులో, నలుగురినీ నష్టపెట్టి నువ్వు బాగుపడే పనులో చెయ్యటంలేదుగదా? అలాంటివాళ్ళతో ఆవిడెంకెలావుంటుందో? బహుశా బాగానే వుంటుందేమో"

"ఆవిడకవసరం వుంటే ఎవరితోనన్నా బాగానే వుంటుంది. ఆ గోలెందుకులే- ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే ఈ రోజు లోకం నన్నవమానిస్తోందని నిజంగా కుమిలి పోవటానికి నాకెంత అవకాశమైనా వుంది. మీరిద్దరూ లేకపోతే కుమిలిపోయేదాన్ని కూడా. మీరు నిజమైన విలువలు తెలిసినవాళ్ళు నన్ను గౌరవిస్తున్నారు. సంఘం గురించి భయపడకుండా జీవించే ధైర్యం ఇస్తున్నారు. మీ స్నేహం నాకు బలమైన టానిక్‌లా పనిచేస్తోంది. మరి శారదకి మన స్నేహం అలా లేదే. మన స్నేహం మానేస్తే బాగుండునని తనెందుకనుకుంటోంది అన్నది నాప్రశ్న" ఆగింది ఉష.

"నువ్వు కోలుకోటానికి సిద్ధంగా వున్నావు. టానిక్ పనిచేస్తోంది. నేను కోలుకోటానికి సిద్ధంగా లేను సరిగదా చావటానికి సిద్ధంగా వున్నా. నా జబ్బు మిమ్మల్ని కూడా బాధ పెడుతుందని నా భయం" శారద కాస్త తీవ్రంగా అంది. సహజ ఏదో అనబోతుంటే ఉష వారించి-

"అన్నీ తెలిసిన నీకు మేం ఏం చెప్పగలం? నిజంగానే కోలుకోవాలా లేదా అన్నది నిర్ణయించుకోవాల్సింది నువ్వే" అంది.

ముగ్గురూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు మునిగిపోయారు. పిల్లలు చెట్లచాటున దాక్కుంటూ దాగుడుమూతలాడుతున్నారు. వాళ్ళ అరుపులూ నవ్వులూ వింటుంటే శారదకు తన బాల్యం గుర్తొచ్చింది. ఎందుకిలా అయిపోయింది జీవితం అనుకుంది.

ఉష ఆ నిశ్శబ్దాన్ని భరించలేకపోయింది. సహజ వంక చూస్తూ...

"సాజీ...నువ్వు అదృష్టవంతురాలివి అంటుంది శారద. నువ్వు అదృష్టవంతురాలివి కాదని నా అభిప్రాయం కాదుగానీ... ఇందులో అదృష్టంకంటే ఇంకేదో ఉందనిపిస్తోంది. నీ ధైర్యం, నీ తెలివే నీ జీవితం చక్కగా వుండటానికి

కారణాలని నేనంటే శారద ఒప్పుకోలేదు. మనం చదువుకునే రోజుల్లో సహజంకంటే తెలివితక్కువవాళ్ళమనో, ధైర్యం తక్కువవాళ్ళమనో అనుకున్నామా? ఇప్పుడు తన అదృష్టంకొద్దీ మంచి మొగుడు దొరికాడు. మన కర్మ ఇలా కాలింది అంది. దాని మాటలు సరికాదని నాకు తెలిసింది గానీ దానికేం సమాధానం చెప్పాలో, అసలు కారణమేంటో నాకూ సరిగా తెలియటంలేదు సాజీ-"

"అదృష్టం కాదు తెలివీ కాదు. మన జీవిత విధానం మనకు అవకాశాలు లేకుండా చేస్తోంది ఉషా! మనం మూడేళ్ళు కాలేజీలో చదివాం. కాలేజీ, ఇల్లూ, లేదా మన స్నేహితుల ఇళ్ళూ, సినిమా హాళ్ళూ—ఇవి తప్ప మనకేమన్నా తెలుసా? పుస్తకాలు చదవటం తప్ప మనకేమన్నా తెలుసా? పుస్తకాలు చదవటం తప్ప సమాజంతో మనకేమన్నా సంబంధం వుందా? మన క్లాసులో కూడా మన నలుగురం ఒక కట్ట... ఇంకో అయిదారుగురితో మాట్లాడేవాళ్ళమేమో. అబ్బాయిలతో అసలు మాట్లాడే ప్రసక్తే లేదు. వాళ్ళు కోతి వేషాలేగాని మనతో మర్యాదగా మాట్లాడేవారు కాదనుకో. ఇంతెందుకు—మనం మూడేళ్ళలో ఒక్కసారన్నా మన మార్కుల లిస్టు కోసం బాంక్‌లో చలానా మనం కట్టుకున్నామా? బాంక్‌కెళ్ళి ఏం చెయ్యాలో, బాంక్‌లో ఏం పనులు జరుగుతాయో నాకు ఉద్యోగంలో చేరినాక గాని తెలియలేదు. పరీక్షలు రాసి పాసయ్యాం. నాకు ఉద్యోగం అవసరం గనకా, నాన్న నాకు కట్నం ఇచ్చి పెళ్ళిచెయ్యలేదు గనకా వైజాగ్‌లో ఉద్యోగందొరకగానే వెళ్ళాను. మీరు పెళ్ళి గురించి పెద్దాళ్ళు ఆలోచిస్తే అదే మంచిదనుకున్నారు. పెళ్ళి అంటే ఏమిటో ఎన్ని పుస్తకాల్లో చదివినా మీకు తెలియలేదు... తెలియదు కూడా. ఇంట్లో మీ అమ్మానాన్నల మధ్య కాస్త మంచి వాతావరణం వుంది. ఆ ఇల్లు తప్ప మీకు ప్రపంచం తెలియదు. అలాంటి ఇంకో ఇల్లు మీకు దొరుకుతుందనుకున్నారు. ఇంట్లో మీకు సంఘంతో సంబంధమున్న పనులన్నీ నాన్నో, అన్నయ్యో చేసి పెట్టినట్లే, ఆ పనులన్నీ చేస్తూ మిమ్మల్ని ప్రేమించటానికి ఇంకొకడొస్తాడని ఎదురుచూశారు. అదెంత బాధ్యతా రాహిత్యం. మీ జీవితాన్ని ఇతరుల చేతుల్లో పెట్టేసి కూచున్నారు. నేనూ అలా కూచునేదాన్నేమో-ఉద్యోగం చేసే అవసరమూ, వైజాగ్‌లో ఉద్యోగమూ లేకపోతే. వైజాగ్‌లో నేనొక్కదాన్నీ ఇండిపెండెంట్‌గా బతకాల్సి వచ్చేసరికి సమాజంతో నా పరిచయం పెరిగింది. మా యూనియన్లో చేరా. ఆడవాళ్ళెవరూ ఆ యూనియన్ మీటింగులకి వచ్చేవారు కాదు. ఆఫీసు అవగానే ఇంటికి పరిగెత్తేవారు. నాకు ఇంటిదగ్గర ఏపనీ లేకపోవటానా, విషయాలు తెలుసుకుందామనే ఆసక్తి వుండటంవల్లా యూనియన్లో చురుగ్గా వున్నా. మా ఆఫీసులో ఒకాయన నా ఆసక్తి గమనించి తనకు తెల్సిన యూనివర్సిటీ ప్రొఫెసరెవరో స్టడీ సర్కిల్ నడుపుతున్నారని చెప్పాడు. ఆ మీటింగులకి వెళ్ళేదాన్ని. అట్లా చాలామందితో పరిచయాలు పెరిగాయి. ఎన్నో విషయాలు తెలిశాయి. ఎక్కడ ఏ సాహిత్యసభ జరిగినా పరిగెత్తేదాన్ని. మీరెవరన్నా వెళ్ళారా అలాంటి మీటింగులకి?"

"వెళ్ళలేదుగానీ, వెళితే ఏవయ్యేదే?





మా జీవితం ఆ మీటింగులతో మారిపోయేదా?" అంది శారద సిరసనగా.

"నే చెప్పేది నీ బుర్రకెక్కటంలా రకరకాల మనుషులు, మనలాంటి భావాలున్న వాళ్ళూ మనకు పరిచయమవుతారు. జీవితపరిధి విస్తరిస్తుంది. నీకిష్టమైన భావాలకోసం నువ్వు ఏదో చేస్తున్నావనే తృప్తివస్తుంది"

"ఏమో...నాకేం నమ్మకంలేదు"

"నువ్వసలు చూడకుండానే నమ్మకం లేదంటావేం! ఈరోజు నాకు మీరే కాక విశాఖలో చాలామంది మంచి స్నేహితులు వున్నారు. గుంటూర్లో కూడా నేనారకంగా జీవితం గడిపితే, ఇక్కడ కూడా చాలా మంది స్నేహితులుండేవారు. మీకూ అంతే! మీ జీవితం మీ చేతుల్లో వుందనే విషయమన్నా తెలిసేది. నే మీలాగా ఇంట్లోనే కూచుంటే ఇప్పటికీ నాకు ప్రపంచంతో సంబంధం వుండేదికాదు. మనకు – ఆడాళ్ళకు సోషల్‌లైఫ్ లేదే మొద్దూ ! ఆ సామాజిక జీవితం వున్నప్పుడే మన జీవితం విలువ గురించి ఆలోచిస్తాం. నాకు ప్రసాద్ ఆ మీటింగులో కలవటం యాక్సిడెంటేమోగాని మీటింగుల్లోనే కలవటం యాక్సిడెంటు కాదు. అతనివీ నావీ ఒకే భావాలు. నాలాంటి భావాలున్న వ్యక్తులు నాకెక్కడ దొరుకుతారు. ఇంట్లో కూచుంటే దొరకరుగదా. అలాంటి భావాలు కలబోసుకునే చోటే ఒకరికొకరు తారసపడే అవకాశం వుంది. ఒకటి మన జీవితంగురించి మనం ఆలోచించుకోవాలి. రెండు మనం అవకాశాల కోసం, మనకావల్సినవి సాధించుకోవటం కోసం ఇంటినొదిలి ప్రపంచంలో పడాలి. ఇల్లూ, కాలేజీ, ఆఫీసూ, మహా అయితే పక్కిల్లూ – ఈ మూడిటితోనే



గుడిగుడి గుంజం ఆడుతూ నా ఖర్మ అనుకుంటే ఎట్లా? నేను అదృష్టాన్ని నమ్మను. మీకంటే తెలివిగలదాన్ననో, ధైర్యం గలదాన్ననో నేననుకోను. మీరు మీ జీవితాన్ని అనాలోచితంగా పెద్దల చేతుల్లో పెట్టి ఇంట్లోనే కూచున్నారు. నాకు బైటికెళ్ళి ప్రపంచాన్ని చూసే అవకాశం, నా జీవితాన్ని నేనే నిర్మించుకునే అవకాశం వచ్చింది. వచ్చిన అవకాశాన్ని బాగా వినియోగించుకున్నాను. అంతే! ఏమన్నా బుర్రకెక్కిందా?" సహజ గొంతుపెంచి అడిగింది.

"ఎక్కినట్లే వుంది" అంది ఉష.

"ఎక్కకపోతే చెప్పు. ఆ బుర్ర పగలగొట్టి అందులో ఈ మాటలన్నీ పోసి మళ్ళీ కుట్టేస్తా"

"తల్లీ...అంత పనొద్దు. ఎక్కింది ఎక్కింది" నెత్తిన చేతులు పెట్టుకుంది ఉష.

"కానీ ఏంలాభం? ఇప్పటికే ఆలస్యమై పోయింది'' అంది శారద ఉష చేతులు దించుతూ.

''ఏం ఫరవాలా! నీకో కూతురుందిగా. ఆ అమ్మాయినన్నా కాస్త తన కాళ్ళమీద తాను నిలబడి తన బుర్రతో తాను ఆలోచించేదానిగా పెంచు. కాలేజీ అవగానే ఇంటికి రాలేదనీ, ఆలస్యం ఎందుకయిందనీ సతాయించి చంపకు"

"నాకు కూతురు కూడా లేదుగా?" అంది ఉష నవ్వుతూ.

"నీకసలు ఆలస్యం సమస్యే లేదు. నే చెప్పిన మాటలన్నీ నీకు ఉపయోగ పడతాయనే, నీక్కావాల్సిన వాడికోసం నువ్వు చూడాలనే నేనిదంతా చెబుతున్నది" అంది సహజ నవ్వుతూ.

"అర్థం లేకుండా మాట్లాడతావు సాజీ! నోటికి ఏదొస్తే అది" శారద కంగారుగా విసుక్కుంది. ఉష మాత్రం మౌనంగా వుంది. తన మాటలకు ఉష కంగారుపడనందుకూ, వ్యతిరేకత చూపనందుకూ సహజ లోపల్లోపల సంతోషించింది. టైము చూసుకుని ప్రసాద్‌ని నిద్రలేపింది. పిల్లల్ని పిల్చి బిస్కట్లు పెట్టి, ముఖాలు కడిగి తలలు దువ్వింది. అందరూ ముఖాలు కడుక్కుని నదీ తీరానికి వెళ్లారు.

చల్లటి గాలికి అందరి మనసులూ సేదతీరాయి. ప్రసాద్ పడవొకటి మాట్లాడి వచ్చాడు. పిల్లల్ని జాగ్రత్తగా ఎక్కించి ప్రసాద్ ఎక్కాడు. సహజ, ఉష, శారద కలిసి మెలిసి కష్టపడి పడవ ఎక్కారు.

"పడవ ఎక్కటం చాతకాదు. జీవిత నావల్ని ఏం నడుపుకుంటాం" అని శారద గొణిగింది – సహజకు వినిపించకుండా ఉషతో.

"మీరు కాలేజీరోజుల్లో పడవ ఎక్కినపుడు ఏం జరిగిందో చెప్పటం లేదేమిటి!?" ప్రసాద్ హాస్యంగా అన్నాడు.

ముగ్గురూ మనస్ఫూర్తిగా నవ్వారు.

"రమ ఉంటే పాటలు పాడేదేమో! మేం పడవ ఎక్కినప్పుడల్లా రమ పాటలు పాడేది. ముందు 'మనసున మల్లెల మాలలూగెనే' పాడేది. తర్వాత 'ఆపలేనే ఎంకి ఈ పడవ యిసురు' పాడేది. తర్వాత శ్రోతలు కోరిన పాటలు ఎన్నయినా పాడేది. పాడనని మాత్రం అనేదికాదు" అంది ఉష.

"మీ రమగారిలా కాకపోయినా మనం కూడా పాటలు పాడుకోవచ్చుగదా"

ప్రసాద్ అన్న మాటకు ఉష, శారద – "మీరుపాడతారా?" అన్నారు ఆశ్చర్యంగా.

"నేను పాడతాను సరే...మీరు పాడరా




అనేది నా ప్రశ్న"

"మేమా...సరేలెండి. సహజ సంగతి మీకు తెలిసే వుంటుంది. మేమిద్దరం కూడా అంతే! ఏమీ తేడాలేదు. సాజీ! మన స్కూల్లో సంగీతపు క్లాసు గురించి ప్రసాద్‌గారికి చెప్పలేదా?" శారద అడిగింది. సహజ నవ్వింది.

"మీ ఫ్రెండ్ నాకేం చెప్పదండీ! ఏంచేశారు..పాపం మీ సంగీతం టీచర్ని" సహజవైపు చెప్పొద్దన్నట్లు సైగచేస్తూ అన్నాడు ప్రసాద్.

ఆ సంగతి సహజ ప్రసాద్‌కి చెప్పింది. కానీ శారద ఉత్సాహంగా మాట్లాడుతుంటే ఆపవద్దని ప్రసాద్ పొడిగించాడు.

"మేం ఆయన్నేం చెయ్యలేదండీ! నోరు మెదపకుండా కూచునేవాళ్ళం. మిగతా టీచర్లందరూ నోరు మెదిపితే తిడతారా.. ఈయన మెదపనందుకు తిట్టేవాడు. శబ్దం రాకుండా మెదపటం నేర్చుకున్నాం కష్టపడి. కానీ మూణ్నెల్లకోసారి పరీక్ష వుండేది. ఇంకా నయంకదే నెలనెలా లేదు. ఆ పరీక్షరోజు మా ముగ్గుర్నీ తెగ బతిమాలేవాడు పాడమని. మేం భీష్మించుకుని కూచునేవాళ్ళం. 'జనగణమన' పాడండి. పోనీ ముగ్గురూ కలిసి పాడండి. తలా ముప్పైఅయిదు మార్కులూ వేస్తాను— అని ఆశపెట్టేవాడు. మేం మాత్రం లొంగేవాళ్ళంకాదు. చివరకు చక్కగా సున్నా పెట్టేవాడు. అలాంటి మేము ఇక్కడ...ఈ నది మీద ఈ పడవలో పాడటం"

పెద్దగా నవ్వింది శారద. ఉష, సహజ శృతి కలిపారు.

"మీ ముగ్గురి నవ్వే పాటలా వుంది. ఇక పాటెలా వుంటుందో?" అన్నాడు ప్రసాద్.

"ఏడుపులా వుంటుంది" ఉష టక్కున అంది.

"మమ్మీ పాడుతుంది" అన్నాడు ఉష కొడుకు శరత్.

"రహస్యం బైటపడింది. చూశావా సాజీ! మీ ఫ్రెండ్ గురించి నీకు తెలియని విషయాలున్నాయి" అన్నాడు ప్రసాద్.

"పిచ్చినాన్నా! దాన్ని పాడటం అనర్రా. చదవటం అంటారు" అంది ఉష కొడుకుని ముద్దుపెట్టుకుంటూ.

"ఎప్పుడన్నా వైతాళికుల్లో పాటలు పిల్లలకు చదివి వినిపిస్తుంటాలెండి! అదే పాడటం అనుకుంటున్నాడు వీడు. మా సంగతి తీసేసి మీరు పాడండి ముందు"

"పాడవోయ్...ఒడ్డు వచ్చేస్తోంది. పడవలో ఒక్కపాటన్నా పాడి మా ట్రెడిషన్ నిలబెట్టు" సహజ కూడా అడిగింది.

ప్రసాద్ బతిమాలించుకోకుండానే నేను కూడా మీ రకంగాదు పాడే పడవ పాటే పాడతానంటూ 'ఆపలేనే ఎంకి ఈ పడవ ఇసుకు' పాడాడు.

అవతలి ఒడ్డు వచ్చింది.

"చాలా బాగా పాడారండీ! సహజా... ఎప్పుడూ చెప్పలేదేం — ప్రసాద్‌గారింత బాగా పాడతారని" అంది ఉష.

సహజ నవ్వి ఊరుకుంది.

"ఆవిడకు కుళ్ళెండి..నే పాడతానని" అన్నాడు ప్రసాద్.

"ఔను. అందుకే కష్టపడి నీకు తెలుగు పాటలు నేర్పాను" అంది సహజ.

పిల్లలు పడవ దిగగానే ఇసుకలో పరుగు మొదలెట్టారు. పెద్దాళ్ళు వాళ్ళ వెనకపడ్డారు.

అది ఒక ఒడ్డు. మళ్ళీ దానికవతల ఇంకో పాయ ప్రవహిస్తూ వుంటుంది.

చుట్టూ రెల్లుపొదలూ, గడ్డి దుబ్బులూ గాలికి తలలూగిస్తూ హుషారు కలిగిస్తున్నాయి. పరుగుల్లోనే గంట గడిచిపోయింది. పడవతను పిలుస్తుంటే ఎవరికీ కదలాలనిపించలేదు.

పిల్లలు "అప్పుడేనా!ఇంకా సేపుందాం" అన్నారు.

"మళ్ళీ బస్సుందదమ్మా!" అంటూ ప్రసాద్ పిల్లల్ని బుజ్జగించి పడవెక్కించాడు.

ఈసారి ఎవరూ అడక్కుండానే ప్రసాద్–

'తీరెను కోరిక తీయతీయగా...

కలసి ప్రయాణం కలదువినోదం...'

అంటూ పాడాడు.

సహజ ప్రసాద్ వంక ప్రేమగా, ఆరాధనగా చూస్తోంది.

ఉష, శారద ఎవరి ఆలోచనల్లో వాళ్ళు వున్నారు.

పడవ ఒడ్డుచేరింది.

గుంటూర్లో తాలూకా ఆఫీసు దగ్గర బస్ దిగి రిక్షాలెక్కుతుంటే ముగ్గురికీ బాధనిపించింది.

"శారదకు కుదరదనుకో! పోనీ ఇవాళ నువ్వూ, పిల్లలూ మా ఇంటి కొచ్చెయ్యకూడదూ?" అంది సహజ ఉషను వదల్లేక.

ఉష–ఒద్దులెమ్మంటూ పిల్లలతో వెళ్ళింది.

శారదనూ, పిల్లలనూ కూడా రిక్షాలెక్కించి సహజ, ప్రసాద్ ఇంటికినడిచారు.

* * *

శారద పిల్లల్ని నిద్రలేపి స్నానం చేసింది. తనకిష్టమైన చీర కట్టుకుని అద్దంలో చూసుకుంటూ బొట్టు పెట్టుకుంటుంటే శారదకు ఎందుకో మనసంతా తేలికగా అనిపించింది. హఠాత్తుగా పడవలో ప్రసాద్ పాడుతుంటే సహజ అతనికేసి చూస్తున్న దృశ్యం కళ్ళముందు మెదిలింది. శారద హృదయం ప్రేమతో నిండిపోయింది. ఏదో చెయ్యాలనిపిస్తోంది. మనసంతా హాయిగావుంది. కిటికీ తలుపులన్నీ తెరిచింది. పిల్లల దగ్గరకెళ్ళి వాళ్ళను ముద్దుపెట్టుకుంది. ఎంత బాగుందీరోజు అనుకుంటూ మంచం మీద పడుకుంది. మనుషులు ప్రేమగా వుంటే ఎంత బాగుంటుందో! సహజతో వాళ్ళింటికి వెళ్ళినా బాగుండేది. పిల్లలు బాగా అలసిపోయారు లంకలో ఇసుకమీద పరుగెత్తుతుంటే ఆగాలనిపించలేదు. ఆయాసం వచ్చినా – పరుగెత్తి పరుగెత్తి, ఎక్కడికో అలాగే పరుగెత్తుతూ వుంటే – శారద చటుక్కున మంచం మీదనుంచి లేచింది.

హాల్లో అల్మారా తెరిచి పేపర్ కోసం, పెన్సిల్ కోసం వెదికింది. పెన్సిల్ దొరకలా. చిత్ర బాక్సులోంచి పెన్సిలు తీసి టేబిల్ ముందు కూచుంది. శారద చేతిలో పెన్సిల్ చకచకా కదులుతోంది. గీతలు రూపం ధరిస్తున్నాయి. శారద కళ్ళు ఏకాగ్రతతో మెరుస్తున్నాయి. శారద పెదవులు పట్టుదలతో ముడుచుకున్నాయి. శారద జీవిస్తోంది. ప్రాణం పోసుకుంటున్న శారద అద్భుతంగావుంది. ఏ గొప్ప శిల్పి చెక్కిన శిల్పంలావుంది. కాగితం మీద అమ్మాయి రెండు చేతులూ పైకెత్తి విరగబడి నవ్వుతూ పరుగెత్తుతోంది. గాలికి పైట ఎగిరిపోతోంది. జుట్టు చిందరవందరగా వుంది. ఆ బొమ్మలో అందం కంటే జీవం వుంది .... బొమ్మ పూర్తిచేసి 'ఇది సహజకివ్వాలి' అనుకుంటూ లేచి పడుకుని హాయిగా నిద్రపోయింది.

ఆమెకా క్షణంలో రామారావు జ్ఞాపకమే రాలేదు. హృదయంలో ప్రేమ వుప్పొంగు




తున్నవేళ, ఏదో సృష్టించాలనే ఆరాటం నిలువెల్లా దహించినవేళ, సర్వప్రపంచాన్నీ స్నేహంగా ఆలింగనం చేసుకుందామని పించినవేళ-ఆ వేళలో శారదకుభర్తకనీసం జ్ఞాపకంగా కూడా మదిలో మెదల లేదు.

ఆ భర్తతోనే ఆమె సంసారం చేస్తోంది. చేస్తానంటుంది.




ఆరాత్రివేళే ఉష పడుకోబోతూ పడవలో ప్రసాద్ పాడుతుంటే సహజ కళ్లల్లో ప్రతిఫలించిన ప్రేమనూ, ఆరాధననూ గుర్తుతెచ్చుకుంది. ప్రేమించటం, ప్రేమించబడటం ఎంత బాగుంటుంది. సహజ కళ్లు అలా ప్రకాశించాలంటే ఆమె హృదయం ఎంత పరవశించాలి. మనసంతా నచ్చిన వ్యక్తిమీద ప్రేమతో నిండిపోవటం, ఆ వ్యక్తిని ఆరాధించటం, ఇద్దరూకలిసి జీవితాన్ని సఫలం చేసుకోవటం ... ప్రేమ ఎంత అద్భుతం. ప్రేమ రహితమైన జీవితం ఎంత వ్యర్థం. ఉష మనసు కూడా ఏవేవో భావాలతో అల్లకల్లోలమైపోయింది. ఆ భావాలతో యుద్ధంచేస్తూ అలిసిపోయి ఎప్పటికో నిద్రపోయింది ఉష.

* * *

మర్నాడు చీకటితోనే తలుపుతట్టి శారదను నిద్రలేపేశాడు రామారావు. శారదకు రామారావుని చూడగానే అంత మయిన కలేదో కరిగిపోయి హఠాత్తుగా మెలకువ వచ్చినట్లయింది. అప్పటికింకా సరిగ్గా తెల్లవారలా. రామారావు మాట్లాడకుండా వెళ్ళి పడుకుని నిద్రపోయాడు. శారద పనుల్లోకి ప్రవేశించింది. పిల్లలు లేచారు. వాళ్ళకు టిఫిన్ పెట్టి, స్నానాలు చేయించేసరికి శారద అన్నయ్య వచ్చాడు.

"బావగారు ఊరెళ్ళివచ్చారా?" అనడిగాడు అతను నిద్రపోతున్న రామారావుని చూసి.

ఊరెళ్ళివచ్చిన ఆదివారం రామారావు పొద్దెక్కిందాకాగాని లేవడు. మిగతా రోజుల్లో అయిదు దాటనివ్వడు. కాసేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పి పిల్లల్ని తీసుకుని వెళ్ళిపోయాడతను. పిల్లలు అతనొచ్చిన దగ్గర్నించీ గొడవ మొదలెట్టారు-అమ్మమ్మ దగ్గరికి పోదాం అని. వాళ్ళెళ్ళాక శారదకేం తోచలేదు. టిఫిన్ తిని వంట ప్రయత్నంలో పడింది.

"నిన్న అమరావతి వెళ్లాను" రామారావు టిఫిన్ తింటుంటే నెమ్మదిగా అంది శారద.

""ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగాడు రామారావు.

"ఊరికే... సహజా, ఉషా వెళుతుంటే సరదాగా పిక్నిక్ వెళ్లాం"

"అయితే నాకిప్పుడు చెప్పటం ఎందుకు?" విసురుగా అన్నాడు.

"చెప్పకూడదా?"

"చెప్పకూడదు కాదు. వెళ్ళకూడదు" కఠినంగా వుంది రామారావు గొంతు.

"వెళితే ఏమవుతుంది?"

"నాకిష్టం వుండదు" శారద ధోరణికి రామారావు కనుబొమలు పైకిలేచి మళ్ళీ కిందికి దిగాయి.

"నాకిష్టం అయితే" శారద గొంతు వణికింది. రామారావు ఈ మాటతో రెచ్చి



పోయాడు.

"ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లుండేదానికి పెళ్ళెందుకు! సంసారానికి ఒక పద్ధతి వుండాలిగా. నాకిలాంటివన్నీ నచ్చవని తెలిసీ నువ్వు చెయ్యటం ఎందుకు?" రామారావు కంఠంలో తీవ్రత హెచ్చుతోంది.

"ఎప్పుడూ మీ ఇష్టాలే సాగాలా? నా ఇష్టం అంటూ వుండగూడదా? నేను మనిషినా... మీ నీడనా?"

రామారావు విసురుగా టిఫిన్ ప్లేటు టేబిల్ మీదనుంచి తోసేశాడు. కోపంతో వణికిపోతూ నిలబడ్డాడు. రామారావుకి కోపంవస్తే మాటలు రావు. అందునా శారద ఇలా సమాధానాలు చెప్పటం ఇదే మొదటిసారి. అతని కోపం చూసి శారద భయపడింది. అక్కడినుంచి వెళ్ళి మంచం మీద పడుకుని ఏడుస్తోంది.

రామారావు విసురుగా వచ్చి "అట్లా ఇష్టం వచ్చినట్లు తిరగటం ఎందుకు? ఈ గొడవంతా ఎందుకు? ఏడవటం ఎందుకు? నాకిష్టం లేని పనులు చెయ్యొద్దు" అన్నాడు.

"నేనేడుస్తున్నది అమరావతి వెళ్ళినందుకు కాదు... మీకిష్టంలేని పనులు చేశాననే పశ్చాత్తాపంతో కాదు.... నాకిష్టమైన పనులు చేస్తే మీ ముందు దోషిలా నిలబడాల్సివచ్చినందుకు" శారద గొంతంతా దుఃఖంతో నిండిపోయింది.

"నా ఇంట్లో నేచెప్పినట్లే జరగాలి" చేతిలో దువ్వెన శారద మొహాన వేస్తూ అరిచాడు రామారావు.

"ఇది నా ఇల్లు కాదా?" రోషంగా అడిగింది శారద.

"కాదు. ఈ ఇంటికి యజమానిని నేను... గుర్తుంచుకో" అంటూ బైటికి వెళ్ళిపోయాడు రామారావు.

శారద ఏడుస్తూ అలాగే పడుకుంది. పన్నెండు గంటలకు రామారావొచ్చి అన్నం పెట్టమన్నాడు. శారద లేచి ముఖం కడుక్కుని అన్నం వడ్డించింది. రామారావు ఏమీ జరగనట్టే, శారద విచారం గమనించకుండానే అన్నం తినేసి పడుకున్నాడు. శారదకు అన్నం తినాలనిపించలేదు. అమ్మ దగ్గరకు వెళదామా అనిపించింది. ఇప్పుడతనితో మా అమ్మ దగ్గరికి వెళ్తున్నానని చెప్పాలంటే అవమానంగా తోచింది. చెప్పకుండా వెళితే? ఆలోచిస్తుండగా ఎవరో తలుపు తట్టారు. సహజ కాదుగదా అనుకుంది శారద. ఈ సమయంలో సహజను కలవాలనిపించలేదు శారదకు. సహజ కాకుండా వుంటే బాగుండునను కుంటూ తలుపు తీసింది.

ఎదురుగా రమ. వాళ్ళబ్బాయితో సహా వచ్చింది. శారద ఆశ్చర్యంగానే ఆహ్వానించింది.

"ఎన్నాళ్ళకు వచ్చావే.... నిన్ను చూసి ఆర్నెల్లపైనే అయిందిగదూ?" అంది శారద కుర్చీలు జరుపుతూ.

"నువ్వు మాత్రం మా ఇంటికి ఎన్నిసార్లొచ్చావేంటి?" అంది రమ నిష్ఠూరంగా.

"పోనీలే ... ఇవాళ్టికైనా ఇద్దరం కలిశాం గదా..సంతోషిద్దాం" అంది శారద రమను చూస్తూ. రమ చాలా చిక్కినట్లనిపించింది. అదే అడిగింది.

"ఏంటి.... చిక్కినట్లున్నావు. మళ్ళీ ఏమన్నా విశేషమా?"

"విశేషం లేదూ పాడూ లేదు. మావాడు పుట్టాక రెండేళ్ళకో అబార్షన్ అయింది గుర్తుందా? మళ్ళీ ఏమీ లేదు. ఈమధ్య పదిరోజులు పడకేశాలే!




నేను పడకేశానంటే ఇక ఆ ఇల్లు హనుమంతుడొచ్చి వెళ్ళిన అశోకవనంలా వుంటుందనుకో! అత్తగారు చేసుకోలేరు. ఆయనకు ఆఫీసూ, క్లబ్బూ తప్ప... నన్ను డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళే తీరిక కూడా వుండదు. పాపం ఆ పదిరోజులూ వేళకు సరిగా తిండి అమరక నాకంటే ఆయనే చిక్కారు. అక్కడికీ పగలు ఎలాగో ఓపిక తెచ్చుకుని ఏ కూర ముక్కలో వేయించేదాన్ని. రాత్రి కాస్త పెందలాడే రండి అంటే వినరు. ఆయనకెంత పిచ్చో ఆ క్లబ్బంటే..." రమ మురిపెంగా చెబుతుంటే శారద విస్తుపోయింది. రమ అంత బాగా ఎట్లా ఇమిడిపోయింది సంసారంలో. భర్త తనను పట్టించుకోలేదని దిగులు పడకుండా అతను చిక్కాడని విచారించటం, అతని దరిద్రపుటలవాట్లకు మురిసిపోవటం.... ఎలా కుదిరిందో? భర్తకూ, పిల్లలకూ వండి పెట్టటమే జీవితంగా చేసుకుంది. అదే నయమేమో... నాలా మనసునిండా దిగులుతో కుళ్ళిపోయే కంటే!

ఇలా ఆలోచిస్తూనే రమకు కాఫీ కలిపి ఇచ్చింది.

"శారదా... నీకు తెలుసా! ఉష భర్తనొదిలేసిందట" కాఫీ కప్పు అందుకుంటూ అంది రమ.

ప్రపంచంలోకెల్లా ఘోరమైన విషయం చెబుతున్నట్లుగా వుంది రమ మొహం.

"అతను వేరే పెళ్ళి చేసుకుంటే మరి ఉషయేం చేస్తుందే... విడాకులు తీసుకోవటం తప్పా?" శారదకు రమ మాటలకు బాగా కోపం వచ్చింది.

"అతను వేరే పెళ్ళిచేసుకున్నాడా?

"నాకా సంగతి తెలియదే. నాకెవరో చెప్పారుగదా.... ఉషకి ఎవరితోనో సంబంధం ఉందనీ, అందుకే వాళ్ళాయన్ని వదిలేసిందనీ! అతను వేరే పెళ్ళెందుకు చేసుకున్నాడంటా?" దీర్ఘం తీసింది రమ.

"ఏమో...నాతో చెప్పి చేసుకోలేదు. అయినా ఉష గురించి నీకు తెలియదా ఎవరన్నా ఏమన్నా చెబితే నమ్మేస్తావా?"

"బాగుందే నేనేం చేశాను. నిజమేనా అని నిన్నడిగాను. ఇంతకూ అతను ఉషకు విడాకులిచ్చి వేరే పెళ్ళి చేసుకున్నాడన్నమాట. పాపిష్టిలోకం.... విషయాలను ఎలా మార్చేస్తుందో" అంది రమ లోకాన్ని కొత్తగా చూస్తున్నదానల్లే.

"అతను ఉషకి విడాకులిచ్చి వేరే పెళ్ళిచేసుకోలేదు. అతను వేరే పెళ్ళి చేసుకుని కూడా ఉషతో కాపురం చెయ్యటానికి సిద్ధపడ్డాడు. ఉషే అతనికి విడాకులిచ్చేసింది" శారద ప్రతి మాటా స్పష్టంగా నొక్కి చెప్పింది.

రమ ఆలోచనలో పడింది. కాసేపాలోచించి, "ఏమైనా ఉష తొందరపడిందే. అతను ఉషతో వుంటానన్నప్పుడు విడాకులెందుకడిగింది? ఎలాగోలా సర్దుకుంటే పోయేదిగా?"

"రమా ... అర్థం లేకుండా మాట్లాడకు" అంది శారద అసహనంగా.

ఈ కబురు వినగానే తాను ఉషతో 'విడాకులెందుకన్నావే... శేషగిరి తిరిగి వస్తాడేమో' అన్నమాట మరిచిపోయింది. రమ అన్నమాటలు చాలా అసహ్యంగా అనిపించాయిప్పుడు శారదకి.

"అర్థం లేదంటావేమిటి? అతను మగాడు. లక్ష బలహీనతలుంటాయి. మనం సర్దుకుపోవాలి. ఇప్పుడు మొగుణ్ని కాదని జీవితాంతం ఒంటరిగా బతకా

అంటే మాటలా లోకం ఏమనుకుంటుంది? పిల్లలకేమని చెబుతుంది? ఇప్పటికే నిందలువేస్తున్నారు. రేపొద్దున్న ఎలాంటి సమస్యలు వస్తాయి?"

"ఇంకాపు రమా! ఎన్ని బలహీనతలు ఎలాంటివున్నా సర్దుకుపోవాల్సిందేనా.... అతను వేరే అమ్మాయితో కాపురం చేస్తూ ఉష దగ్గరికొస్తే అతన్ని ప్రేమతో కావలించుకోవాలా? ఎంత అసహ్యం" శారద చీదరించుకుంటూ అంది.

"బైట మగాళ్లు ఏం తిరుగుళ్లు తిరుగుతారో మనకి తెలుస్తుందేమిటి? అవన్నీ ఆలోచిస్తూ కూచుంటే మనం బతగ్గలమా? ఉష మొగుడు దాన్నేమీ తిట్టడు.కొట్టడు. తాగుబోతుకాదు. ఏదో బలహీనపడ్డాడనుకో...ఇది కాస్త సర్దుకుంటే పోయేది"

"రమా...ఈ విషయం నువ్వింక మాట్లాడకు. మా ఆడబిడ్డ మొగుడు ఆవిడని తంతాడు. తాగి వచ్చి నానా అల్లరీ పెడతాడు. అయినా ఆవిడ భర్త నొదిలి రాలేదు. కాబట్టి కొంతమందికి ఆమెను కూడా ఆదర్శంగా చూపించి భర్త తన్నినా తగలేసినా అతన్ని వదలకూడదనే వాళ్లుంటారు. ఉష మనలాంటిదికాదు. అది ఆడదేకాదు... మనిషి కూడా. మనిషి కుండాల్సిన కొన్ని లక్షణాలు దానికున్నాయి. ఈ విషయం గురించి నువ్వింకో మాట మాట్లాడొద్దు. మనిద్దరి అభిప్రాయాలూ కలవవు" శారద కఠినంగా అంది.

రమ ముఖం నల్లగా చేసుకుని కూచుంది. అయిదు నిమిషాలలాగేకూచుని వెళ్తానంటూ లేచింది.

"అదేం... అప్పుడేనా! నువ్వొచ్చి గంటే అయింది'' అంది శారద వారించే ప్రయత్నం పెద్దగా చెయ్యకుండా.

"పనుంది. ఆయనివాళ ఇంటి దగ్గరే వున్నారు. తొందరగా వస్తానని చెప్పి వచ్చాను. నేను వెళ్ళి ఏదో ఒక టిఫిన్ చేసిపెట్టాలి. మా అత్తగారు చేస్తే ఆయనకు నచ్చదు"

రమ మామూలు ధోరణిలో పడబోతుంటే శారద మధ్యలో ఆపేసింది.

"అయితే రెండు దాటిపోయింది. తొందరగా బయల్దేరాలి నువ్వు"

రమ వెళ్ళిపోయింది. శారద మనసు చాలా ఆందోళనగా తయారయింది. ఆడబిడ్డ సంగతి ఎత్తిందిరమతో.ఆడబిడ్డను చూస్తే శారదకెప్పుడూ జాలే. ఆవిడను కనీసం పుట్టింటికి కూడా పంపించడతను రామారావుకంటే పదేళ్లు పెద్దదామె. పెద్ద చదువేమీ లేదు. రామారావు తప్ప మరో అండలేదు. రామారావు ఆమె విషయాలేమీ పట్టించుకోడు. శారదే ఎప్పుడన్నా ఆమెరాసే ఉత్తరాలకి జవాబులు రాస్తుంది. ఇవాళ ఆ ఆడబిడ్డ తన భర్తనొదిలి రావాలన్నట్టు తను మాట్లాడింది. అంతే కాదు– తననితాను విమర్శించుకుంది. ఈ భర్తతో కాపురంచేసే తనలో మనిషి లక్షణాలు లేవని తాను నమ్ముతోంది. ఇదంతా ఎక్కడికి దారితీస్తుంది? ఏమవుతుంది? ఎందుకీ అశాంతి?

అమ్మ దగ్గరికి వెళ్ళాలని బయల్దేరింది శారద.

రామారావు శారద తయారవటం చూసి 'ఎక్కడికి' అన్నాడు.

"అమ్మదగ్గరికెళ్ళి పిల్లల్ని తెస్తాను"

పిల్లల్ని తెస్తాను అన్నమాట ఓ కారణంలా కంటే సంజాయిషీలా వినబడింది.

"నేనూ వస్తానుండు. కలసి వెళదాం"

శారద ఆగింది. ఇప్పుడు రామారావుతో కలిసి వెళ్ళాలని శారద కేమాత్రం లేదు.



అమ్మతోగానీ, అన్నయ్యతో గానీ ఏమీ మాట్లాడే వీలుండదు. ఇద్దరూ ఇతని మర్యాదలు చేసెయ్యటంలో మునిగిపో తారు. అయినా చేసేదేముంది.

రామారావుతో పాటు బైటికి నడిచింది శారద. 'ఇప్పుడు మా ఇద్దర్నీ చూసి అందరూ ఎంతో గౌరవంచూపిస్తారు. నేనితన్ని ద్వేషిస్తున్నానని ఇవాళ ఉద యమే ఇతను ఇది నా ఇల్లు నేనే ఈ ఇంటి యజమానిని నువ్వెవరో అన్నట్లు మాట్లాడాడని ఎవరికీ తెలియదు. తెలిసినా అదెవరూ పట్టించుకోరు. ఈ గొడవలు మామూలే అనుకుంటారు. మా ఇద్దరి మధ్యా ప్రేమవుందా లేదా అన్న విషయం ఎవరికీ పట్టదు. మేమిద్దరం కలిసి ఒక కప్పుకింద వుంటున్నామా లేదా అన్నదే ఎవరికి కావాల్సినా! నేనితన్నించి విడిపోతే, మొగుడినొదిలేసింది, ఎవరితోనో సంబంధంవుంది, పిల్లల్ని అన్యాయం చేసింది- ఇలా తనొక దుర్మార్గురాలు అయిపోతుంది. ఆ క్షణం తనని సంఘం ఎలా చూస్తుందా అని కుమిలిపోవటమే అప్పుడు తన జీవితం అవుతుందా? స్నేహితులున్నారు. ఎన్నాళ్లు వాళ్ళమీద ఆధారపడగలదు. సహజకూ, ఉషకూ వేరే వూరు ట్రాన్స్‌ఫరై వెళ్ళిపోతే తనకు ధైర్యం వుండాలిగాని ఎంతకాలం ఇతరు లిచ్చే ధైర్యంమీద నిలబడగలుగుతుంది? తనకంత ధైర్యంవుందా? అసలు తన ఆలోచనలు తెలిస్తే అమ్మ ఏమవుతుంది ఈ మాట వినగానే అమ్మగుండె పగిలి పోదూ? అమ్మ... తననింత కష్టపడనీయ కుండా పెంచిన అమ్మ. తనకోసం పిల్లలకోసం బతుకుతున్న అమ్మ. అమ్మని ఎట్లా బాధించటం. ఈ వయసులో ఆమెకి అశాంతి కలిగించటం... తనాపని చెయ్యాని

లేదు. ఆ ధైర్యం తనకిలేదు' ఆలోచనల్లోనే ఇల్లు వచ్చేసింది.

పిల్లలు 'అమ్మొచ్చింది' అంటూ ఎగురుతూ వచ్చారు. రామారావు పిల్లల వుత్సాహాన్ని పాడుచేస్తూ-

"ఏంటా అరుపులూ, గంతులూ! పద్ధతీపాడూ లేకుండా పెరుగుతున్నారు" అని విసుక్కున్నాడు శారదవైపు నిరసనగా చూస్తూ.

శారద సరాసరి వంటింట్లోకి వెళ్ళింది.

రామారావు ముందుగదిలో శారద వాళ్ళన్నయ్యతో మాట్లాడుతున్నాడు. అతనేదో చెబుతుంటే రామారావు వింటూ కూచున్నాడు.

శారద తల్లితో ఏ విషయాలేవీ చెప్పలేదు. వదినేవో కబుర్లు చెబుతుంటే మనసెక్కడో పెట్టి వింటూ కూచుంది.

ఎనిమిదింటికంతా భోజనాలుచేసి ఇల్లు చేరారు.

పిల్లలు నిద్రపోగానే శారదవైపు జరిగాడు రామారావు. శారద అటు తిరిగి పడుకుంది. రామారావు ఆమెను బలవంతాన ఇటు తిప్పి గట్టిగా కావలించుకున్నాడు. శారదకు దుఃఖం వచ్చింది. అసహ్యం వేసింది. ఎప్పుడూ నిర్లిప్తంగా రామారావుకి లొంగిపోయే శారద శరీరం ఇవాళ అసహ్యంతో ముడుచుకుపోతోంది. శారద నిర్లిప్తంగా వుందా, ఆనందంగా వుందా, అసహ్యంతో వుందా అనేది రామారావు కెప్పుడూ పట్టదు. అతను పద్ధతి ప్రకారం తన పని తను చేసుకుపోతాడు. ఆ తర్వాత పక్కకు తిరిగి పడుకుని నిద్రపోతాడు.

శారద నిశ్శబ్దంగా ఏడుస్తోంది.

తను మనిషికాదు... అతని నరాల బాధ తీర్చే యంత్రం. ఎట్లా..ఎన్నాళ్ళిలా..చచ్చిపోతే! పిల్లలు...తను లేకుండా తనకోసం ఏడ్చి బెంగపెట్టుకునే పిల్లలు! అమ్మ ఏమైపోతుంది? చిన్నా, చందూ మీ కోసం నేనెంత నరకం అనుభవిస్తున్నానో మీకు తెలుస్తటా?

'మీరూ పెరిగి పెద్దయ్యాక నన్ను నిర్లక్ష్యం చేస్తారా?'

అర్థంలేని ఆలోచనలతో కుళ్ళి కుళ్ళి ఏడ్చింది శారద.

* * *

మర్నాడు రామారావు ఆఫీసుకి వెళ్లాక చిత్రను బడికి పంపి చందూని తీసుకుని సహజ దగ్గరకు వెళదామను కుంది శారద. తను వేసిన బొమ్మ సహజకి ఇవ్వాలని శారదకు చాలా అనిపించింది. ఆ బొమ్మ వేసేటప్పుడు తనలో పుట్టిన జీవశక్తి ఎంత అద్భుతంగా ఉందో శారద అనుభూతి చెందింది. చాలారోజుల తర్వాత ఆ అనుభూతి కలిగించిన సహజమీద చాలా ప్రేమ అనిపించింది. సహజ తనకు జీవశక్తిని ఇస్తే రామారావు తనను శవంలా చేసేసిన విధంకూడా శారదకు స్పష్టమయింది. శనివారం రాత్రి మనసంతా తేలికై తనకే తెలియని ఆవేశంతో ఎన్నాళ్లగానో మూలబడ్డ చిత్రకళలోకి వచ్చేసింది. ఆ బొమ్మ పూర్తయ్యేవరకూ తనకు మరో స్పృహా, ఆలోచనా ఏమీ లేవు. ఆ బొమ్మ పూర్తయ్యాక నిశ్చింతగా పడుకుని నిద్రపోయింది. ఆ రాత్రి ఎంత ప్రశాంతంగా గడిచిందో ఆదివారం రాత్రి అంత భయంకరంగా గడిచింది. తనొక జీవచ్ఛవంలా పక్కమీద పడుంటే తన అనుమతి కోరకుండా, తన అసహ్యాన్ని పట్టించుకోకుండా తననొక వస్తువులా వాడుకుని నిద్రపోయాడు రామారావు. ఈ రెండు రాత్రిళ్ళలో వున్న తేడా




శారద మనసును అల్లకల్లోలం చేసేసింది. సహజ దగ్గరకువెళ్ళి ఆ బొమ్మ చూపించి మళ్ళీ బొమ్మ వేసే ఆవేశం పొందాలనే కోరిక శారద మనసులో బలంగా తలెత్తింది. లీరా బయలుదేర బోతుంటే గుర్తొచ్చింది సహజ ఆఫీసుకు వెళ్తుందని.

సహజ కూడా అయిదింటికిగాని ఇంటికి రాదు. అయిదింటికి ఇంట్లో లేకపోతే రామారావు చిందులేస్తాడు. శారదకేమీ పాలుపోలేదు.

తను వేసిన కొత్త బొమ్మ సహజకి ఇవ్వటం కూడా తనకు సమస్యే.

మళ్ళీ ఏదో ఆలోచనల్లో పడేసరికి చందూ ఆకలంటూ వచ్చాడు.

వాడికి అన్నం తినిపించి నీళ్లుపోసి నిద్ర పుచ్చింది. తానూ భోజనంచేసి చందూ పక్కనే పడుకుంటే అలాగే నిద్రపట్టింది. ఇద్దరూ నిద్రలేచేసరికి రెండయింది.

శారదకు ఎలాగైనా సహజను కలవాలనిపించింది.ఆఫీసుకెళదామా అనుకుంది. పెద్ద మాట్లాడేదేముంది? ఈ బొమ్మ ఇచ్చేసి వెంటనే రావచ్చు. ఈ ఆలోచనతో శారదకు వుత్సాహం వచ్చింది. చకచకా చందూకి బట్టలుమార్చి రెడీచేసింది. తానూ తయారవుతుంటే చందూ, "అమ్మమ్మ దగ్గరికామ్మా?" అని అడిగాడు.

"కాదమ్మా...అత్త దగ్గరికి! సహజత్త దగ్గరికి" అంది శారద హుషారుగా.

చందూకి ఎక్కడికైనా ఒకటే. బజారుకి వెళ్ళటమంటే వాడికి సరదా. ఆ వుత్సాహంతో వాడు పరిగెత్తుకెళ్ళి బజార్లో నుంచున్నాడు.

శారద ఇంటికి తాళంవేసి, రిక్షా పిలిచి ఎక్కింది. బస్టాండులో దిగి ఆర్.టి.సి. ఆఫీసుముందుకెళ్ళింది గానీ ఆ ఆఫీసులో సహజ ఎక్కడుంటుందో, ఎక్కడికి వెళ్ళాలో శారదకు అంతుబట్టలేదు. ఒక్క క్షణం కంగారనిపించింది. డీలక్స్ లాంజ్ పక్కనే రిజర్వేషన్ల కౌంటర్‌వుంది. అక్కడొక అమ్మాయి కూచునివుంది.

ఆ అమ్మాయినడుగుదామా, వెళ్ళిపోదామా? అని కాసేపు ఆలోచించింది. ఆఫీసుదాకా వచ్చి వెళ్ళిపోయిన సంగతి సహజకు తెలిస్తే తనకు తగిలే చివాట్లు గుర్తొచ్చి నవ్వొచ్చింది. చివరకు ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళింది.

ఆ అమ్మాయి తలెత్తిచూసి,

''హైదరాబాదుకైతే లేవండి'' అని నవ్వింది.

శారద "నాకు టిక్కెట్లక్కర లేదండీ...సహజ నా స్నేహితురాలు. ఈ ఆఫీసులో పనిచేస్తోంది. ఎక్కడుంటుందో మీకు తెలుసేమోనని..." అంది.

"ఆఫీసు పైన వుందండీ! మెట్లెక్కి పైకి వెళ్ళగానే కుడిచేతి వైపున వున్నగదిలో వుంటారావిడ" అని చెప్పిందామె.

పైన ఆఫీసులో సహజని గురించి అడిగితే "ఆవిడివాళ లీవులో వున్నారండి. మీకు టిక్కెట్టేదన్నా కావాలా? నేను తెచ్చిపెడతాను చెప్పండి" అన్నాడొకాయన.

"లేదండి. సహజతో వేరే పనుండి వచ్చాను. ఇంటికెళతాను" అంటూ బైటికి వచ్చింది శారద.

బస్టాండు దగ్గరనుంచి మళ్ళీ అరండల్ పేటకు రిక్షా మాట్లాడుకుని బయల్దేరింది. చందూ బస్ స్టాండులో బస్సుల్ని వదలి రిక్షా ఎక్కటానికి ఓ పట్టాన ఒప్పుకోలేదు. వాడిని బుజ్జగించి రిక్షాలో ఎక్కించింది.

'పొద్దున్నే వెళితే బాగుండేది. ఇప్పుడు మూడున్నర అయింది. ఇంటిదాకా వెళ్ళి వెంటనే వచ్చెయ్యటం బాగోదు. కనీసం అయిదింటికి వాళ్ళింట్లో నుంచి బైట పడకపోతే రామారావుతో గొడవ' ఆందోళనతో నిండిన మనసుతో రిక్షా దిగింది శారద. ప్రసాద్ సైకిలు బైటే వుంది. ఇద్దరూ సెలవుపెట్టి ఇంట్లోనే వున్నట్టున్నారు. తనొచ్చి డిస్టర్బ్ చేసినట్లవుతుందేమోనని సంకోచిస్తూనే మెల్లిగా తలుపు కొట్టింది.

ప్రసాద్ తలుపు తీసి-

"రండి...రండి" అంటూ ఆహ్వానించాడు.

'సహజా' ... అంటూ లోపలికి వచ్చింది శారద.

"సహజ ఆఫీస్‌కు వెళ్ళిందండీ! నాకు మా బాంక్ బెస్టు వుంటే చదువుకుందామని సెలవు పెట్టాను...కూచోండి" అంటూ చందూని ఎత్తుకున్నాడు.

శారద సంకోచిస్తూనే ఓ కుర్చీలో కూచుంది. ప్రసాద్ తనూ కూర్చుని చందూని ఒళ్ళో కూచోబెట్టుకున్నాడు.

"సహజ ఆఫీసులో లేదండీ!నేనక్కడికి వెళ్ళేవస్తున్నాను. లీవు పెట్టిందన్నారు" సంశయిస్తూ అన్నది శారద.

"అలాగా ... ఆఫీసుకనే వెళ్ళిందే! మధ్యలో ఇంకేదన్నా పని తగిలి లీవు పెట్టిందేమో! వస్తే తెలుస్తుందిగా. మీరు మంచినీళ్ళు తాగుతారా?" అడిగాడు ప్రసాద్.

"నేను తెచ్చుకుంటాను లెండి" అని శారద లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తాగి వచ్చింది.

"ఇక మేం వెళ్తామండీ" అంది చందూ చేయి పట్టుకుని.

"కూచోండి. సహజ వస్తుందిగా. ఆఫీసుకి వెళ్ళలేదంటే తొందరగా రావచ్చేమో"

"ఇంకా ఆలస్యం కూడా కావచ్చుగదా...నేను వెళ్తానండీ"

ప్రసాద్ ఆలోచనలో పడ్డాడు. శారద ఆఫీసుకి వెళ్ళి ఇంటికొచ్చిందంటే ఏదో అవసరమైన పనే వుండి వుంటుంది. ఆ పనేమిటని తనుఅడిగితే ఏమనుకుంటుందో. అడగకపోతే ఆవిడ మరీ డల్‌గా వుంటుందేమో- ఇలా ఆలోచించి, "సహజతో ఏమన్నా అవసరమైన పనివుందా? తను వచ్చాక మీ ఇంటికి రమ్మంటారా?" అని మొహమాటంగా అడిగాడు.

"పనేంలేదనుకోండి'' అంటూ వాచీ చూసుకుంది శారద. నాలుగు దాటింది. పోనీ పదిహేను నిమిషాలుచూసి వెళదాం అనుకుని మళ్ళీ కూచుంది.

"నేనో పావుగంట చూసి వెళతాను. మీరు వెళ్ళి చదువుకోండి. నేను డిస్టర్బ్ చేసినట్టున్నాను" అంది నవ్వుతూ.

"చదువా...పాడా! బాంక్‌లో అందరూ సెలవుపెట్టారు. బాగా బోర్‌కొడుతుందని నేనూ పెట్టానుగాని చదువుదామని కాదు. చదువు ఒకవంక. అంతే!'' నవ్వాడు.

లోపలికి వెళ్ళి చందూకి బిస్కట్లు తెచ్చి ఇచ్చాడు.

పదిహేను నిమిషాలు గడిచినా సహజ రాలేదు.

"నేవెళ్తానండీ! సహజని వీలుంటే శనాదివారాల్లో రమ్మనండి'' అంటూ శారద బయటికి వచ్చేసరికి సహజ గేటు తీసుకుని లోపలకు వస్తోంది. శారదను చూసి ఆశ్చర్యపోయింది.

"ఎంతసేపయింది వచ్చి? ప్రసాద్ నిన్ను తరిమేస్తున్నాడా ఏమిటి...పదపద"

అంటూ శారదను తనతోపాటు లోపలకు నెట్టుకుంటూ వచ్చింది.

"అసలు నిన్ను కూర్చోమన్నాడా? టీ ఇచ్చాడా? అతిథిమర్యాదలు చేశాడా... నిజం చెప్పు!"

"అన్నిమర్యాదలూ చేశాడేగాని, నువ్వు ఆఫీసుకి ఎందుకెళ్ళలా? నేను అక్కడికి వెళ్ళివస్తున్నాను"

"అరే...ఆఫీసుకెళ్ళావా? నాకేదో చిన్న పనితగిలి శలవుపెట్టాలే. ఏమిటంత హడావుడి? ఆఫీసుకొచ్చావంటే ఏదో అర్జంటుపనే అయ్యుంటుంది" సహజ బేగ్ కుర్చీలోపడేసి బాత్‌రూం కెళ్ళింది.

ప్రసాద్ బెడ్‌రూంలోకి వెళ్ళి పుస్తకం ముందేసుకున్నాడు. సహజ కాళ్ళూ, ముఖం కడుక్కొని హాల్లోకి వచ్చింది.

శారద బేగ్‌లోనుంచి తాను బొమ్మ వేసిన కాగితంపైకి తీసింది.

"ఇదిగో ఇది నీకు ఇవ్వటమే... నాకున్న అర్జంటుపని" అంటూ ఆకాగితాన్ని సహజ చేతికిచ్చింది.

సహజ ఆ కాగితం విప్పిచూసి ఆనంద ఆశ్చర్యాలతో వుక్కిరిబిక్కిరయింది.

"శారదా! చాలా బావుంది. ఎప్పుడు వేశావిది" పరిశీలనగా బొమ్మనే చూస్తోంది.

"శనివారం రాత్రి. నీకోసమే వేశాను. తీసుకో... నేవెళ్తాను"

"అరే అప్పుడే వెళ్ళడమేమిటి?"

"చాలా టైమయింది. ఇంట్లో చాలా పనుంది.నేనుమూడింటిదగ్గర్నించీనీకోసమే తిరుగుతున్నా. శనాదివారాల్లో నువ్వు రా. చాలా మాట్లాడాలి'' అంటూ శారద గబగబా వాకిట్లోకి వెళ్ళిపోయింది.

"శారదా! బొమ్మ చాలా బాగుంది. నాకెంత సంతోషంగా వుందో తెలుసా! ఇంక నువ్వు మానెయ్యటానికి వీల్లేదు. రామారావుతో చెప్పావా అమరావతి సంగతి" శారదతోపాటు గేటుదాకా నడిచింది సహజ.

"అవన్నీ నువొచ్చినప్పుడు చెబుతాలే. నాకిప్పుడు టైములేదు'' అంటూ శారద వెళ్ళిపోయింది. సహజ హాల్లోకివచ్చి ఆ కాగితం తీసింది.

శారద హృదయంలో రేకెత్తిన స్వేచ్ఛా కాంక్ష చేతులెత్తి పరుగెత్తుతున్న ఆ అమ్మాయి బొమ్మలో కొట్టవచ్చినట్లు కనబడింది సహజకు.

ప్రసాద్ "మీ శారదగారు అప్పుడే వెళ్ళినట్లున్నారే?'' అంటూ హాల్లోకి వచ్చాడు.

"ప్రసాద్! శారద నాకోసం బొమ్మ వేసి తెచ్చింది చూడు" అంటూ ఆ కాగితం అందించింది సహజ.

"చాలా బాగుంది'' అన్నాడు ప్రసాద్ పరిశీలనగా ఆ బొమ్మవంక చూస్తూ.

''ఈ అమ్మాయి కళ్లు చూడూ...ఎంత సహజంగా, ఎంత కాంతిగా వున్నాయో! పెదవుల చివరల దగ్గర చూడు... నవ్వు అనే అల విరిగిపడినట్లుంది. ఏదో పెద్ద ఆనందతరంగంలో స్వేచ్ఛగా కొట్టుకుపోతున్నట్టు ఎంత బాగుందో"

సహజ ఆ బొమ్మను రకరకాల కోణాల్నించి చూసింది.

"నిజానికి శారద ఇంకా బాగా వెయ్యగలదు. అయిదేళ్ళనుంచి ఇంత కళనూ అణిచేసుకుని బతికింది"

"మొన్న అమరావతి ప్రయాణం ఆమెను బాగా కదిలించినట్లుంది" అన్నాడు ప్రసాద్.

"ఔను.చాలారోజుల తర్వాత పంజరంలోంచి కాసేపు బైటికి వచ్చినట్లనిపించి

వుంటుంది. ఇంత మంచిదాన్ని ఆ భర్త ఎలా హత్య చెయ్యగలిగాడో? శారద బొమ్మ లేసుకుంటే ఆయనకేమయింది??"

"భార్యకు తనకన్నా అధికమైన శక్తేదో వుందంటే భర్త సహించలేడు. తన అదుపాజ్ఞల్లో వుండే ఆమెకు తనకు లేని శక్తేదో వుందంటే తను చాలా అల్పుడిననుకుంటాడు"

"ఎందుకట్లా...అంత అహంకారం ఎందుకు? అయినా ఈ రామారావు మరీ నియంతలావున్నాడు. అందరూ ఇలా వుంటే లోకంలో కళాకారుల గతేం కావాలి?"

"లోకంలో చాలామంది అట్లాగే వున్నారు. నాకు రెండు మూడు కేసులు తెలుసు. అంతెందుకు– నాకు చాలా ఇష్టమైన గాయకి తెలుసుగా...ఆమె పెళ్ళయ్యాక పాటలు పాడలేదు..ఎందుకు? నేను చదువుకునే రోజుల్లో మంచి డాన్సరొకావిడ వుండేది. నేనావిడవి నాలుగైదు ప్రోగ్రాములు చూసి ఆవిడని చాలాఅభిమానించాను. హఠాత్తుగా ఆవిడ ప్రోగ్రామ్స్ ఆగిపోయాయి. ఒక సంవత్సరం తర్వాత విజయవాడలో నేనెవరి ఇంటికోసమో వెతుకుతుంటే ఆవిడ ఒక ఇంట్లో కనిపించింది. నేను చాలా ఆనందించి మీరుప్రోగ్రామ్స్ఇవ్వటంలేదేమిటండీ అనడిగితే ... 'పెళ్ళయ్యాక ఇంకెలా కుదురుతుందండీ' అని తేలికగా నవ్వేసింది.

"ఆ నవ్వు వెనకాలవున్న విషాదం సంగతి ఎవరికీ అర్థంకాదు. వీళ్ళు పెళ్ళయ్యాక సంసారంలో పడిపోయారు. హాయిగా సంసారం చేసుకుంటున్నారు అనుకుంటారు. ఆ సంసారంలో అణిగి పోయినవాళ్ళ కళా, ఆ కళనణిచేసే క్రమంలో వాళ్లుపడే హింస...ఇవన్నీ ఎవరూ పట్టించుకోరు. అందుకే కళ కావాలనుకున్నవాళ్ళు పెళ్ళి జోలికి పోరు"

"కానీ జీవితంలో ప్రేమా, మాతృత్వం ఇవి కోల్పోతారుగా! వాళ్ళకు ఒక కళలో శక్తి వున్నందుకు పరిహారంగా ఈ అనుభూతుల్ని జీవితంలో లేకుండా చేసుకోవాలా? కళతో పాటు ఇవి కూడా వుంటే జీవితం ఎంత పరిపూర్ణంగా వుంటుంది....అసలా కళ వాళ్ళలో వున్నందుకే వాళ్ళను ప్రేమించవచ్చే"

"ప్రేమిస్తారు... అంతవరకే! ఆవిడ భార్యగా మారేసరికి భర్తననే అహంకారం పైకి తన్నుకొస్తుంది. ఆవిడ కళని గుర్తించి గౌరవించే ప్రజలుండటం, ఆమె తన కళను ప్రదర్శించి నలుగురి మెప్పుపొందుతుంటే తానో అనామకుడిలా మిగలాల్సిరావటం...వీటిని భరించలేడు మగాడు."

"ఈ మగాళ్ళను కాల్చి అవతల పారెయ్యాలి" అంది సహజ కోపంగా.

ప్రసాద్ నవ్వి, "నన్ను మాత్రం వదిలేయి! ఔనూ... ఇవాళ ఆఫీసుకి శెలవు పెట్టి ఎక్కడికెళ్ళావు?"

"ఆఫీసుకని బయల్దేరానా .... మా కొలీగ్ ఒకావిడ ఎదురయింది. ఆవిడకు రెండో నెల. ఎబార్షన్ అవుతుందని అనుమానంవచ్చిందట.భర్తనుహాస్పిటల్ కి వెళదాం రమ్మంటే నాకేం తెలుసు ఆ గొడవలు నేను రానంటాడు. ఈవిడకు ఒక్కత్తే వెళ్ళటానికి భయం వేసి నా దగ్గరకు వస్తోంది. దారిలోనే కలిసింది. ఇద్దరం హాస్పిటల్ కు వెళ్లాం. హాస్పిటల్ కు వెళ్ళేసరికి బ్లీడింగ్ ఇంకా

 

ఎక్కువైంది. డాక్టరు ఎబార్షన్ చేసేశాడు. ఇప్పటిదాకా హాస్పిటల్‌లోనే వుండి ఆమెను ఇంటికి పంపి నేనిటు వస్తున్నాను. చాలా అలసటగా వుంది" అంది మంచం మీద పడుకుంటూ.

ప్రసాద్ టీ చేసి తీసుకొచ్చాడు.

"హాస్పిటల్ వాతావరణం ఎంత భయంకరంగా వుందో" టీ కప్పు అందుకుంటూ అంది సహజ.

"గవర్నమెంటుఆస్పత్రులే ఘోరంగా వుంటాయనుకునేదాన్ని! ఏదన్నా పెద్ద జబ్బు చేసినా ఇంట్లో హాయిగా చచ్చిపోవచ్చుగాని హాస్పిటల్‌కు వెళ్ళగూడదనిపించింది. అక్కడికందరూ జబ్బులతో, భరించలేని బాధలతో వస్తారనే స్పృహలేదునర్సులకుగానీ,డాక్టర్లకుగానీ. పేషెంట్లను ఏవో ఘోరమైన నేరాలు చేసి వచ్చిన ముద్దాయిల్లాగా చూస్తున్నారు. జాలీ, దయా, కరుణా ఏమీలేవు. పైగా పేషెంట్లను తిట్టడం. మా కొలీగ్ బాధకు తట్టుకోలేక కాస్త అరిచిందని చచ్చేట్లు తిట్టింది డాక్టరు. బోలెడు డబ్బు తీసుకుంటారు గదా... కాస్త మంచిగా వుండరెందుకని? అంతా కలిసి పది నిమిషాలు పట్టలేదు. దానికి ముందు ఎంత టెన్షనో చెప్పలేను. అసలా గదిలోకి తీసుకెళ్ళగానే నాకే భయంవేసింది. మా సుజాత ఇంకా ఒణికిపోయింది. పాపం... ఆవిడకోపక్కన ఎబార్షన్ అయిందే, బిడ్డ దక్కలేదే అని దిగులు, బాధ. కళ్ళనీళ్ళు పెట్టుకుంటోంది. డాక్టరు కాస్త ధైర్యం చెప్పి మోరల్ సపోర్టు ఇస్తే తేరుకునేది. డాక్టరదేమీ చెయ్యకపోగా నేనేదో చెబుతుంటే మీరు బైటికెళ్ళండి అని ఓ కసురు కసిరింది. సుజాతేమో నా చెయ్యి గట్టిగా పట్టుకుంది. 'ఏం చేస్తారండీ! మత్తు ఇస్తారా? అసలేమవుతుంది' అని ఒకటే ప్రశ్నలు, గొడవ. నాకు మాత్రం ఏం తెలుసు?ఆ డాక్టరు ఒక్కఅయిదు నిమిషాలు ఓపికగా అసలేం జరుగుతుందో చెబితే ఆవిడ భయం తగ్గేది. అజ్ఞానం భయానికి మూలం - అని తెలుసుగానీ నీ శరీరం గురించి నాకింత అజ్ఞానం వుందని నాకివేళే తెలిసింది. ఆవిడ నాకంటే అయోమయం. ఆ మొగుడేమో కనీసం హాస్పిటల్‌కి రాలేదు. ఆడవాళ్ళెంత టెన్షన్ అనుభవించాలో కదా శరీరాన్ని గురించి. ఏమీ తెలుసుకోకుండానే పిల్లల్ని కనేస్తారు. ఎంత భయపడతారో, ఎంత టెన్షన్‌కి గురవుతారో ఆలోచించేవాళ్ళెవరూ లేరు. భర్త, డాక్టరూ ఎవరూ పట్టించుకోరు.

"మొత్తానికి మత్తు ఇచ్చారు. అంతా అయిపోయి ఆ మత్తు తెలిసేటప్పుడు సుజాత ఎలా ఏడ్చిందో! 'అమ్మా' అంటూ అమ్మను తల్చుకొని ఏడ్చింది. అయిదునిమిషాలేకానీ ఆవిడమనసులోపలి పొరల్లో ఎక్కడో తనకష్టంలో ఆదుకునే సమర్థత వున్న తోడుకోసం ఆరాట పడుతోంది. తన భయాన్ని, అనుమానాల్ని, సందేహాల్ని పోగొట్టి ధైర్యం చెప్పే దిక్కులేక, ఆ దిక్కు కోసం హృదయవిదారకంగా ఏడ్చిన ఏడుపది. బహుశా ప్రతి స్త్రీ ఆ సమయంలో అలా ఏడుస్తుందేమో!

"మళ్ళీ తెలివి రాగానే కంట్రోలు చేసేసుకుంది. భర్త ఆఫీసుకి ఫోను చెయ్యమంది. చేశాను. అతను తనకేమీ పట్టనట్టు ఎట్లామాట్లాడాడో!మీరొకసారిరండి అంటే 'డబ్బులు చాలలేదా' అని అడుగుతాడు. కాదండీ సుజాత చాలా అప్‌సెట్ అయింది. మీరువచ్చి ధైర్యంచెప్పిఇంటికితీసుకెళ్ళండి'

అంటే 'నాకు చాలా అర్జంటుపని వుందండి, సాయంత్రం త్వరగా వచ్చేస్తాను. మీరే ఇంటిదగ్గర దిగబెట్టండి—అంటాడు. నాకు చచ్చే కోపం వచ్చింది. సుజాతకు ఈ విషయం చెబితే తనేమీ మాట్లాడలేదు. కానీ ఆవిడ కళ్ళల్లో దిగులు ఎలా కనిపించిందో. రేపట్నించీ మామూలుగా పనులన్నీ చేయిస్తాడు. సందేహంలేదు. ఆమె ఆరోగ్యం గురించి పట్టించుకోడు. ఆమె ఒక అనుభవాన్ని ...విషాదకరమైన అనుభవాన్ని, తన మనశ్శరీరాలు రెండూ తీవ్రంగా బాధపడిన అనుభవాన్ని పొందింది. ఆ అనుభవం గురించి ఆమెకే బోలెడు అయోమయంవుంది. కనీసం తనకు తెలిసిన, తను అనుభవించిన విషయాలు చెప్పుకోటానికి ఎవరూలేరు. ఎంత విషాదం ఆడవాళ్ళ జీవితం" కణతలు నొక్కుకుంది సహజ.

"కాసేపు పడుకోరాదు...తలనొప్పి తగ్గుతుంది" అన్నాడు ప్రసాద్.

"ఊఁ...లేకపోతే నీకు తలనొప్పి వస్తుందని నీ భయం. ఎంతయినా నువ్వూ మగాడివే! ఆడవాళ్ళ విషయాలు వినటం నీకూ విసుగే"

"అరే...ఎందుకలా అపార్థం చేసుకుంటావు! నీ తలనొప్పి గురించి నేనా మాట అన్నాను. నువ్వొక విషయం గురించి సీరియస్‌గా మాట్లాడుతుంటే నాకు విసుగా! నువ్వు కాస్త విశ్రాంతిగా పడుకుంటే తర్వాత మాట్లాడుకోవచ్చని అన్నాను. నీకు అందరిమీదా వున్న కోపం నా మీద చూపిస్తావు" ప్రసాద్ అనునయంగా అన్నాడు.

"సరేలే..నువ్వు చదువుకో. నే కాసేపు పడుకుంటాను. నిద్రపడితే బాగుండు" అంటూ కళ్ళు మూసుకుని పడుకుంది సహజ.




శారద ఇల్లు చేరేసరికి అయిదవుతోంది. హడావుడిగా బట్టలు మార్చుకునేసరికి చిత్ర స్కూలునుంచి వచ్చింది. చిత్రకీ, చందూకి స్నానం చేయించి ఇల్లంతా మామూలుగా సర్ది కాఫీ పెట్టేసరికి రామారావు రానేవచ్చాడు. శారదకు లోపల ఎక్కడో కంగారు. ఎందుకింత కంగారు పడుతోంది. తను బైటికెళ్ళివస్తే అది నేరమెందుకవుతుంది? తానే అది నేరమనుకుంటోందంటే తనెంత భయంకరంగా మారిపోయిందో అనుకుంటూ రామారావు కాఫీ తాగి ఇచ్చే కప్పుకోసం నుంచుంది.

"మధ్యాహ్నం ఎక్కడికి వెళ్ళావు?"

ఆ ప్రశ్నకూ, రామారావు గొంతులోని తీవ్రతకూ ఆశ్చర్యపడింది శారద. ఇతనికెలా తెలిసింది. ముఖం తెల్లగా పాలిపోయింది. లోపలెక్కడో, ఎందుకంత భయం. నువ్వేం తప్పుచేశావని అంతరాత్మ అడుగుతోంది.

"సహజ దగ్గరకు" అంది అసహనంగా.

"సహజ దగ్గరకా?" రామారావు కనుబొమలు ముడేసి అనుమానంగా చూశాడు.

"ఊఁ....సహజ దగ్గరికే" అతని అనుమానమేమిటో శారదకు అర్థంకాలేదు.

"సహజా వాళ్ళిల్లు అరండల్ పేటలో అయితే నువ్వు జిన్నాటవర్ మీదుగా ఎందుకెళ్ళావు. కన్నావారితోట నుంచి అరండల్‌పేట జిన్నాటవర్ మీదుగా బుద్ధి వున్న ఎవరైనా వెళ్తారా?" దొంగను పట్టుకున్న ఉత్సాహంతో అడిగాడు రామారావు. శారదకు చాలా అసహ్యమని పించింది, ఆ ఉత్సాహం- ఆ ప్రశ్నల తీరూ.

"ఇంటికి వెళ్ళలేదు. ఆఫీసుకి వెళ్ళాను. సహజ ఆర్. టి. సి.లో పని చేస్తోందని తెలుసుగా. బస్‌స్టాండులో వాళ్ళాఫీసుకి వెళ్ళాను"

"ఆఫీసుకా... ఏమిటంత అర్జంటుపని? ఆఫీసుకెళ్ళి మాట్లాడాల్సినంత అత్యవసర మైన విషయాలేముంటాయి మీకు" రామా రావుకి కోపం పెరిగిపోతోంది.

"ఏదో ఒకటి. వెళితే ఇప్పుడేమయింది? మీ కాఫీ వేళకు వచ్చేశాగా" శారద అతని కోపానికి భయపడుతూనే పట్టించుకోనట్టు సమాధానం ఇచ్చింది.

"ఇవాళ కాఫీ వేళకు వచ్చావు. రేపు అన్నంవేళకు కూడా రావు. నీ ఇష్టం వచ్చినట్టు పద్ధతి లేకుండా తిరుగుతున్నా వన్నమాట. అసలు నువ్వెళ్ళింది సహజ దగ్గరికేనా?" రామారావు విసురుగా లేచి నిలబడ్డాడు.

"చందూ ఇట్రారా" అంటూ ఓ పొలికేక పెట్టాడు.

చందూ భయం భయంగా వచ్చి శారద కుచ్చిళ్ళు పట్టుకుని నిలబడ్డాడు. చందూ వెనకాలే చిత్రవచ్చి తలుపు దగ్గర నుంచుంది. చిత్ర కళ్ళల్లో అయోమయం, కంగారు, చందూ భయం చూసిశారదకుకళ్ళనీళ్ళ పర్యంతమయింది.

శారద దగ్గర్నించి విసురుగా చందూని



లాగి ఇవతల నుంచోబెట్టాడు. చందూ కళ్ళు నీళ్లు చెంపలమీద కారటానికి సిద్ధంగా వున్నాయి.

"ఎక్కడికెళ్లావురా మధ్యాహ్నం" గద్దించి అడిగాడు.

"సహజత్త ఇంటికి" వాడు ఏడుస్తూ చెప్పాడు.

"సహజత్త ఇంటికా? ఆఫీసుకని చెప్పావు?" చందూని వదిలి శారద వైపు తన అనుమానం రుజువైందన్నట్టు గట్టిగా అడిగాడు.

"ముందు ఆఫీసుకెళితే సహజ లీవు పెట్టిందని తెలిసింది. అక్కడినుంచి ఇంటికెళ్ళాను" శారదకు దుఃఖం పొంగు కొస్తోంది.

చిన్న పిల్లాడిముందు తనను దోషిలా నిలబెట్టి వాడిచేత చెప్పించి, తనవి అబద్ధాలని రుజువుచేసి...ఏమిటీ చీదరంతా? ఇతని సంగతి తెలిసీ తనెందుకు ఇల్లు కదిలింది. ఈ దరిద్రపు పరిస్థితిలో ఎందుకుపడింది. ఇల్లు కదలకూడదు. ఎదురుమాట్లాడ కూడదు. స్నేహితులూ, సరదాలూ వుండ కూడదు. ఇలాగే ఈ మౌనంలోనే అణిగి అణిగి చచ్చిపోవాలి అంతే! అదే నయం. ఈ సందేహాలూ, సంజాయిషీలూ, పోట్లాటలూ పిల్లలముందు దెవిరింపులూ- ఇవన్నీ తను భరించలేదు.

"మాట్లాడవేం? ఎందుకంత అర్జంటుగా ఆఫీసుకీ, ఇంటికీ పరుగులు తీశావు... ఏం పని?"

"ఊరికినే" ఏడుపు దిగమింగుతూ అంది శారద.

"ఊరికినే పనిలేకుండా మిట్ట మధ్యాహ్నం పూరంతా చెడతిరుగుతారా ఎవరన్నా? ఏం రహస్యాలున్నాయి మీమధ్య" రామారావు ఇష్టమొచ్చినట్లు అంటున్నాడు.

"ఎందుకట్లా మాట్లాడతారు. సహజ కోసం ఒక బొమ్మ వేశాను. అది ఇవ్వటానికి వెళ్లాను. కావాలంటే చందూని అడగండి... ఆ బొమ్మ ఇచ్చానో లేదో" దుఃఖంతో, రోషంతో అంది శారద.

"మళ్ళీ బొమ్మలు మొదలెట్టావా?"

రామారావు గొంతులో వ్యంగ్యానికి శారద విలవిలలాడింది. అయినా ఏం మాట్లాడకుండా నుంచుంది. ఆమెకు హఠాత్తుగా అక్కడినుంచి మాయమవ్వాలని వుంది. భరించలేని అవమానంతో మనసు కుంగిపోతోంది. పిల్లలముందు ఏడవకూడదనీ, వాళ్లు భయపడతారనీ ఏడుపుని నిగ్రహించుకుందామని చూస్తుంటే అది సాధ్యపడటంలేదు.

"అమరావతిపిక్నిక్‌లూ, స్నేహితులకు బొమ్మలు వేసివ్వటాలూ, షికార్లూ, ఏమిటి ఇదంతా-ఇదంతా నాకిష్టం వుండదని తెలియదూ ... ఇంకెప్పుడూ ఇల్లు కదల గూడదు. నాకు తెలియకుండా నన్నడ క్కుండా నువ్వు ఇల్లు కదలకూడదు. కదిలావో" శారద జుట్టు చేత్తో పట్టుకుని తల వెనక్కి వంచాడు.

శారదకు మెదడంతా శూన్యంగా గందరగోళంగా అయిపోయింది. కళ్ళ ముందు ఏమీ కనిపించలేదు. కళ్లు పెద్దవి చేసి పిచ్చిగా చూసింది. కళ్ళముందు నల్లని మచ్చలేవో తిరుగుతున్నాయి. చందూ పెద్దగా ఏడుస్తూవచ్చి శారద కాళ్ళను వాటేసుకున్నాడు. చిత్ర కూడా ఏడుస్తూవచ్చి తల్లిపక్కనే నుంచుంది.

రామారావు శారదనొదిలి గదిలోంచి బయటికి వెళ్ళిపోయాడు. చందూని గుండెలకదుముకొని వెక్కి వెక్కి ఏడుస్తుంటే చిత్రా, చందూ పెద్దగా

ఏడ్చేశాడు.

నెమ్మదిగా తనను తాను కూడదీసుకుంది శారద. పిల్లల్ని వూరుకోబెట్టి వాళ్ళను తీసుకుని హాల్లోకి వచ్చింది. చిత్రని ఓ పక్కన కూచోబెట్టి పుస్తకాల సంచీ ముందు పెట్టింది. చందూ కూడా అక్కపక్కనే కూచున్నాడు. రామారావు హాలుమధ్యలో కుర్చీలో కూచుని అసహనంగా పేపరు తిరగేస్తున్నాడు.

శారద నెమ్మదిగా వంటింట్లోకి వెళ్ళి కూలబడింది. తన పరిస్థితిలోని నిస్సహాయత్వం, నీచత్వం శారదకు వద్దనుకున్నా ఆలోచనల్లో స్పష్టంగా కనబడుతోంది. అతని అనుమతి లేనిదే కదలగూడదని అయిదేళ్ళక్రితమే తెలిసినా కదిలితే జరిగేదేమిటో ఇవాళే శారదకు స్పష్టంగా తెలిసింది. తన లొంగుబాటువల్లే ఇంత కాలం ఈ చీదర జరగలేదు. పెళ్ళి జరిగాక అత్తిల్లూ, పుట్టిల్లూ, అతను తీసుకువెళ్ళిన ప్రదేశాలూతప్ప తనంతట తాను ఎక్కడికీ వెళ్ళలేదు. అతను పెట్టిన ఆంక్షలు మీరలేదు. బొమ్మలు వెయ్యొద్దంటే మానేసింది. అతనికిష్టంలేని పనులుమానేస్తే సరి... అది తనకు బాధగా వున్నా సరే అనుకుంది. తను సంసారం కోసం రాజీపడుతున్నాననుకుంది. కానీ ఇది రాజీకాదు. రాజీ ఇద్దరుమనుషులమధ్య జరుగుతుంది. తనసలు మనిషి కాకుండా పోయింది. తన వ్యక్తిత్వం, ఇష్టాలు, గౌరవం ఏమీ మిగల్లేదు. పిల్లల ఎదుట తనను కొట్టటానికి సిద్ధమయ్యాడు. ఇంకా తను తనకిష్టమైన పనులుచేస్తే తన్నులు తినాలి. తననొక పశువులా అతని దారికి మళ్ళించజూస్తున్నాడు. అనేక రకాలుగా మచ్చికచేసుకుంటాడు. తనో జంతువు. పశువు. మనిషికాదు. అరచేతుల్లో ముఖం దాచుకుని మళ్ళీ ఏడ్చింది.సహజ ఆఫీసుకని వెళ్ళింది. ఆఫీసుకి వెళ్ళలేదు. వేరేపనిమీద ఎక్కడికో వెళ్ళింది. ఆ సంగతి తనుచెబితే ప్రసాదెంత మామూలుగా వున్నాడు? ఏదో పనిమీద వెళ్ళివుంటుంది. వస్తే తెలుస్తుందని, అదొక విషయమే కానట్లు మాట్లాడాడు. సహజమీద అతనికెంత నమ్మకం, గౌరవం, ప్రేమ. సహజకెంత స్వేచ్ఛ. అయిదేళ్ళ జీవితంలో ఒక్కసారి తనంతట తాను రామారావుకి చెప్పకుండా బయటికెళితే ఎన్ని అవమానాలు. ఎన్ని చీదరింపులు. తిట్లు. తన్నులు. సంజాయిషీలు. తన జీవితానికీ, సహజ జీవితానికీ పోలికే లేదు. ఎందుకిలా జరిగింది? మనుషులంతా మంచిగానే వుంటారని తనెందుకు భ్రమ పడింది. పెళ్ళంటే మొగవాడి బానిసగా మారటమని తనకెందుకు తెలియలేదు. పెళ్ళనగానే ఏదో సంతోషం, తన స్వంత మనిషి రాబోతున్నాడనే ఉత్సాహం తప్ప ఆ వచ్చే మనిషి ఇష్టాయిష్టాలేమిటో, స్వభావమేమిటో తెలుసుకోవాలనే ఆలోచన ఎందుకురాలేదు. తన చుట్టుపక్కల సంసారాలన్నీ బాగానే వున్నట్టు కనిపించాయి...అది నిజమేనని అమాయకంగా నమ్మింది. ఇన్నాళ్ళూ తన సంసారమూ పచ్చని సంసారమని ఈ చుట్టు పక్కల ఇళ్ళవాళ్ళంతా అనుకుంటూ వుండి వుంటారు. ఈ లోపలి ఘర్షణ ఎవరికీ తెలియదు. ఎవరూ చెప్పకోరు తను చెప్పకోనట్టే!అయినా చేసుకోబొయ్యేవాడి స్వభావం ఏమిటో తెలుసుకు తీరాలనే ఇంగిత జ్ఞానం తను చదివిన చదువు ఎందుకివ్వలేదు. తన జీవితం సర్వనాశనమయింది. ఆ సంగతి తెలిసినా ఇంకా ఆ జీవితాన్నే పట్టుకుని వేళ్ళాడుతోంది.

ఈ సంసారం వదిలే ధైర్యం రావటం లేదెందుకని? అమ్మ ఏడ్చి చచ్చిపోతుందని దిగులు...

పిల్లలు ఏమవుతారు. వాళ్ళకెన్ని కష్టాలోనని భయం. లోకం ఏమనుకుంటుందోనని జడుపు-ఇవన్నీ తనను బయట పడనివ్వవు. ఈ సంసారంలో సమాధి చేసేస్తాయి. తను ఈ సంసారం వదిలేస్తానని తెలిస్తే అమ్మ తప్పకుండా చచ్చిపోతుంది. 'అమ్మా' అంటూ ఏడ్చింది శారద.

తల పగిలిపోతున్నట్లనిపించి రెండు చేతులతో తల పట్టుకుంది.

'ఇక ఇలాంటి పోట్లాటలు జరగకూడదు. ఎప్పటిలా ఇల్లు కదలకుండా వుండాలి. బొమ్మలు వెయ్యకూడదు. ఉదయం పూట పనిచేసుకోవాలి. మధ్యాహ్నం నిద్రపోవాలి. సాయంత్రం పిల్లలకు చదువు చెప్పుకోవాలి. రాత్రి అతని కోరిక తీర్చాలి - ఇదే తన జీవితం. అతను చూపించినదే తన ప్రపంచం. ఇక మిగతా ప్రపంచంతో తనకు సంబంధం లేదు. అసలెందుకు మిగతా ప్రపంచం? ఆ ప్రపంచం తనకేం ఒరగబెడుతుంది? ఆ ప్రపంచాన్ని చూడకుండా వుండలేనా? అయిదేళ్ళు బొమ్మలెయ్యకుండా వుండలేదూ? సహజను చూడకుండా వుండలేనూ? అలాగే ఇంకో పదేళ్ళు, పదిహేనేళ్ళు గడిపితే అయిపోతుంది. తన జీవితం ముగింపుకి వస్తుంది. ఇకప్పుడు తనొక మనిషినన్న విషయమే మర్చిపోయేంత బండబారిపోతుంది.... ఏ బాధా వుండదు!

కాని ఎందుకు, ఎందుకు, ఎందుకలా బండబారిపోవాలి? ఎందుకు సహజను చూడకుండా వుండాలి? ఎందుకు బొమ్మ లెయ్యకుండా వుండాలి? నాకు బైట ప్రపంచంలో తిరగటం ఆనందంగావుంటే అదెందుకు మానాలి? అతని ఇష్టానికంత బలమేమిటి? ఎక్కడినించి వచ్చింది? అతన్ని తను భరించటమేమిటి? ఎందుకు భరిస్తోంది? పిల్లలు...పిల్లల్నేం చెయ్యాలి? అసలు చచ్చిపోతే....? శారదకు దుఃఖం ఆగటంలేదు.

"అమ్మా ... అన్నం పెట్టవా?" అంటూ వచ్చాడు చందూ. వెనకాలే దిక్కుముఖం వేసుకుని చిత్ర కూడా వచ్చింది. శారద గబగబా బాత్‌రూంలోకి వెళ్ళి ముఖం కడుక్కుని వచ్చింది, బలవంతంగా ముఖమంతా నవ్వు పులుముకుని

"ఇంకా అన్నం వండలేదమ్మా. కాసేపు కూచోండి తొందరగా వొండుతాను" అంది.

బలవంతపు నవ్వుతో వికారమైన తల్లి ముఖం చూసి పిల్లలిద్దరూ మళ్ళీ హాల్లోకి వెళ్ళిపోయారు.

పిల్లల కోసం అన్ని పనులూ మామూలుగా చేసెయ్యవలసిందే ... అన్నం వండి అరటికాయ ముక్కలు వేయించి పిల్లల్ని పిలిచింది. రోజూ కథలు చెప్పమనీ, తినిపించమనీ, అన్నం వొద్దనీ మారాం చేసే పిల్లలిద్దరూ మాట్లాడకుండా అన్నం తింటుంటే శారదకు కళ్ళనీళ్ళు తిరిగాయి.

"కథ చెప్పనామ్మా?" అనడిగింది.

"వొద్దమ్మా..."అంటూ గబగబా అన్నం తినేశాడు చందూ.

వాళ్ళిద్దరికీ పక్కలేసి పడుకోబెట్టే సరికి రామారావు స్నానంచేసి వచ్చాడు.

"అన్నం పెట్టవా?" కర్కశంగా వుందతని గొంతు. మౌనంగా వెళ్ళి అతనికి అన్నం పెట్టింది. అతనూ మాట్లాడకుండా

తిని వెళ్ళి పడుకున్నాడు. శారదకు అన్నం తినాలనిపించలేదు. ఈ ఇల్లు తనది కాదు. తను తిన్నదో లేదో కనుక్కునే వాళ్ళులేరు. తను నవ్వినా, ఏడ్చినా పట్టించుకునేవాళ్ళులేరు. అయినా ఈ ఇల్లు పట్టుకు పాకులాడుతోంది. కానీ పిల్లలు లేరూ? ఇప్పుడంటే వాళ్లు చిన్నవాళ్లు. కష్టం సుఖం తెలియని పసివాళ్ళు. వాళ్ళకి ఏమీ అర్థంకాలేదు. కాస్త పెద్దయి ఊహ తెలిస్తే అమ్మ అన్నం తినకుండా పస్తులుంటే ఊరుకుంటారా? తన కన్నీళ్ళు తుడిచి తనకు అన్నం పెట్టరూ? తప్పకుండా పెడతారు. టేబిల్ మీద తలవాల్చి కుళ్ళి కుళ్ళి ఏడ్చింది శారద. ఇల్లంతా పద్ధతిగా ప్రశాంతంగా వుంది. ఎక్కడి వస్తువులక్కడ పరిశుభ్రంగా, పొందికగా వున్నాయి.

పిల్లలు హాయిగా నిద్రపోతున్నారు రామారావు గాఢంగా నిద్రపోతున్నాడు. ఆ రాత్రిపూట తన కన్నీరు తుడిచే చేయి కోసం అలమటిస్తూ ఏడుస్తూనే ఎప్పటికో నిద్రపోయింది శారద.

* * *

"సాజీ...."

కూరలు కొంటున్న సహజ వెనక్కి తిరిగి కూరల బుట్టతో నుంచున్న ఉషను చూసి నవ్వింది-

"మనం మార్కెట్‌లో కూడా కలుసుకోవచ్చన్నమాట" అంటూ.

"అయిందా నీ పని" అంది ఉష.

"ఆఁ...డబ్బులిచ్చేస్తే అయినట్టే. పదపోదాం"

"సాజీ... నాకు లీగల్‌గా విడాకులొచ్చేశాయి. నిన్ననే కోర్టునుంచి కాగితాలొచ్చాయి. మీ ఇంటికొచ్చి చెబుదాం అనుకుంటుంటే ఇవాళ నువ్వే కనిపించావు" అంది ఉష.

"అట్లా పార్కులోకి వెళ్ళి కూచుందాం పద. కాసేపు మాట్లాడుకుని పోదాం"

జనాన్ని తప్పించుకుంటూ పార్కులోకి దారి తీశారు.

"ఈ పార్కు మాత్రం మారలేదు. ఇంకా నాలుగు దశాబ్దాలు గడిచినా ఈ పార్కులోకి ఆడవాళ్ళు రారు" అంది సహజ పార్కు కలయజూస్తూ.

"అసలు మనూళ్ళో ఏ పార్కుకీ ఆడవాళ్లు రారులే. సినిమాలకెళ్ళటం తప్ప పార్కులకెళ్ళటం మనకు మాత్రం అలవాటుందీ"

ఇద్దరూ వెళ్ళి ఓ మూల చెట్టుకింద కూచున్నారు. ఆ వేళప్పుడు పార్కులో అల్లరి పిల్లలూ, అలసటతో నిద్రపోతున్న కూలీలూ తప్ప ఎవరూలేరు.

"ఊ... చెప్పు! విడాకులొచ్చేశాయా? నాలుగైదు నెలలు పట్టినట్లుందిగదూ"

"ఔను. శేషగిరి కూడా పేచీలు పెద్దగా పెట్టకుండా ఒప్పుకోబట్టి తొందరగానే తెమిలింది"

"పిల్లల సంగతేమన్నా వచ్చిందా?"

"ప్రత్యేకంగా ఏంలేదు. పిల్లలకోసం ప్రతి నెలా కొంత డబ్బు ఇస్తానని ఒప్పుకున్నాడు"

"అంటే మన లాయర్ అది అడిగాడా?"

"ఔనే అడిగాడు"

"ఒద్దనకపోయావా? అతని డబ్బు తీసుకోవటం ఎందుకు?" అంది సహజ ఆలోచనగా.

"వద్దనటం ఎందుకన్నాడు లాయర్! అతను తండ్రికాదా? అతనికి బాధ్యత లేదా? మీరు మరీ ఎక్కువ ఆలోచిస్తున్నారని చివాట్లు మొదలెట్టాడు. అన్ని

విషయాలూ ఆయనే బాధ్యతగా చూస్తున్నాడుగదా ఈ విషయం కూడా ఆయన చెప్పినట్లే చేశాను"

"నిజమేలే. పిల్లల్ని కని ఆ మాత్రం బాధ్యతకూడా లేకుండా ఎందుకు వదలాలి... సరేగాని ఈ మూడు నెలల్లో శేషగిరి వచ్చి పిల్లల్ని చూసి వెళ్లాడా?"

"నాలుగైదుసార్లు వచ్చాడు. పిల్లలతో సమస్యేననుకుంటానే - నాన్న ఎక్కడుంటున్నాడు. ఇక్కడెందుకుండడు. ఎప్పుడొస్తాడు-రకరకాల ప్రశ్నలు వేస్తారు. సమాధానం చెప్పలేకపోతున్నా. ఏంచెబితే వాళ్ళెలా ఫీలవుతారోనని భయం. ఎట్లా చెప్పాలో అర్థం కావటం లేదు" ఆందోళనగా మాట్లాడింది ఉష.

"వాళ్లు కాస్త పెద్దాళ్ళయితే నెమ్మదిగా అర్థమయ్యేలా చెప్పొచ్చులే. ఆ విషయం గురించి వర్రీ అవకు. శారద ఈమధ్య ఎప్పుడన్నా కలిసిందా? నువ్వు వాళ్లింటికి వెళ్ళలేదా?"

"లేదే మనం అమరావతి వెళ్ళి పదిహేను రోజులు దాటిందిగదూ. అప్పటి నుంచీ నాకు ఫీలవలేదు" అంది ఉష.

"ఒకసారి మా ఇంటికి వచ్చింది.నన్ను రమ్మంది కూడా నేనూ వెళ్లాలనుకుంటూనే వాయిదావేస్తూ వచ్చానే! పోయిన వారమంతా ప్రసాద్‌కి జ్వరం. నేనూ శలవు పెట్టి ఇంట్లోనే వున్నాను. వారంరోజులు ఇంట్లోనే వున్నందుకేమో...నాకూ అంత బాగోలా. ఇప్పుడెళ్దామా శారద దగ్గరకు?" అనడిగింది సహజ.

"పిల్లలు ఇంటిదగ్గర చూస్తుంటారే! వెళితే కనీసం రెండు మూడు గంటలన్నా కూచుంటాం. బాగా చీకటిపడిపోతుంది. పోనీ నువ్వెళ్ళు. నేను రేపెప్పుడన్నా వస్తానని చెప్పు" అంటూ లేచింది ఉష.

ఇద్దరూ పార్కులోనించి బయటకొచ్చి చెరొకవేపు నడిచారు.

సహజ శారదావాళ్ళింటికి వెళ్ళేసరికి ఆరుగంటలవుతూ వుంది. శారద వంట గదిలో వుంది. పిల్లల అలికిడిలేదు. రామారావు హాల్లో కూచుని పేపరు చదువుతున్నాడు. హఠాత్తుగా పేపర్లు ఈ ప్రపంచంలోంచి మాయమయితే ఇతను ఏంచేస్తాడా అనుకుంది సహజ. సహజను చూసి అతను మర్యాదకు కూడా నవ్వలేదు. తలెత్తిచూసి మళ్ళీ పేపర్లో తల దూర్చాడు. సహజ కూడా అతన్ని పట్టించుకోకుండానే వంటింటిలోకినడిచింది. సహజను చూస్తూనే శారద ముఖం వికసించింది. నాలుగు రోజుల్నించీ సహజ దగ్గరకు వెళ్ళి తన అశాంతినంతా చెప్పుకోవాలని ఆరాటంగావుంది శారదకు. కానీ మళ్ళీ సహజ మాటలు తల్చుకుంటే భయం. అయినా అవే వినాలనీ! సహజ తనను విమర్శిస్తేనే తనకు బాగుంటోంది. సహజతో మాట్లాడేటప్పుడు తనకు వూపిరి కోసం పెనుగులాడుతున్నట్లుగా, అతి కష్టంమీద వూపిరి పీల్చుకోగలుగుతున్నట్లుగా వుంది. అసలు నిర్జీవంగా వుండేకంటే వూపిరికోసం పెనుగులాడటం అద్భుతంగా వుంటుంది. ఒకోసారి ఈ పెనుగులాట ఇంక వద్దు, ప్రాణాలు విడవటం తేలిక ఇంతకంటే అనిపిస్తుంది. కానీ మళ్ళీ ఆ ప్రయత్నం చెయ్యాలనే కోరిక చాలా బలంగా తలయెత్తుతుంది. ఏమిటిదంతా ఎందుకిలా అవుతోంది-అని నాలుగైదు రోజులుగా శారద మథనపడుతోంది. ఇవాళ సహజ కనబడేసరికి ప్రాణం లేచొచ్చినట్లయింది.

"ఏంటే...అలాగయిపోయావు?ఒంట్లో బాగోటంలేదా??" అంది సహజ ఆదుర్దాగా.

"బాగానేవుంది.నువ్వెలా వున్నావూ?" నవ్వుతూ అడిగింది శారద.

"నాకేం...నువ్వే బాగోలేవు. ఎటన్నా పోదాం రారాదు. వంట ఓ గంటాగి చేసుకోవచ్చు" అంది సహజ.

"ఇప్పుడా? వంటయిపోయిందనుకో. పిల్లలు ఆకలంటూ వస్తారు...వద్దులే"

"పిల్లలేరి?" అంది సహజ అటూ ఇటూ చూస్తూ-

"పక్కింటికెళ్లారు. ఇప్పుడే వచ్చేస్తారు"

"వాళ్ళనుకూడా తీసుకెళదాం"

"ఇప్పుడెక్కడికెళతాంలే-పోనీ డాబా మీద కూచుందాం. కాసేపట్లో వెన్నెలొస్తుంది" అంది శారద.

"వెన్నెల రాగానే నేపోవాలి. ఆ షరతుమీద డాబామీదకు వస్తా" అంది సహజ.

ఇంతలో పక్కింట్లోనుంచి పిల్లలు వచ్చారు. పిల్లలతో వీళ్ళిద్దరూ డాబామెట్లు ఎక్కుతుంటే వింతగా చూశాడు రామారావు.

"ఊ ... చెప్పు విశేషాలు" అంది సహజ చాపమీద చతికిలపడుతూ.

"విశేషాలేమున్నాయి ... మామూలే" నిరాసక్తంగా అంది శారద.

"అమరావతి విషయం చెప్పావా?"

"ఊ..."

"ఏమన్నాడు?" కుతూహలంగా అడిగింది సహజ.

"ఏమంటాడు...తనకలాంటివి ఇష్టం లేదని తెలిసీ ఎందుకెళ్ళావన్నాడు"

"నాకిష్టమని నువ్వనలా?"

"అన్నాను. ఈ ఇంట్లో తన ఇష్టమే నడవాలట. తనే ఇంటి యజమానట" దుఃఖం నిండిన గొంతుతో చెప్పింది శారద.

"మరి నువ్వేవరివటా?" కోపంగా అంది సహజ.

"నేనడగలేదు"

సహజ కోపం పెరిగిపోయింది - "అడిగితే చెప్పేవాడే... పనిమనిషివని"

"అంతేగా మరి" అంది శారద పేలవంగా నవ్వుతూ.

"శారదా... మీ ఇద్దరి మధ్యా శరీర సంబంధం నడుస్తూనే వుందా?"

శారద ఎటో చూస్తోంది.

"చెప్పు... అలాంటిది సాధ్యమేనా? నిన్ను పనిమనిషిగా చూస్తూ అతనూ, అతనంటే ఇష్టం లేకుండా నువ్వూ... మామూలుగా సంసారం చేస్తూనే వున్నారా?"

"సాజీ... ప్లీజ్" శారద కళ్ళల్లో నీళ్ళు.

"నేను మాట్లాడను శారదా! కానీ నీ మనసునెలా చంపుకుంటున్నావా అని నాకాశ్చర్యంగా వుంది. నువ్వు చేసేది వ్యభిచారం కంటే హీనమని నీకనిపించటం లేదూ? మైగాడ్...రోజూ ఎన్ని లక్షల మంది స్త్రీలు ఇలా బలవంతంగా... ఆలోచిస్తే తల తిరుగుతోంది. ఎట్లా భరిస్తున్నావే దీన్ని..."

"ఏం చెయ్యను సాజీ!"

"అతనికి లొంగకు. అమ్మావాళ్ళ దగ్గరికెళ్ళు. లేదా విడిగా వుండు. నా దగ్గరికో, ఉష దగ్గరికో రా..."

"అమ్మ చాలా బాధ పడుతుంది అలా జరిగితే. అమ్మ కోసం, పిల్లల కోసమే నేనిలా వుంటున్నా సాజీ"

"మీ అమ్మకు నిజంగా నీమీద ప్రేమవుందా?" ఆవేశంగా అడిగింది సహజ.

"అదేంమాటే ... నీకు తెలియదా?

అమ్మ నన్నెంత ప్రాణంగా పెంచిందో"

"నిన్ను నిజంగా ప్రేమించేవాళ్ళెవళ్ళూ నువ్విట్లా చిత్రహింసపడుతుంటే ఆ చిత్రహింసేపడమని చెప్పరు. అమ్మ అలా చెబుతుందంటే ఆమెకు నీమీద ప్రేమకన్నా సంఘం అంటే భయం ఎక్కువగా వుందన్నమాట. ఆవిడ అజ్ఞానంతో నీ జీవితం గురించి ఆలోచించటం లేదన్నమాట. ఆ మూఢ ప్రేమ నీకేమీ మేలు చెయ్యదు. పిల్లలంటావా...? వాళ్ళని కూడా నీలాగే తయారు చేస్తావా? అతని నీడల్లా నోరూ, వాయి లేకుండా పెంచుతావా? వాళ్ళకు ఏమంచి విషయమన్నా నువ్వు నేర్పగలవా? నిజంగా పిల్లల దృష్టితో ఆలోచిస్తే నువ్వు చేసేది చాలా ఘోరం. నువ్వు బానిసగా వుంటూ వాళ్ళకు ఆత్మగౌరవంనేర్పగలవా? నిన్ను చూసి వాళ్ళేం నేర్చుకుంటారు? నీ మాటలకు వాళ్ళేం విలువ ఇస్తారు? తిండి వండిపెట్టి వొళ్ళు పెంచే మూర్ఖపు తల్లివేనా నువ్వు? వాళ్ళకు మంచి విషయాలూ,అసలైన విలువలూ నేర్పవా? అట్లా నేర్పటానికి నీకిపుడు అర్హత వుందా? నువ్వు ఆచరించని విషయాలు వాళ్ళకు చెప్పి నేర్పుతావా? అసలు పిల్లల కోసమే నువ్వు ఆత్మగౌరవం కలిగి వుండాలి. నువ్వతన్ని వదిలి వచ్చెయ్యమని నేను చెప్పను. అది నేచెప్పే విషయం కాదు. కానీ నువ్వు ఆత్మగౌరవం లేకుండా బతకటం నేను భరించలేకపోతున్నా ... నువ్వు దానికోసం ఏమీ స్ట్రగుల్ పడకుండా జీవచ్ఛవంలా పడి వుండటం నేను భరించలేకపోతున్నా... ఇది నా ఇల్లు మాత్రమే అని అతను స్పష్టంగా చెప్పాడు. రేపు నీ స్నేహితులు నా ఇంటికి రావటానికి వీలులేదంటాడు. ఏం చేస్తావు? ఎందుకీ పరిస్థితి తెచ్చుకున్నావు? నీ మౌనమే, నీ సహనమే, జీవితంపట్ల నువ్వలవరుచుకున్న ఈ నిర్లిప్తతే అతనికి అంత బలాన్నిచ్చింది, అతన్నింకా ఇంకా గట్టిపరిచింది. ఈ పరిస్థితికి నీ బాధ్యత చాలా వుంది"

సహజ మొహం కోపంతో ఎర్రగా కందింది.

"ఔను... నా బాధ్యత చాలా వుంది. కానీ ఆ మొదటిరోజుల్లో నాకు తెలియలేదు సాజీ! అతన్ని గౌరవంగా చూడటం, ప్రేమించటం, అతని ఇష్ట ప్రకారం నడవటం – ఇవన్నీ నా ధర్మాలని నాకెక్కడో నమ్మకం నాకే తెలియనంత బలంగా వుండి వుండాలి. ఆ నమ్మకం మొదటి రోజుల్లో నా అయిష్టాన్నీ, వ్యతిరేకతనూ పైకి రానివ్వలేదు. వాటిని లోపల నొక్కెయ్యటం నా ధర్మమనుకున్నాను. ఇక ఆ తర్వాత పిల్లలు పుట్టటం...ఒక రొటీన్‌కి అలవాటవటం జరిగిపోయింది. క్రమంగా నాలో జీవశక్తి నశించి నిర్లిప్తత పెరిగిపోవటం కూడా నేను గ్రహించలేకపోయాను. ఇప్పుడు బైట పడలేకా అక్కడ బతకలేకా నరకం అనుభవిస్తున్నా..."

"నేనొచ్చాక నీ నరకం మరీ ఎక్కువయిందిగదూ"

"నరకం ఎక్కువయిందిగానీ ఈ నరకంలో ఎక్కడో సజీవత్వం వుంది. నీ దగ్గరైనా నాకు ఊపిరాడుతున్నట్లుగా వుంది. సాజీ... నా స్నేహం వదలకే. నేను అంధకారంలో మగ్గుతున్నాసరే బైటికి వచ్చినాసరే...నీ స్నేహం నాకు కావాలి. జీవించకపోయినా జీవితాన్ని చూస్తూనైనా వుంటాను"






"అమ్మా...నాన్న పిలుస్తున్నాడు" పిల్లలు కేకలు పెట్టారు.

"చాలా టైమయింది. నేనూవా పోతా మరి"

సహజా శారదా కిందికి దిగివచ్చారు. సహజ మళ్ళీ ఇంట్లోకి రాకుండానే వెళ్ళిపోయింది.

సహజ ఇల్లు చేరేసరికి వెన్నెల బాగా వచ్చేసింది. ప్రసాద్ సహజ కోసం ఎదురు చూస్తూ వరండాలో నిల్చున్నాడు. సహజని చూస్తూనే...

"అమ్మయ్య...వచ్చేశావా? కూరలకని వెళ్ళి ఇంత సేపు రాకపోతే కంగారనిపించింది. అయినా ఇప్పుడు కూరలు తెచ్చి ఎప్పుడొండాలని" అంటూ సహజ చేతిలో బుట్ట అందుకున్నాడు.

"ఇప్పుడే వండుకోవచ్చులే" అంటూ సహజ వంటగదిలోకి వెళ్ళింది.

వంటంతా పూర్తయిందని గదిలోకి అడుగు పెట్టగానే తెలిసింది.

"రెండు నిమిషాల్లో స్నానం చేసి వస్తాగాని నువ్వెళ్ళి డాబామీద కూచో" అంటూ బాత్‌రూంలోకి వెళ్ళింది.

సహజ స్నానం చేసి డాబా మీదకు వెళ్ళేసరికి ప్రసాద్ చాపమీద పడుకుని వున్నాడు. పక్కనే ప్లేట్లూ, గ్లాసులూ, గిన్నెలూ వున్నాయి.

"మంచి అయిడియా వచ్చింది నీకు. నాకు బాగా ఆకలేస్తోంది" అంటూ అన్నం పడ్డించింది సహజ.

"ఇంతవరకూ శారదా వాళ్ళింట్లో వున్నాను. మార్కెట్లో ఉష కనిపించింది. కాసేపు కబుర్లు చెప్పుకుని నేను శారద దగ్గరకు వెళ్లాను. పాపం శారదేమీ బాగోలేదు."

ప్రసాద్ మౌనంగా భోజనం చేశాడు. సహజ కూడా ఏదో ఆలోచిస్తూ భోజనం ముగించింది. గిన్నెలు పక్కకు సర్ది చాపమీద కూచుంది. సహజ. ప్రసాద్ సహజ వొళ్లో తలపెట్టుకుని పడుకున్నాడు.

"వెన్నెలెంత బాగుందో కదు సాజీ" అన్నాడు సహజ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ.

"ఊఁ...బాగుంది" అని నిట్టూర్చింది సహజ.

"మీ స్నేహితుల్ని కలిసిన ప్రతిసారీ దిగులుగా అయిపోతావేమిటి? అలాగయితే ఎలా చెప్పు" బుజ్జగించాడు ప్రసాద్.

"ఏం చెయ్యాలి. నాకున్న మంచి స్నేహితులిద్దరూ దిగులుగా వొంటరిగా వున్నారంటే నేను హాయిగా వుండలేకపోతున్నా. శారద మరీ...దాన్ని నేనే ఎక్కువగా హింసిస్తున్నానేమో అనిపిస్తోంది"

"నిజమే నీకు ఆవేశం ఎక్కువ. అవతలివాళ్ళ పరిస్థితి అర్థం చేసుకోకుండా మాట్లాడేస్తావు. ఇవాళేమన్నా అన్నావా మీ శారదగారిని" జాలిగా చూస్తూ అడిగాడు ప్రసాద్.

"ఊఁ...బాగానే తిట్టాననుకుంటా. ఏమీ ప్రేమలేకుండా ఆ మొగుడొచ్చి కావలించుకుంటుంటే ఎలా భరిస్తారూ? అసహ్యం వెయ్యదూ?

శారద అలా వుందంటే నాకు పిచ్చి కోపం వచ్చింది ఏదేదో మాట్లాడేశాను"

"మీ శారదేగాదు. దేశంలో లక్షల మంది అలాగే వున్నారు. మనమేం చెయ్యగలం?"

"కానీ శారద నా స్నేహితురాలు. నేను దాని బాధ చూసొచ్చి సంతోషంగా వుండలేకపోతున్నా"

అసహనంగా అంది సహజ.

"నిజమే. అట్లా వుండాలంటే మనుషులు చాలా బండగా, ఏ సున్నితత్వమూ లేకుండా వుండాలి. కానీ మనం ఎన్నో విషయాలకి బండగా తయారవుతున్నాం. ఇంట్లోంచి బైటికి వెళితే కనబడేవి అన్నీ మనసుని కలచివేసే దృశ్యాలేగదా! హోటల్‌కెళ్ళి బాగా తిని వస్తుంటాం. బైట మెట్లదగ్గిర చిన్న చిన్న పిల్లలూ, ముసలి వాళ్ళూ మనల్ని పైసా పైసా అడుక్కుంటూ...ఎంత గిల్టీగా వుంటుంది. మనకంటే చిన్నపిల్లలు మనల్ని రిక్షాలో కూచోబెట్టి తొక్కటం.

ఎన్ని అన్యాయాలు, అక్రమాలు, ఎంత అవినీతి-అన్నిటినీ సహిస్తున్నాం... భరిస్తున్నాం.

మొన్న ఉదయాన్నే నువ్వు టేప్ రికార్డరు పెట్టి వంటింట్లోకి వెళ్ళావు. సుబ్బలక్ష్మిగారు అద్భుతంగా 'శ్రీరంగ

పుర విహారా' అని పాడుతున్నారు. నేను ఆ పాట మాధుర్యానికి తన్మయుణ్నవుతూనే పేపరు తెరిచాను. బీహార్‌లో ఓ గ్రామంలో హరిజనుల వధ అన్న వార్తా, ఆ వివరాలూ చదివేసరికి ఆ పాట నేనప్పుడు అలా వినటం చాలా అసందర్భంగా అనిపించింది. వెంటనే ఆ పాట ఆపేశాను. ఆ పాటను హాయిగా ఎలా వింటాం అనిపించింది.

"అప్పుడెప్పుడో నీరో చక్రవర్తి రోమ్ తగలబడుతుంటే ఫిడేల్ వాయించుతూ వున్నాడట. ఈరోజు మనందరం నీరోల వారసులమే.

"ఒకవైపు దేశం తగలబడుతోంది. ఇంకోవైపు సుఖపడే అవకాశాలున్న వాళ్ళందరం సుఖపడుతూనేవున్నాం. అన్యాయాలకూ, అక్రమాలకూ తలొగ్గుతూనే వున్నాం. దేశం తగలబడిపోతున్నా ఎవరికీ పట్టదు. ఆ మంటనెలా ఆర్పాలో మనకు తెలియదు. అట్లా బండగా తయారవక తప్పదన్నట్లుగా ఉంది సమాజం. ఇదంతా నీకు మాత్రం తెలియదా?"

సహజ వీపు నిమురుతూ ప్రసాద్ చెబుతుంటే సహజ ఏడ్చేసింది.

"ఛా...ఊరుకో పిచ్చిదానా. ఇప్పుడేమయిందనీ" ప్రసాద్ నెమ్మదిగా సహజను మామూలు మూడ్‌లోకి తెచ్చాడు.

"ఇంత భయంకరమైన పరిస్థితుల్లో నువ్వు నాకెలా దొరికావు?" ప్రసాద్ కళ్ళల్లోకి ప్రేమగా చూస్తూ అతని చెంపలు నిమురుతూ అంది సహజ.

"అదేమరి...నేనెంత మంచాడినో చూశావా?"

"గొప్పే" ప్రసాద్ చెంపమీద ఒక్కటేసింది.

"నీకు దొరికినందుకు ఇదన్నమాట శిక్ష"

ప్రసాద్ బిక్కముఖం పెట్టాడు.

"అది శిక్షయితే ఇది బహుమతి" అంటూ కొట్టిన చోటే ముద్దు పెట్టుకుంది సహజ.




శారద పిల్లల్నిద్దర్నీ తీసుకుని చల్లగాలికి డాబా మీదకు వచ్చింది. అప్పటికే చుక్కలూ, చందమామా ఆకాశంలో పచార్లు చేస్తున్నాయి. చందూ చందమామ వంక అలాగే చూస్తూ–

"అమ్మా ... చందమామ చుక్కలకి అమ్మ కదూ" అన్నాడు.

"ఔనురా" అంటూ వాడిని ముద్దు పెట్టుకుంది శారద. చిత్ర గుండెలమీద చేయి వేసుకుని కళ్ళు పెద్దవిచేసి–

"అమ్మో..అన్ని చుక్కలకి అన్నం పెట్టాలా చందమామ" అంది ఆశ్చర్యంగా.

"చుక్కలకి ఆకలెయ్యదమ్మా! అన్నం అక్కర్లేదు" అంది శారద నవ్వుతూ.

"మనకీ ఆకలెయ్యకపోతే బాగుంటుంది కదమ్మా" అంది చిత్ర ఆలోచిస్తూ.

"ఏం బాగోదు. మనకాకలెయ్యకపోతే పప్పు అన్నం ఎలా తింటాం" చందూ మాటలకి శారద పెద్దగా నవ్వుతుంటే వాడు సిగ్గుపడిపోయాడు.

"అమ్మా...కథ చెప్పవా?" చందూ అడిగాడు.

"నేను చెబుతాను. కానీ ముందు మీరు చెప్పాలి. చందూ ... ముందు నువ్వు చెప్పాలి. తర్వాత అక్క. తర్వాత నేను. చిన్నాళ్ళతో మొదలెట్టాలికదా"

చందూ ఆలోచనలోపడ్డాడు. ఆకాశం లోకి చూశాడు. చుక్కలు కనపడ్డాయి.

"అమ్మా..రెండు చుక్కలే భూమ్మీదకు వచ్చాయి"

"ఎందుకొచ్చాయి?" చిత్రకు వెంటనే సందేహం వచ్చింది.

"ఎందుకంటే...కుక్కపిల్లలు రమ్మన్నాయి. కుక్కపిల్లలూ, చుక్కలూ ఫ్రెండ్స్ అన్నమాట. చుక్కలు భూమ్మీదకొచ్చి చాలాసేపు కుక్కపిల్లల్తో ఆడుకున్నాయి. మళ్ళీ ఇంటికెట్లా వెళ్లాలో తెలియక ఏడుస్తుంటే వాళ్లమ్మ వచ్చి తీసుకెళ్ళింది. అమ్మా...నువ్వు చెప్పవూ" చందూ కథ తేలిగ్గా ముగించేశాడు.

"చిత్రా...నువ్వు చెప్పు" అడిగింది శారద.

"నాకు రాదమ్మా..నువ్వే చెప్పు" చిత్ర బతిమాలింది. పిల్లలిద్దర్నీ హృదయానికి హత్తుకుంది శారద. ఈ పసికూనల్ని ఎలా కష్టపెట్టాలి? శారద హృదయమంతా వాళ్లమీద ప్రేమతో నిండిపోయింది. తనమీద ఇష్టంతో, నమ్మకంతో వున్న ఈ అమాయకుల కళ్లల్లో సందేహం, భయం, అవమానం..ఇవన్నీ ఎట్లా తీసుకురాను? నా వల్ల కాదు అనుకుంది.

"అమ్మా...కథ చెప్పవూ?" చందూ గడ్డంపట్టుకుని ఆడిస్తూ అడిగాడు.

"చెబుతానమ్మా. మరేమో వారపూళ్లో..." శారద కథ చెప్పటంలో లీనమై రామారావు పిలుపుల్ని పట్టించుకోలేదు. రామారావే డాబా మీదకు వచ్చాడు.

"రాత్రిపూట ఇల్లు దొంగలకు వదిలేసి డాబామీద చేరావా? పద్ధతీ పాడూ వుండక్కర్లా! ఎంతసేపట్నించీ పిలుస్తున్నాను" పిల్లలు బిక్కముఖాలు పెట్టి కిందికి దిగారు.

"ఇంత రాత్రివేళ డాబామీదెందుకు? పిల్లల్నికూడా నీలాగే పద్ధతి లేకుండా తయారుచెయ్యి"కిందికొచ్చినా రామారావు సణుగుడు మానలేదు.

"వెన్నెల రాత్రిపూటే వుంటుంది. పగలు వుండదు. వెన్నెల కావాలంటే రాత్రిపూటే డాబామీదికి వెళాలి" పళ్ళ బిగువున సమాధానం ఇచ్చింది శారద.

"అమ్మా...అన్నంపెట్టు" అన్నాడు చందు నెమ్మదిగా శారద చెయ్యిపట్టుకుని.

శారద పిల్లలిద్దర్నీ తీసుకుని వంటగదిలోకెళ్ళింది. పిల్లల్ని నిద్రబుచ్చి రామారావుకి వడ్డించి అన్నంపెట్టానని పిల్చింది శారద.

''నువ్వు తినవా'' అన్నాడు ఏ కళనున్నాడో.

"తర్వాత తింటాను"

"తలొకసారి ఎందుకు? తిను నువ్వు కూడా" అన్నాడు అన్నం కలుపుతూ.

"నాకిప్పుడు తినాలని లేదు. మీరు తినండి" శారద విసుగ్గా అంది.

"నీకీ మధ్య స్నేహాలెక్కువై తలతిక్క పెరిగింది. ఒకమాట చెబితే వినేపనే లేకుండా పోయింది. భలే స్నేహితులు దొరికార్లే.ఒకరు మొగుడిచేత పంట చేయిస్తే, ఇంకోరు మొగుణ్నే వదిలేసేరకం. ఇక వాళ్ళతో నీ స్నేహం...."

"నా స్నేహితుల సంగతి మీకెందుకు? వాళ్ళనొక్క మాటన్నా నేనూరుకోను. కావాలంటే నన్నునండి ... వాళ్ళనెందుకు అంటారు?" శారద కోపంచూసి రామారావు హేళనగా నవ్వాడు.

"అబ్బో .... స్నేహితులమీద ఈగ వాలనివ్వవేం"

"మీకు రకరకాల స్నేహితులున్నారు. నేనెప్పుడన్నా వాళ్ళనేమన్నా అన్నానా?"

"మా స్నేహితులొచ్చి గంటలు గంటలు కూచుని విషం నూరిపొయ్యరు మీ వాళ్ళలాగా" రామారావుకి కోపం వచ్చింది.

"మొన్న మీ ఫ్రెండ్‌వచ్చి పిల్లలున్నారనైనా లేకుండా ఒకటే బూతులు మాట్లాడాడు. పిల్లలవి నేర్చుకుంటే? అయినా నేనేం అనలేదే? నా స్నేహితుల గొడవ మీకెందుకు?" ఆవేశంగా అంది శారద.

"ఎందుకా? నా ఇంటికి వచ్చి నా లెక్కలేకుండా వుండటానికి వాళ్ళెవరు. నీ తలపొగరు పెంచుతున్నారు. నీతీ నియమం లేకుండా పొగరెక్కి"

"ఆపండి. ఒక్కమాటన్నా నేనూరుకోను" శారద గట్టిగా అరిచింది.

"ఏంచేస్తావు...అహ...ఏం చేస్తావంట. నా ఇంట్లో నా ఇష్టం వచ్చినట్లు మాట్లాడుకుంటా ... నువ్వెవరు నన్నాపటానికి" రామారావు మంచినీళ్ళ గ్లాసు నేలకేసి కొట్టిలేచి నిలబడ్డాడు.అతని కళ్ళు కోపంతో మండుతున్నాయి. శారదకీసారి భయం వెయ్యలా. కసి పెరిగింది.

"నేనెవర్నా...నేనెవర్నో ఈ ఇంటికీ, నాకూ ఏం సంబంధమో చెప్పనవసరం లేనప్పుడే ఈ ఇంట్లో వుంటాను. ఈ ఇల్లు మీదే. మీరే వుండండి...ఊరేగండి"

శారద గబగబా బయటకు నడిచింది. గేటుతీసుకుని బజార్లోకి వెళ్ళి కాస్త దూరం వేగంగా నడిచి ఆగింది. ఎదురుగా రిక్షా వస్తుంటే ఆపి ఎక్కి, "బ్రాడీపేట రెండో లైను పదమూడో అడ్డరోడ్డుకి పోనీయ్" అంది.

రిక్షా కదిలాక చల్లగాలి తగిలితే తలంతా దిమ్ముగా వున్నట్లు తెలిసింది శారదకు.

అంత రాత్రివేళ వచ్చిన శారదను చూసి ఆశ్చర్యపోయింది ఉష. శారద ముఖంచూస్తే భయం వేసింది.

"ఏంటి శారదా...ఏం జరిగింది? ఇంత రాత్రివేళ ఒక్కతివే....ఏమయిందసలు? ముందు కూచో. మంచినీళ్ళివ్వనా?" ఉష మంచినీళ్ళకోసం పరుగెత్తబోయింది.

"ముందు రిక్షా అతనికి డబ్బులిచ్చి పంపు" అంది శారద కుర్చీలో కూచుంటూ. ఒళ్ళంతా నీరసంగా ఏ శక్తీలేనట్టు అనిపించింది శారదకు. ఉష రిక్షా డబ్బులిచ్చి మంచినీళ్లు తెచ్చింది. శారద మంచినీళ్ళు తాగి గ్లాసు ఉషకిస్తూ–

"రామారావుతో గొడవయిందే! ఆ ఆవేశంలో ఇంట్లో వుండనంటూ బయటికొచ్చేశాను. అమ్మావాళ్ళదగ్గరికి వెళ్లాలనిపించలేదు. నీదగ్గరకు వచ్చాను" అని చెప్పింది.

"మంచిపని చేశావుగానీ ... అసలు ఏమయింది?"

"రోజూవుండే గొడవే! అతన్నిక భరించటం నావల్లకాదు ఉషా" శారద ఏడుస్తుంటే ఉష ఓదార్చింది.

"ఊరుకో శారదా! అన్ని పరిస్థితులూ చక్కబడతాయి. నీకెలా బాగుంటే అలా ఉందువుగాని. మేంలేమా?నువ్వు ధైర్యంగా వుండు. పిల్లలేరి?"

''పిల్లలు నిద్రపోతున్నారు. ఆ ఆవేశంలో నాకేం ఆలోచన రాలా. పిచ్చిగా వీధిలోకొచ్చి మీ ఇంటికొచ్చేశా'' శారద కళ్ళు తుడుచుకుంది.

''అతనేమనుకుంటాడు... అంటే... నువ్వేమయ్యావనుకుంటాడు?''

''బహుశా అమ్మ దగ్గరకు వెళ్ళాననుకోవచ్చు. రేపొద్దున్నే పిల్లల్ని తీసుకుని అక్కడకి వస్తాడు. పిల్లల్ని ఒక్కక్షణం భరించలేడు. నేనూ రేపొద్దున్నే అమ్మా వాళ్ళింటికి వెళ్తానే'' శారద కళ్ళల్లో మళ్ళీ నీళ్లు.

"అలాగే వెళ్దువుగానిలే! ముందు లే... అన్నం తిందువుగాని'' ఉష లేచింది.

"నాకొద్దు ఉషా.... పడుకుందాం"

"బాగుంది... అన్నం తినకపోతే సమస్య తీరుతుందా?"

"కాదులే... నేతినలేను''

"ఐతే నేనూ తినను"

"నువ్వింకా తినలేదా?" ఆశ్చర్యంగా అడిగింది శారద.

"లేదు. పుస్తకం చదువుతూ పడుకున్నా. నువ్వు రాకపోతే అలాగే నిద్ర పోయేదాన్నేమో! లే.. కొంచెం తిందాం"

ఉష బలవంతంగా శారద చేత పెరుగన్నం తినిపించింది.

శారదకు ఆ గొడవలు మాట్లాడటం ఇష్టంగా లేదని గ్రహించి ఉష ఆ విషయాలు తరచి అడగలేదు. మర్నాడు తను కాస్త మామూలయితే చెబుతుందిలే అని వూరుకుంది.

"ఉషా...ఎలావుందే నీ జీవితం! నా బాధల్లో పడి నీ సంగతులేమీ పట్టించుకోలేదు" అంది హఠాత్తుగా శారద.

"నా జీవితానికేం... బ్రహ్మాండంగా వుంది. ముఖ్యంగా ఎంత చాకిరీ తప్పిందో చెప్పలేను. సుఖపడి పోతున్నానంటే నమ్ము" అంది ఉష నవ్వుతూ.

"అయితే మొగుడు లేకపోవటం ఆడదానికి సుఖమేనంటావు" అంది శారద కూడా చిన్నగా నవ్వుతూ.

అప్పటిదాకా ఏడ్చిన శారద ముఖంలో ఈ నవ్వు వింతగా కనబడింది. ఆ నవ్వు చూసి ఉష ఇంకా పొడిగించింది.

"సుఖమా, సుఖమున్నరా ... అవి అనుభవించాలేగాని చెప్పలేం. అంతకు ముందు అయిదింటికి లేచినా పనయ్యేది కాదు. అతనికి కాఫీ కలపటానికి, షేవింగ్‌కి వేడినీళ్ళు అందించటానికి, నిద్ర లేచాడా లేదా అని ఆ గదికీ వంటింటికీ తిరగటానికీ గంటపట్టేది. కాళ్ళు పీక్కుపోయేవి ఇప్పుడు అదంతా తప్పిపోయిందిగా'' అంది సరదాగా.

ఈ సారి శారద నవ్వలేదు. ఆలోచనల్లో పడింది.

"శేషగిరి వస్తున్నాడా పిల్లల్ని చూడటానికి?" అంది మళ్ళీ కాసేపాగి.

"ఆఁ ప్రతినెలా వచ్చి పిల్లలకోసం డబ్బులిచ్చి వెళ్తూనే వున్నాడు. పిల్లల ప్రశ్నల్ని ఎదుర్కోవటమే కష్టంగా వుంది. కాస్త పెద్దాళ్ళయితే వివరంగా చెప్పొచ్చు. వాళ్ళకిపుడు అర్థంగాదు. నాలుగయిదేళ్ళు ఇలాగే కష్టపడితే వాళ్ళకీ అర్థమవుతుంది" అంది ఉష.

"శేషగిరి వచ్చినపుడు ఇబ్బందిగా లేదూ?"

"అన్నిటికీ అలవాటు పడాలి. ఇబ్బంది అనుకుంటే "ఎట్లా" ఉష మామూలుగా అంది.

"సహజ పది రోజుల క్రితం వచ్చి బాగా తిట్టింది నన్ను'' అంది శారద.

"తిట్టటమేమిటే... నీ జీవితం బాగా




లేదనే బాధతో కోపంతో అంటుంది. సహజ సంగతి మనకు తెలియదా?"

"వంటరిగా వుండటం కష్టంగా లేదా ఉషా?"

"లేదే .... ఇష్టంలేని మనుషులతో వుండటం కంటే వంటరిగా వుండటమే బాగుంటుంది. కనీసం నాకలా వుంది" కచ్చితంగా చెప్పింది ఉష

"నిజమేనేమోలే ఉషా! నాకు నీ విషయం గుర్తొచ్చినప్పుడల్లా ఇందులో ఏదో లోపం వుంది అనిపిస్తోంది. మగాడు.. అతను సులభంగా బైటపడిపోయాడు. నువ్వు విడాకులిచ్చావు. అతనికిక ఏ సమస్యాలేదు. ఇంకో అమ్మాయితో గడుపుతున్నాడు. ఆమే నీలాంటిదైతే ఇంకొకరికోసం ప్రయత్నిస్తాడేమో. స్త్రీలంతా నీలాగే ఈ సమస్యను డీల్ చేసే అది మగాళ్ళకే లాభంలా వుంది గదే...ఉద్యోగం చేసే అమ్మాయిని పెళ్లాడతాడు. ఇంకొకర్ని ప్రేమించా నంటాడు. మొదటి భార్య విడాకు లిస్తుంది, అతనికి అడ్డులేదు. ఎలా?"

"నువ్వో పెద్ద సినిక్‌లా మాట్లాడు తున్నావే" అంది ఉష.

"ఆడాళ్ళూ, మగాళ్ళూ ఎవరికి ఏ పద్ధతీ లేనట్లు ఇష్టం వచ్చినట్లు తిరుగు తారన్నట్టూ, పెళ్ళితో మాత్రమే వాళ్ళను గట్టిగా పట్టివుంచాలన్నట్టూ మాట్లాడు తున్నావు. నిజానికి ఈ సమస్యలన్నీ ప్రేమ లేకపోవటం మూలాన వస్తాయని పిస్తోంది. ఈ సమాజంలో ప్రేమకు విలువలేదు. నిజమైన ప్రేమకు అవకా శమూలేదు.

"అందువల్లే ఈ సమస్యలు వొస్తున్నా యేమో. నిజమైన ప్రేమ ఏ సమాజంలో దొరుకుతుందో తెలిస్తే అక్కడికి పోదా మనిపిస్తోంది శారదా! నా ప్రేమను ఎవరైనా అర్హుడైన వ్యక్తికి ఇవ్వాలనిపిస్తోంది. నాలో ప్రేమించే శక్తి వుంది. ప్రేమ సంపాదించుకోగలననే ఆత్మవిశ్వాసం వుంది. ఈ సమాజంలో అది సాధ్యమా అనేదొకటే ప్రశ్నగావుంది. సాధ్యమే నంటుంది సహజ. సాధ్యమైతే...నా ప్రేమను పొందగల వ్యక్తి నన్ను ప్రేమించే మనిషి తటస్థపడితే బాగుండు ననిపిస్తోంది. ఏంటి శారదా ఏంటలా చూస్తున్నావు?" ఉష ఆశ్చర్యంతో చూసింది.

శారద ఈ లోకంలో వున్నట్టులేదు.

'ఉష...తన స్నేహితురాలు ఉష. ఇప్పుడు ప్రేమించాలనుకుంటోంది. ప్రేమ కావాలనుకుంటోంది. పెళ్ళయి ఇద్దరు పిల్లల తల్లయి, మొగుడు వదిలేశా డని పేరు తెచ్చుకుని ఇప్పుడు ప్రేమ విలువ తెలుసుకోగలిగింది. ఎవరైనా మంచి మనిషి తనను ప్రేమిస్తే స్వీక రించటానికి సిద్ధంగా వుంది. ఈ ఉష నిస్సహాయురాలుకాదు. అబల కాదు. బేలకాదు. జీవశక్తితో నిండిన మనిషి. జీవితాన్ని ప్రేమించే మనిషి. జీవితం విలువ తెలిసిన మనిషి. భర్త తననొదిలి మరో స్త్రీని చేరితే చచ్చిపోలేదు. అతని పాదాలు పట్టుకు పాకలేదు. తనజీవితాన్ని తాను నిర్మించుకునే ప్రయత్నం చేస్తోంది.

ఉష పట్ల గౌరవంతో ప్రేమతో శారద మనసు నిండిపోయింది.

చటుక్కున ఉష చేయి పట్టుకుని ముద్దు పెట్టుకుని,

"నిన్ను ప్రేమిస్తున్నానే ఉషా" అంది శారద కళ్ళ నీళ్ళతో.

ఉష గలగలా నవ్వింది. సజీవమైన నిర్మలమైన ఉష నవ్వుతో ఆ నిశ్శబ్ద రాత్రి ఊపిరి పోసుకుని చైతన్యవంత మయింది.



# వాచీ

హయగ్రీవరావు చేతి గడియారాలు తయారుచేసే ఓ సంస్థలో ఇంజనీరు. ఎలక్ట్రానిక్స్‌కి సంబంధించిన శిక్షణకోసం ఫారిన్ వెళ్ళొచ్చిన హయగ్రీవరావు, తన ఈ వున్నతికి కారకుడైన లెక్కల మేస్టారుని కలిసేందుకు వెళ్ళాడు.

హయగ్రీవరావు గురుభక్తికి సంతోషంతో పొంగిపోయారు మేస్టారు.

"మీ కోసం ఓ బహుమతి తెచ్చాను మేస్టారూ! మీకు మంచీ చెడూ, వారం పర్వాలపై గురి ఎక్కువకదా! అలాంటి మీకు బాగా వుపయోగపడేట్టు ఓ వాచీని నేనే స్వయంగా తయారుచేశాను...స్వీకరించండి'' అంటూ చనువుగా ఆయన కుడి చేతిని అందుకుని వాచీ తగిలించాడు హయగ్రీవరావు.

మేస్టారు సంతోషంతో తబ్బిబ్బవుతూ, "ఇదేమిటి బాబూ? సాధారణంగా వాచీని అందరూ ఎడమచేతికి కదా పెట్టుకునేది?'' అంటూ శిష్యుడికేసి సందేహంగా చూశారు!

"దానికి కారణం తర్వాత తెలుస్తుంది గానీ ముందు ఈ వాచీ ఎలా పనిచేస్తుందో చెబుతా వినండి'' అంటూ ప్రారంభించాడు హయగ్రీవరావు.

"వాచీ డయల్‌లో కుడివైపున్న ఈ దీర్ఘచతురస్రాకారపు గడిలో తేదీ, వారం కనబడుతుంది. ఎడమవైపు గడి నెల, సంవత్సరాల్ని చూపుతుంది. ఇక్కడున్న కీ తిప్పితే అదే గడిలో తెలుగు నెల, తెలుగు సంవత్సరం కనబడతాయి''

"ఒకే గడియారంలో ఇన్ని తెలుస్తాయా? ఆహాఁ...'' అంటూ ఆశ్చర్యంతో నోరు తెరిచేశారు మేస్టారు.



# చమత్కార కథలు



"ఈ ముళ్లు చూడండి! ఇవి రాహు కాలం, వర్జ్యం, యమగండ కాలాల్ని చూపిస్తాయి. ఆ టైములో 'డేంజర్' అని తెలియజేసేందుకు అవి ఎర్రగా వెలుగుతాయన్న మాట!"

"అబ్బో!!'' ఈసారి ఆశ్చర్యంతో, తెరిచివున్న నోట్లోకి దూసుకుపోయిన ఈగను కూడా పట్టించుకోలేదు మేస్టారు. పైగా దాన్ని బెల్లం పలుకులా చప్పరించి మింగేశారు.

"అంతా బాగానేవుందిగానీ, ఇందులో ఇపుడు టైమెంతయిందో తెల్సుకోవడం ఎలాగనేది చెప్పనేలేదు నువ్వు" అన్నాడు ఆఖరికి.

"దానికోసం నేను రీసర్చి చేసేదేముంది సార్! మీ ఎడమ చేతికి మా కంపెనీ తయారుచేసే మేలైన వాచీల్లో ఏది పెట్టుకున్నా సరే...ఇట్టే టైమ్ తెలిసిపోతుంది'' అన్నాడా శిష్యపరమాణువు.

—జాకీ

## మకర న్యాయం

ఆ మంత్రిగారు చిన్నప్పుడు చేపలు పట్టుకుని జీవించేవాడు. తరువాతి కాలంలో గాలం వేయటంలో నైపుణ్యం పెరిగి ప్రజలకే గాలాన్ని వేసి పట్టుకుని కౌన్సిలర్ స్థానం నుంచీ క్రమక్రమంగా అభివృద్ధిచెంది నేటికి మినిస్టరయ్యాడు. అతనిలో మెచ్చదగిన గుణం – రోజూ అలవాటు పోకుండా ఓ గంటసేపు చేపలు పట్టటం. ఆ చెరువులోనే వున్న మొసలికి కొంత మాంసాన్ని ఆహారంగా వేయటం కూడా అతని దినచర్యలో భాగమే. ఈ రెండు పనులే తన రాజకీయ జీవితానికి అజ్ఞాత మార్గదర్శకమని అతను చాలా గట్టిగా నమ్ముతున్నాడు. అలాగే ఓరోజు నదిలో చేపలు పట్టి తను తెచ్చిన మాంసాన్ని మొసలికి వేస్తూ తనకెదురైన సమస్యలను ఎలా పరిష్కరించుకోవాలో, ముఖ్యమంత్రికి ఏ గాలం వేసి ఆర్థికమంత్రిగా మారాలో ఆలోచిస్తూ పొరపాట్న జారి నదిలో పడ్డాడు. తనకు ఈతరాకపోవటంతో బెంబేలెత్తిపోయి అరవబోయేంతలో ఓ చెక్క ముక్క దొరికింది. దానిమీదకెక్కి నీళ్ళను కదిలించాడు. వెంటనే అతడు ఊహించని వేగంతో ఆ కర్రముక్క నీటిలో ప్రయాణించసాగింది. అది మొసలి అని అర్థమవగానే గుండె చిక్కడిపోయిందతనికి. అయినా 'ఇది తన పెంపుడు జంతువుతో సమానం కదా!



దీనికి భయపడటమెందుకు అనుకుని కాస్తంత తీరిగ్గా వూపిరి పీల్చుకుని,

"మొసలి మిత్రమా! ఇన్నాళ్ళూ నేను పెట్టిన తిండికి ప్రత్యుపకారంగా నన్నీ వేళ రక్షించావు. చాలా థాంక్స్!" అన్నాడు.

అందుకా మొసలి సన్నగా నవ్వింది. కానీ బదులు చెప్పలేదు. దాంతో చెమటలు పట్టాయి మంత్రికి. హఠాత్తుగా తాను పంచతంత్రంలో చదువుకున్న 'మొసలి-కోతి' కథ గుర్తుకు వచ్చింది. దేవుడికి మనసులోనే థాంక్స్ చెప్పి, కొంచెం తేరుకుని తన సంభాషణను పొడిగించాడు-

"మిత్రమా! నేను రోజూ వేసే ఆహారం నీకు చాలకపోతే ఈ రోజు నన్నే తినేసేయి. నేనందుకు సిద్ధమే. కానీ నేనీరోజు నా హృదయాన్నీ, మెదడునీ మా ఇంటిదగ్గర పెట్టి వచ్చాను. నీవు గనుక దైమిస్తే అవి తీసుకువచ్చి నీకు ఆహారంగా మారిపోతాను. మెదడూ హృదయంలేని మనిషిని తింటే నీకు పది లేకపోగా 'మానవ హత్యాదోషం' కలుగుతుంది" అన్నాడు అనునయంగా.

దానికి మొసలి నవ్వి "మంత్రి సత్తమా! నేను పురాణ కాలంనాటి మొసలిని కాను. నీవు మెదడు, హృదయాలను వదిలి వచ్చానంటున్నావే! రాజకీయ నాయకులకి హృదయమనేది ఉండదని ఈ ప్రపంచం మొత్తానికి తెలుసు. ఇక మెదడు విషయమంటావా! అది నీకు లేదని తెలుస్తూనే వుంది. మెదడు వున్నవాడెవడయినా పొలిటీషియన్ అవుతాడా?" అంటూ నీటిలో మునిగి ఆయన్ని సుష్టుగా ఆరగించసాగింది.

-కస్తూరి రాజశేఖర్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

ugu Monthly, Hyderabad-500 482 . Regd. No. H/HD /40

జంతువులు మాట్లాడే
తొలి తెలుగు చిత్రం

సంగీతాలయ





# మాకూ స్వాతంత్ర్యం కావాలి

రమేష్ నాయు
పి.యస్. ప్రకాష్
ఎడిటర్ : కె. బాలు

SURYA

